అపరాధ పరిశోధన అనుబంధం—46

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నల్ల చిరుతలు

2-9-78

రచన : లలితకుమారి

## లక్ష్మి చెర

16

రచన : వసుంధర

## మానవుడా? దానవుడా?

రచన : అజీజ్

## రంగూన్ మిత్రుడు

రచన : కురుమద్దాలి విజయలక్ష్మి

'శాన్యోరా' సీరియల్-పదకొండవభాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—46
అక్టోబర్, 1977
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.



# నల్ల చిఱుతలు!

లలితకుమారి

"మిస్టర్ సారథీ! ఎప్పుడైనా నీవు నల్ల చిఱుతపులుల గురించి విన్నావా?" అడిగారు సి. బి. ఐ. డైరెక్టర్ ముఖర్జీగారు సాండో చుట్ట వెలిగిస్తూ.

"విన్నాను! ఆ జాతి చిఱుతలు మలేసియా, థాయ్‌లాండ్ అడవుల్లో తప్ప మరెక్కడా దొరకవు" అన్నాను.

"వెరీ గుడ్! ఇక విను. థాయ్‌లాండ్‌లో నివసించే సుహార్తో అనే జమీందారు దగ్గిర ఆ జాతి చిఱుతలు రెండు ఉన్నాయి. అతనికి అప్పుడప్పుడూ తనింట్లో కాక్‌టేల్ పార్టీలివ్వడం అలవాటు. ఆ పార్టీల్లో తన పెంపుడు చిఱుతల్ని అతిథుల ముందు ప్రదర్శించి ఆనందిస్తుంటాడు.

అలా ప్రదర్శించే ముందు వాటికి మత్తుమందు తినిపించడం జరుగుతుంది. దానివల్ల అవి ఎవ్వరికీ హాని తలపెట్టే ప్రయత్నం చెయ్యవు. ఈ వ్యవహారం గత ఆరేళ్ళనించీ సాగుతోంది.

కాని, ఈ మధ్యే అంటే రెండు నెలల క్రితం, పార్టీలో ప్రదర్శనార్థం తీసుకురాబడ్డ ఆ చిఱుతల్లో మగ చిఱుత హఠాత్తుగా ఓ అతిథిమీద లంఘించి చంపి వేసింది. బహుశా, దానికి తినిపించిన మత్తుమందు ప్రభావం నిర్ణీత సమయానికి ముందే దిగివుంటుంది.

ఆ సంఘటనతో ఆ జమీందారు మనసు విరిగి, వాటిని అమ్మివేయాలని నిర్ణయించాడు. మన జంతుప్రదర్శనశాలల్లో నల్ల చిఱుతలు లేని కారణంగా వాటిని కొనడానికి నిర్ణయించాం!" అని ఆయన చిన్నగా నవ్వి- "వాటిని తెప్పించడానికి వన్య మృగాల గురించి బాగా తెలిసిన జయశంకర్ అనే ఉద్యోగిని పంపుతున్నాము. ఆ జయశంకర్ ఎవ్వరో కాదు. నువ్వే!" అన్నారు.

ఆశ్చర్యంతో తెరుచుకున్న నా నోరు తిరిగి మూసుకోలేదు.

"థాయ్‌లాండ్ వెళ్ళడానికి నీ పాస్‌పోర్టూ, వీసా వగైరా రెండు రోజుల్లో రెడీ అవుతాయి. ఆ జమీందారు భవనం లంపాంగ్ నగరంలో ఉంది. నీవు తిన్నగా అక్కడికెళ్ళి, నీ ఐడెంటిఫికేషన్ చూపించాలి.

ఆ చిఱుతపులుల బాగోగులు చూసే నౌఖర్లు నీకు వాటి అలవాట్లగురించి చెబుతారు. తరవాత, నీవు వాటిని బోనులో బంధించి, లంపాంగ్ రైల్వే స్టేషన్‌కి తీసికెళ్ళాలి. అక్కణ్నించి ఓ రైలు మార్గం తిన్నగా బర్మా

వరకూ వేసి వుంది.

లంపాంగ్ నించి బర్మా వెళ్ళే గూడ్స్‌లో చిఱుత పులుల్ని ఎక్కించి బైలుదేరు. బర్మా చేరగానే వాటిని ఓడలో మద్రాసు వరకూ తీసుకురా. అంతటితో నీ బాధ్యత తీరిపోతుంది.''

సాలోచనగా అలూపాను. ''చిఱుతల్ని తేవడం కేవలం ఒక సాకు! ఇంకేదో రహస్యమైన పనిమీద నన్ను పంపుతున్నారు మీరు. లేకుంటే ఒక సి. బి. ఐ. అధికారియైన నన్ను ఈ పనికి నియమించడం ఏమిటి?''

ఏష్‌ట్రేలో చుట్ట నుసి దులుపుతూ పెద్దగా నవ్వారు ముఖర్జీ.

''మొత్తానికి ఊహించావన్నమాట. గుడ్! ఇహ విషయానికి వస్తున్నాను విను.

థాయ్‌లాండ్‌లో ఒక 'ఫ్రీలాన్స్ ఏజెంట్' నివసిస్తున్నాడు. అంటే రహస్యాల వ్యాపారి అన్నమాట! అదొక వృత్తి. ఆ వృత్తి చేపట్టిన వ్యక్తులకి ఒక దేశమంటూ వుండదు. ప్రాణాలని పణం పెట్టి వివిధ దేశాల రహస్యాలు తస్కరించడం, ఎవరెక్కువ మొత్తం చెల్లిస్తే వారికి అమ్మడం వారి వృత్తి.

ఆ ఫ్రీలాన్స్ ఏజెంట్ పేరు గోంబా! అతను ఆఫ్రికన్ నీగ్రో. మన శత్రుదేశానికి సంబంధించిన కొన్ని కీలకమైన రహస్యాలు తస్కరించి మనకు అమ్మజూపుతున్నాడు. ఆ దేశంలో ఈ మధ్యే మిలటరీ బలాలు ప్రజా ప్రభుత్వాన్ని కూలదోసి అధికారాన్ని హస్తగతం చేసుకున్న విషయం జగద్విదితం!

అక్కడి, ప్రభుత్వం మిలటరీ చేతుల్లోకి వెళ్ళింది

అంటే మనకేదో ముప్పొచ్చిందీ అనుకోవాలి. అక్కడి సైనిక పాలకులు తరుచూ తమ దేశంలో ఏవో గొడవలు సృష్టించుకుని అవి పరాకాష్ట నందుకునేసరికి ప్రపంచ దృష్టి మళ్ళించడానికి ఏదో ఒక సాకుతో మనమీద దాడి ప్రారంభిస్తారు.

వీటి దృష్ట్యా ఆ రహస్యాల వ్యాపారి సేకరించిన సీక్రెట్స్ ఏమిటో తెలుసుకోవాలన్న కుతూహలం మన కుండటం సహజం. అందుకే ప్రభుత్వం వాటిని కొనుక్కో వాలని నిర్ణయించింది. వాటిని పరిశీలించి, శత్రుదేశ గతి విధుల్ని ముందే పసిగట్టి, దాడి జరిగితే సులువుగా తిప్పి కొట్టటానికి అవకాశం ఉంటుంది.

యాభైవేల థాయ్‌లాండ్ కరెన్సీ ఇస్తే వాటిని అమ్ముతానని కేబుల్ పంపాడు గోంబా! అతని బేరం స్వీకరించబడింది. ఈ రోజు ఎనిమిదో తేదీ. సరిగ్గా పదో తేదీన మా ఏజెంట్ లంపాంగ్ నగరంలో, రెడ్ రిబ్బన్ హోటల్ బార్ రూంలో కూర్చునుంటాడనీ, అతని దగ్గిర డబ్బు తీసుకుని ఆ సీక్రెట్స్ అతని కిచ్చెయ్యమనీ గోంబాకు మెసేజ్ పంపాం!'' అంటూ ముగించారు ముఖర్జీ.

''ఆల్ రైట్! నేను వెళ్ళడానికి సిద్ధంగా వున్నాను. ఏర్పాట్లు చెయ్యండి!'' అన్నాను లేస్తూ.

# 2

లంపాంగ్ ఏర్‌పోర్ట్‌లో విమానం దిగగానే టాక్సీ ఎక్కి తిన్నగా రెడ్ రిబ్బన్ హోటల్ చేరుకున్నాను. ఓ సింగిల్ రూం తీసుకుని స్నానం అదీ కానిచ్చి బట్టలు మార్చుకున్నాను. ముఖర్జీగారి ఆదేశానుసారం ఎర్ర

గులాబీ తీసి, క్లిప్‌తో కాలర్‌కు తగిలించాను.

సాయంత్రం ఐదున్నర అవుతోంది.

గది లాక్ చేసి, లిఫ్ట్‌లో కిందికెళ్ళి హోటల్ బార్‌లో ప్రవేశించాను.

ఆడా మగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ తాగుతున్నారు. చుట్టూ కలయజూస్తూ వెళ్ళి ఓ ఖాళీ టేబిల్ ముందు కూర్చున్నాను.

సరిగ్గా అదే సమయంలో బార్‌లో అడుగుపెట్టిన ఓ నీగ్రో యువకుడిమీద నిలిచాయి నా చూపులు.

ఆరడుగు లుంటాడతను. విశాలమైన వక్షం. బ్లూ సూట్‌లో వున్నాడు. చుట్టు కలయచూస్తున్న అతని దృష్టి నామీద నిలవగానే చటుక్కున నావైపు అడుగులు వేశాడు.

"హలో! మిమ్మల్నెక్కడో చూసినట్టుందే!" అన్నాడు పలకరిస్తూ.

"ఔను! మిమ్మల్నీ ఎక్కడో చూసినట్టు జ్ఞాపకం!" అన్నాను నవ్వుతూ.

"ఏడాది క్రితం కాబోలు మనం బాంకాక్‌లో కలుసుకున్నాం!"

"బహుశా మీరు వైట్ అండ్ వైట్ కంపెనీ ట్రావెలింగ్ ఏజెంట్ అనుకుంటాను."

"యస్! మనం కలుసుకున్నప్పుడు, మీరు మా సంస్థ తయారుచేసే టేప్ రికార్డర్ కొనాలనుకుంటున్నట్టు చెప్పారు గుర్తుందా? అప్పుడు నా దగ్గిర స్టాక్ లేనందువల్ల ఇవ్వలేకపోయాను."

"ఔను. గుర్తుంది. టేప్‌రికార్డర్ అవసరం ఇప్పుడు ఉంది నాకు."

"ఐతే రండి. నా దగ్గర ఓ కొత్త సెట్ రెడీగా ఉంది చూపిస్తాను."

ఆ సంభాషణంతా మేము ఒకరొక్కరం గుర్తించడానికి తయారుచేసిన కోడ్ సిగ్నల్!

"మీరీ హోటల్లోనే దిగారా?" అడిగాను.

గోంబా తలూపి_ "ఔను. థర్డ్ ఫ్లోర్‌లో ఉంది నా గది. పదండి టేప్ రికార్డర్ చూపిస్తాను" అంటూ తలుపువైపు నడిచాడు.

లేచి అతన్ని అనుసరించాను.

ఇద్దరం ఆటోమేటిక్ లిఫ్ట్ ఎక్కాం.

"గోంబా మీరే కదూ?" అడిగాను సిగరెట్ అంటిస్తూ.

"ష్! ఆ పేరుతో పిలవకండి. నేనిక్కడ ఫ్రేజర్ అనే పేరుతో గది తీసుకున్నాను" అన్నాడు గోంబా.

లిఫ్ట్‌లో థర్డ్ ఫ్లోర్ చేరగానే బైటపడి, నడవగుండా ముందుకు సాగాం. జేబులోంచి తాళం చెవి తీస్తూ ఓ గదిముందు ఆగాడు గోంబా. తాళం తెరిచి, "రండి!" అంటూ తలుపు తీశాడు.

గదిలో చీకటి. ఇద్దరం లోనికెళ్ళగానే చటుక్కున తలుపుమూసి, "డబ్బు తెచ్చారా?" అడిగాడు గోంబా.

"తెచ్చాను."

"ఎంత?"

"ఏభై వేలు."

"ఇంకా కొంచెం ఎక్కువ ఏర్పాటు చెయ్యగలరా?"

"ఎంత?"

"ఐదు లక్షలు!"

ఆశ్చర్యంతో నోరు తెరిచాను. "మిస్టర్ గోంబా! ఏభై వేలకి బేరం పెట్టి ఇప్పుడు ఐదు లక్షలడగడం అన్యాయం!"

"ఓహ్ మిస్టర్ జయశంకర్! మీరు పన్నపొర్థం చేసు కుంటున్నారు. ఫ్రీలాన్స్ ఏజెంట్లమైన మేము కష్టమర్ల నెప్పుడూ మోసం చెయ్యం!"

"మరి ఐదు లక్షల వ్యవహారం ఏమిటి?"

"ఒక అమూల్యమైన వస్తువు అనుకోకుండా నాచేతికి తగిలింది. దాన్ని గనక బాహాటంగా బేరం పెట్టానంటే, కుబేర దేశాలెన్నో కోట్లు గుమ్మరించి దాన్ని కొనడాని కొగబడతాయి.

కాని, ఇప్పుడది నా ప్రాణసంకటంగా తయారయింది. ఆ వస్తువు నా దగ్గిరున్నట్టు నాకన్నా కాకలు దీరిన కొందరు వ్యక్తులకు తెలిసిపోయింది. వాళ్ళు నన్ను చంపి దాన్ని కాజెయ్యాలని ప్రయత్నిస్తున్నారు.

ఎంత త్వరగా అమ్మగలిగితే దాన్ని అమ్మేసి నేనిక్క ణించి ఉడాయించాలి. చెప్పండి. ఐదు లక్షలు సర్ద గలరా?" అడిగాడు గోంబా ఆతృతగా.

"డబ్బు సర్దడం ఏమంత కష్టం కాదు. ఇక్కడి మా రాత్య కార్యాలయాన్ని కోరితే క్షణాల్లో ఏర్పాటవు తుంది. కాని, ఆ వస్తువు అంత విలువైనదేననీ నాకు నమ్మకం ఏమిటి?"

"ఇక ఆ వస్తువు గురించి వివరంగా చెబుతాను వినండి. రెండవ ప్రపంచయుద్ధ కాలంలో జర్మనీదేశంలో ఫ్రెడ్రిక్ అనే ప్రముఖ సైంటిస్టు వుండేవాడు.

జర్మన్‌తో జపాను చేతులుకలిపి ఆయుద్ధాన్నివిస్తృతం

చేసింది. నాజీ సైన్యాలు యూరప్‌లో స్వైరవిహారం చెయ్యసాగాయి. దాంతో, వారి దాడి నెదుర్కొంటున్న మిత్రరాజ్యాలు హడలిపోయాయి.

జర్మన్ నియంత హిట్లర్, జపాన్ చక్రవర్తి హిరో హిటోల పొగరణచడానికి అమెరికా విధిలేక హిరోషిమా, నాగసాకీ నగరాలపై ఆటంబాంబులు వెయ్యవలసి వచ్చింది. దాంతో జపాను సైన్యాలు భీతావహం జెందాయి. హిట్లరు తోకతొక్కిన తాచులా బుసలు కొట్టాడు.

అమెరికా వద్దనున్న ఆ ఆటంబాంబులకంటే శక్తివంతమైన వస్తువేదైనా తప్పక సృష్టించితీరాలని తోచిందతనికి. వెంటనే ప్రొఫెసర్ ఫెడ్రిక్‌ను పిలిపించి తన కోరిక విన్నవించాడు.

మాతృభూమిపై అపార ప్రేమ ఉన్న ఆ సైంటిస్టు నిద్రాహారాలు మాని, రీసెర్చి ప్రారంభించాడు. చివరికి ఆటంబాంబుకన్నా పదిరెట్లు ప్రమాదకరమైన వస్తువు కనుక్కొగలిగాడు.

అతని పరిశోధన ఇంకా చివరిదశలో ఉండగానే మిత్రరాజ్య సైన్యాలూ, రష్యా సైన్యాలూ జర్మన్ రాజధానిని చుట్టుముట్టడం జరిగింది. ఆ ఓటమి భరించలేక హిట్లర్ ఆత్మహత్య చేసుకున్నాడు.

దాంతో ప్రొఫెసర్ ఫెడ్రిక్ ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని అక్కణ్నించి పారిపోయాడు. మారు పేరుతో ఇన్నాళ్ళూ మలేసియాలోని ఓ కుగ్రామంలో నివసిస్తూ అసంపూర్తిగా మిగిలిన ఆ రీసెర్చిని పూర్తిచేసి విజయం సాధించాడు.

ఆ రహస్యం తెలుసుకున్న కొందరు వ్యక్తులు ఆయన్ని దారుణంగా హత్యచేసి ఆ ఫార్ములా కాజేశారు. అది నా చేతికెలా వచ్చిందో చెబుతూ కూర్చుంటే తెల్లారి పోతుంది. ఇప్పుడు ఒక్కొక్క క్షణం అతి విలువైనది. ఏమంటారు? ఆ ఫార్ములాతో మీ దేశం అగ్రరాజ్యాల జాబితాలో చేరిపోవడం ఖాయం! శత్రుదేశాలు మీ వైపు కన్నెత్తి చూడ్డానికి గడగడలాడతాయి..."

"ఎక్కడుంది ఆ ఫార్ములా?" అడిగాను.

వెంటనే జేబులోకి చెయ్యి పోనిచ్చాడు గోంబా. తిరిగి బైటికి వచ్చిన అతని చేతిలో మడతకత్తి చూసి గతుక్కుమన్నాను.

గోంబా నవ్వి- "భయపడకండి!" అంటూ తొడుక్కున్న కోటు కాలర్ కుట్లు ఊడదీశాడు. చిరిగిన గుడ్డలోకి వేళ్ళు పోనిచ్చి అల్యూమినియంతో చేసిన రెండంగుళాల కేప్సూల్ బైటికి తీశాడు.

"ఆ ఫార్ములా మైక్రోఫిల్మ్ రూపంలో ఇందులో భద్రపరిచి వుంది!" అన్నాడు దాన్ని నా చేతికిస్తూ.

"నేను ఎమ్మెస్సీ పట్టభద్రుణ్ని! సైన్సు పరిజ్ఞానం ఉంది. ఆ మైక్రోఫిల్మ్‌లో నిజంగా ఆటమిక్ ఎనర్జీకి సంబంధించిన ఫార్ములా స్క్రిప్ట్ ఉందో లేదో రూఢి పర్చుకోనిదే నేనేమీ చెప్పలేను" అన్నాను.

"ఆల్ రైట్! మీ గదిలోకి తీసికెళ్ళి ఇస్తున్నాం గా పరిశీలించి, తృప్తిపడ్డతరువాతే నాతో బేరానికి దిగండి!"

"ఇక్కడే పరిశీలిస్తే ఏం?"

"పరిశీలించవచ్చు. దానికోసం గదిలో లైటు వెలిగించవలసి వుంటుంది. నేను గదిలో ఉన్నట్టు వాళ్ళకి

తెలియకూడదు. నేనీ గదిలోంచి బైటికెళ్ళడం ప్రమాదం. ఇక్కడే మీకోసం కాచుకుంటాను. వెళ్ళేటప్పుడు గది లాక్ జేసి వెళ్ళండి. దాంతో, నేనీ గదిలో వున్నట్టు ఎవ్వరికీ అనుమానం రాదు. దేనికైనా మంచిది. మీరూ జాగ్రత్తగా ఉండాలి సుమా!" అన్నాడు గోంబా టేబిల్ దగ్గరికి నడుస్తూ.

టేబిల్ మీదున్న సూట్ కేస్ తెరిచి ఓ భూతద్దం తీశాడు. "దీనితో ఆ మైక్రోఫిల్మ్ చెక్ జేసుకోండి!" అంటూ జేబులోంచి తాళంచెవి తీసి నా కందించాడు.

"ఆల్ రైట్! గంటలోపల తిరిగి వస్తాను" అంటూ గబగబ తలుపువైపు నడిచాను.

బైట అడుగెట్టగానే తలుపుమూసి లాక్ చేశాను. నడవాలో జనం అటూ ఇటూ తిరుగుతున్నారు. కొందరు అక్కడక్కడా నిల్చుని మాట్లాడుకుంటున్నారు. వారిలో గోంబా శత్రువులెవ్వరో ఎలా తెలసేది?

# 3

నా గదిలోకెళ్ళి, తలుపు గడియబిగించి, కేప్సూల్ క్యాప్ తీశాను. లోపల సినిమారీలు చుట్టినట్టు చుట్టిఉంది మైక్రోఫిల్మ్!

దాన్ని అరచేతిలో దులిపి, సాగదీశాను. గజం పొడవు ఉంటుంది. భూతద్దంతో లైటుకాంతిలో చకచక చెక్ చెయ్యసాగాను. అరగంటవరకూ క్షుణ్ణంగా పరిశీలించాక, అది ఆటమిక్ ఎనర్జి తాలూకు ఫార్ములాయేనని రూఢి అయింది.

ఫిల్మ్ చుట్టేసి, కేప్సూల్లో తోసి మూత బిగించాను. ఎలాగైనా సరే, దీన్ని భారతదేశం జేర్చి తీరాలి. దీనితో

నాదేశం ప్రపంచ దేశాల్లో తలమానికమై తీరుతుంది. శత్రుదేశాలు గడగడలాడతాయి. యుద్ధభీతి శాశ్వతంగా తొలగి ప్రజలు సుఖశాంతులతో మనగలుగుతారు.

వెంటనే గది తలుపు తెరిచి నడవాలో అడుగు పెట్టాను. అక్కడ తిరుగుతూన్న జనంలో ఎవ్వరూ నన్ను పట్టించుకోడం లేదు. గోంబా గదివైపు నడిచాను. కీ తీసి లాక్ తెరిచాను. తలుపు తోస్తూ లోన అడుగు పెట్టాను.

చీకటి!

"గోంబా!" పిల్చాను.

జవాబు లేదు.

గదిలో ఉంటూనన్న మనిషి ఏమయ్యాడు? అనుకుంటూ జేబులోంచి లైటర్ తీసి వెలిగించాను. ఆ వెలుగులో కనిపించిన దృశ్యం నన్ను దిగ్భ్రాంతుణ్ణి జేసింది.

గోంబా నేలమీద బోర్లా పడున్నాడు. ఒంటిమీద పీసమెత్తు గుడ్డ లేదు. నల్లని శరీరమంతా నగ్నంగా ఉంది. అతని బట్టలు అండర్ వేయర్‌తో సహా తునాతునకలై చెల్లా చెదురుగా పడున్నాయి. గదిలోని వస్తువులన్నీ చిందరవందర జేసి ఉన్నాయి.

అడుగులో అడుగు వేసుకుంటూ అతన్ని సమీపించాను. దడదడలాడుతున్న గుండెతో బోర్లా పడున్న అతన్ని వెల్లకిలా తిప్పాను. అనుమానమే నిజమైంది. గోంబా గుండెలో పిడివరకూ దిగిన కత్తి! నల్లని అతని మొహంలో తెల్లగా కనిపిస్తున్నాయి కనుగుడ్లు.

నేను మైక్రోఫిల్మ్ చెక్ జెయ్యడాని కెళ్ళిన గంట లోపలే ఇంత ఘోరం జరిగిందా! దీనితో గోంబా చెప్పిందంతా నిజమేనని స్పష్టమౌతోంది. అతన్ని చంపి కేవ్

సూల్ కోసం అతని బట్టలూ, సామానూ అంతా గాలించారు!

గోంబా మరణంతో ఇప్పుడా ప్రమాదం నాకు చుట్టుకుంది. నేనతని వెంట ఈ గదిలోకి రావడం, వెళ్ళడం అతని శత్రువులు ఈపాటికి గమనించి ఉంటారు.

వారి బారినుంచి తప్పించుకుని, కేవ్ సూల్ తో సురక్షితంగా భారతదేశం ఎలా జేరాలి? తీవ్రంగా ఆలోచిస్తున్న నా బుర్రలో తళుక్కుమంది మెరుపు! గబగబ గదిలోంచి బైటికి నడిచాను.

తలుపుదగ్గరగా జేరవేస్తూ, నడవాలో ఉన్న వ్యక్తుల్ని ఓరగా చూశాను. అదే సమయంలో ఓ స్తంభం దగ్గర నావైపే చూస్తూ నిల్చున్న ఫుల్ సూట్, ఫెల్ట్ హాటతను చటుక్కున చేతిలోని న్యూస్ పేపర్ అడ్డం పెట్టుకున్నాడు.

వడివడిగా అడుగులు వేస్తూ లిఫ్ట్ వైపు నడిచాను. కిందికి జేరగానే, హోటల్ ఆవరణలో ఉన్న టాక్సీ స్టాండ్ వైపు వెళ్ళాను. జేబులోంచి డైరీ తీసి, ఆ చిరుతపులుల యజమాని చిరునామా చూసుకుని, టాక్సీ డ్రైవర్ తో చెప్పి కూర్చున్నాను.

టాక్సీ కదిలింది. దార్లో ఓ జనరల్ స్టోర్ ముందు ఆపించి ఆ షాప్ లోంచి లావుపాటి సూదీ, దారం కొనుక్కుని తిరిగి టాక్సీ ఎక్కాను.

వీధులు రంగురంగుల దీపాలతో వెలిగిపోతున్నాయి. అప్పుడప్పుడూ వెనుదిరిగి చూస్తున్నాను ఎవ్వరైనా నన్ను వెంబడిస్తూ రావడం లేదుకదా అని! రెండు మూడు రోడ్స్ కట్ చేశాక తెలిసింది, ఫర్లాంగు దూరంలోవస్తున్న

అప్‌కలర్ ఫియెట్ మమ్మల్నే వెంబడిస్తున్నట్టు!

అంతలో టాక్సీ ఓ విశాలమైన వీధిలోకి తిరిగి, రాజ భవనంలాటి ఓ మేడ ముందాగింది. "మీరు చెప్పిన ఇల్లు ఇదే సార్!" అన్నాడు డ్రైవర్.

జేబులోంచి పర్సు తీస్తూ దిగాను. మీటర్ బిల్ చెల్లిస్తూ ఓరగా వెనక్కి చూశాను. అంతవరకూ మమ్మల్ని వెంబడిస్తూ వచ్చిన ఆ కారు ఇప్పుడు వెనుదిరిగి వెళ్ళి పోతోంది!

మేడముందు నిల్చున్న వాచ్‌మెన్‌కు నా గురించి చెప్పగానే లోనికెళ్ళడానికి అనుమతించాడు.

ఏభై ఏళ్ళుంటాయి సుహార్తోకి. పొట్టిగా లావుగా ఉన్నాడు. చీకి కళ్ళు. నా గురించి తెలియగానే ఎంతో సాదరంగా ఆహ్వానించి, అతిథి మర్యాదలు కురిపించ సాగాడు.

"మిస్టర్ జయశంకర్! మీ రాక నన్ను చాలా ఆనంద పరిచింది. ఈ రాత్రి నా అతిధ్యం స్వీకరించి, రేపు మధ్యాహ్నం చిలుతపులులతో బర్మా ట్రేన్ ఎక్కండి. అందుకు తగిన ఏర్పాట్లన్నీ నేను చూసుకుంటాను!" అన్నాడు సుహార్తో.

నేను కోరేదికూడా అదే. ఈ రాత్రి నాకు రక్షణ కావాలి. అది ఈవిధంగా దొరికింది. థాంక్ గాడ్!

## 4

ఉదయం కాలకృత్యాలు పూర్తయ్యాక చిలుతపులు లను చూపించాడు సుహార్తో. ఇనప ఊచలతో నిర్మిం చిన చిన్న గదిలో ఉంచారు వాటిని. చూడ ముచ్చ టగా వున్నాయి. వాటి చర్మం పూర్తి నల్లగా వుండి,

దానిమీద తెల్లని మచ్చలున్నాయి.

ఆడ చిఱుత కడుపు మామూలుకన్నా కాస్త ఉబ్బి వుండటం గమనించి, "అది గర్భంతో వుందా?" అడిగాను సుహాసిన్ని.

"ఔను. కొద్దిరోజుల్లో ఈనవచ్చు. ఆవిధంగా మీకు మరో లాభం కలగబోతోంది... నాఖుర్ ద్వారా వాటి ఆహార పానీయాల గురించి తెలుసుకుంటూండండి. ఆలోగా నేను మీ ప్రయాణానికి ఏర్పాట్లు చేసివస్తాను" అని వెళ్ళిపోయాడు సుహాసిన్.

"వీటిని గదిలోంచి బైటికి తీసేముందు స్పృహ పోగొడతారు కదూ?" అడిగాను నాఖుర్ని.

అతను తలూపి-"మాంసం ముక్కల్లో మత్తు మందు ఇస్తాం!" అన్నాడు.

"కొద్దిసేపట్లో ఎలాగూ వీటిని రైల్వే స్టేషన్ తీసి కెళ్ళాలి. ఆ పనేదో నేనే చేసిచూస్తాను మత్తు ముందు తీసుకురా!" అన్నాను.

నాఖురు వెళ్ళి ఓ గిన్నెలో మాంసం ముక్కలూ, గుండ్రని చాక్లెట్ రంగు బిళ్ళలూ పట్టుకొచ్చాడు. "వీటిని మాంసంలో కలిపి ఇవ్వాలి. వెంటనే స్పృహ పోతుంది!" అన్నాడు.

మాంసం ముక్కల్లో బిళ్ళలు జొప్పించి, ఇనప ఊచల గుండా గదిలోకి విసిరాను. చిఱుతలు రెండూ వాటిమీద లంఘించి క్షణంలో సఫాచేశాయి. ఐదు నిమిషాల తర వాత ఆవులిస్తూ నేలమీద పడిపోయాయి.

నాఖురుద్వారా తలుపు తాళం తెరిపించి-"నువ్విక్కడే వుండు. నేను వాటిని దగ్గర్నుంచి చూడాలనుకుంటు

న్నాను" అంటూ గదిలో ప్రవేశించాను.

చిఱుతలు గట్టిగా ఉచ్ఛ్వాస నిశ్వాసలు తీస్తూ పడు న్నాయి. పెంపుడు మృగాలు గనక వాటి మెడల్లో వెడల్పాటి తోలుపట్టాలు బిగించి వున్నాయి. నాకావలసింది కూడా అదే!

కింద కూర్చుని మగ చిరుత మెడలోంచి పట్టా విప్పాను. బ్లేడ్ తో దానిమధ్య కుట్లు ఊడదీశాను. ఆ సందులో కేవ్ సూల్ భద్రంగా జొప్పించి, సూదీదారంతో తిరిగి పట్టాను మామూలుగా కుట్టేశాను.

ఇహ కేవ్ సూల్ మీద ఆ నరబ్రహ్మకూడ చెయ్యి వెయ్యలేడు. పట్టాను తిరిగి చిరుత కంఠానికి బిగించి బైటికి వచ్చాను.

అంతలో సుహార్నో వచ్చాడు. "బర్మా వెళ్ళే గూడ్స్ ట్రేన్ లో మీకోసం బోగీ బుక్ అయింది. చిరుతల్ని ట్రక్ లో స్టేషన్ తీసికెళ్ళండి. నా నౌఖర్లు వాటిని బోగీ ఎక్కించేవరకూ మీ వెంట వుంటారు" అన్నాడు.

"థాంక్యూ మిస్టర్ సుహార్నో!" అన్నాను మర్యాదకి.

గదిలో స్పృహతప్పివున్న చిఱుతల్ని ఓ బోనులోకి మార్చి, దాన్ని మోసుకెళ్ళి ట్రక్ ఎక్కించారు నౌఖర్లు.

పది నిమిషాల తరవాత వాటికి స్పృహ వచ్చింది. పెద్దపెట్టున గాండ్రిస్తూ చిరాకు ప్రదర్శిస్తున్నాయి బోనులో.

సుహార్నో దగ్గర సెలవు తీసుకుని బైలుదేరాను. ట్రక్

రైలు స్టేషన్ జేరగానే, నౌఖర్లు బోనుదించి, గూడ్స్ ట్రైన్ షంటింగ్ పూర్తయ్యాక బోగీ ఎక్కించారు.

నేను బర్మావరకూ గార్డ్ కేబిన్‌లో ప్రయాణించ డానికి అధికార్ల అనుమతి లభించింది.

సాయంత్రం నాలుగ్గంటలకి లంపాంగ్ స్టేషన్ విడిచింది బండి.

“ఇక థాయ్‌లాండ్, బర్మా సరిహద్దు స్టేషన్‌లో తప్ప మరెక్కడా ఆగదు. మీకు నిదరవస్తే కింద బ్లాంకెట్ పర్చుకుని పడుకోండి” అన్నాడు గార్డు.

తలూపాను.

ట్రైన్ మంచి వేగం అందుకుంది. బాగా చీకటి పడేవరకూ ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాం. నాకు ఆవులింతలు ప్రారంభమయ్యాయి. కింద బ్లాంకెట్ పర్చుకుని నడుం వాల్చాను. గార్డు కుర్చీలోనే కునికిపాట్లు పడుతున్నాడు.

రాత్రి మూడు గంటల ప్రాంతంలో కాబోలు బర్మా, థయ్‌లాండ్ సరిహద్దు స్టేషన్లో ఆగింది బండి. కస్టమ్స్ అధికార్లు ట్రైన్ అంతా చెక్ జేసి, గార్డుతో కాసేపు మాట్లాడి, నా కాగితాలూ అవీ తనిఖీజేసి వదిలారు.

గంట తరవాత తిరిగి ముందుకు సాగాం.

“ఇప్పుడు మనం బర్మా సరిహద్దులో ప్రవేశించాం. మీరు పడుకోండి. తెల్లారాక లేపుతాను. మంచి నిద్ర సమయం ఇది!” అన్నాడు గార్డు.

మళ్ళీ పక్క మీద వాలాను. ఇహ ఎక్కడా ఆగే అవసరం లేదు గనక రైలు వాయువేగంతో పరిగెడుతోంది.

ఇంకా నాకు పూర్తిగా కునుకు పట్టనేలేదు. వెయ్యి పిడుగులు ఒక్కసారి పడ్డట్టు దిక్కులు పిక్కటిల్లాయి. ట్రైన్ యావత్తూ అటూ యిటూ ఊగినట్టు తోచింది.

అంతే! చెవులు చిల్లులుపడే శబ్దంతో కేబిన్ గాలి లోకి ఎగిరి పల్టీలు కొట్టసాగింది. నా కళ్ళముందు ప్రపంచ మంతా చీకట్లు కమ్ముకుంటున్నాయి.

అంతే! తరవాత ఏంజరిగిందో ఆ పరంధాముడికే తెలుసు!!

## 5

మళ్ళీ కళ్ళు తెరిచి చూస్తే హాస్పిటల్లో పడున్నాను. ఒళ్ళంతా కట్లు! ప్రతి నరం నెప్పితో మెలికలు తిరుగు తోంది. చుట్టూ చూశాను నీరసంగా. నర్సు యూని ఫాంలో వున్న యువతి వస్తూ కనిపించింది.

"థాంక్ గాడ్! మీకు స్పృహ వచ్చిందన్నమాట!" అంది నన్ను సమీపించి.

"నేనెక్కడున్నాను? ఎలా వచ్చానిక్కడికి?" అడిగాను.

"ఇది పేగో సిటీ హాస్పిటల్! మీరు ప్రయాణించిన రైలు ప్రమాదవశాత్తూ పట్టాలు తప్పింది. అనేక బోగీలు పల్టీ కొట్టాయి. ఆ దుస్సంఘటన సమాచారం అందగానే తీవ్రగాయాలతో వున్న మిమ్మల్నీ, ఇంజన్ సిబ్బందినీ ఇక్కడికి చేర్చాం!" అంది నర్సు.

"నాతోబాటు కేబిన్లో గార్డుకూడా వున్నాడు. ఏమయ్యాడతను?"

నర్సు పెదవి విరిచి_"అతని ఒంట్లోని ఎముకలన్నీ విరిగిపోయి అక్కడికక్కడే మరణించాడు!" అంది.

నిట్టూర్చాను! అప్పుడు జ్ఞాపకం వచ్చాయి చిఱుత పులులు!!

"నా చిఱుతపులులైనా క్షేమంగా వున్నాయా?" అడిగాను ఆత్రుతగా.

"ఆ బోగీకూడా పల్టీ కొట్టడంతో, బోను విరిగి అవి తప్పించుకుని ఎటో పారిపోయాయి."

నా గుండె గుభిల్లుమంది!

"అవి ఈ చుట్టుపక్కల అడవిలోనే ఎక్కడో తిరుగుతున్నాయిట. ఈ వార్త స్థానిక ప్రజల్లో భయోత్పాతాన్ని రేపింది. పోలీసులు వాటికోసం అన్వేషిస్తున్నారు" అంది నర్సు మళ్ళీ.

"నేను మూర్ఛపోయి ఎన్ని గంటలయింది?"

"గంటలు కాదు మిస్టర్ జయశంకర్! రెండు రోజులవుతోంది!"

"రెండు రోజులయిందా? ఇంతకీ నా పేరు మీకెలా తెలుసు?" అడిగాను ఆశ్చర్యంగా.

"మీ జేబులో లభించిన కాగితాలవల్ల!"

చిఱుతపులులు పారిపోయాయని నేను చింతించడం లేదు. మగ చిరుత మెడలో ఉన్న కేప్సూల్ విషయమే నన్ను ఆరాట పెడుతోంది. ఒక మేధావి అహోరాత్రులు శ్రమించి, ప్రాణాలు త్యజించి కనుగొన్న ఆ ఫార్ములా పరాయి చేతుల్లో పడటంగానీ, అడవిపాలు కావడంగానీ నేను భరించలేను.

నాలో ఊపిరున్నంతవరకూ దాన్ని మరొకరికి దక్కనివ్వను. ఇంతకీ ట్రేన్ యాక్సిడెంట్ యాధృచ్ఛికంగా జరిగిందా? లేక ఎవ్వరైనా బుద్ధిపూర్వకంగా పట్టాలు ఊడబెరికారా? ఆలోచనలతో బుర్ర వేడెక్కుతోంది.

అంతలో మరో నర్సువచ్చి-"మిస్టర్ జయశంకర్! మిమ్మల్ని చూట్టానికి ఓ వ్యక్తి వచ్చారు" అంది.

"ఎవ్వరు?..

"పోలీస్ కమీషనర్!"

"పంపించండి" అన్నాను.

రెండు నిమిషాల తరవాత యూనిఫాంలో ఉన్న పోలీస్ కమీషనర్, ఓ ఇన్‌స్పెక్టర్ వచ్చారు లోనికి.

"హలో మిస్టర్ జయశంకర్! ఆరోగ్యం ఎలావుంది?" ఫార్మాలిటీకోసం పరామర్శిస్తూ కుర్చీలో కూర్చున్నాడు కమీషనర్.

"గాయాలు కాస్త బాధకలిగిస్తున్నాయితప్ప నాకేం ఫరవాలేదు" అన్నాను దిండునానుకుని.

"మా జవాన్లు మీ చిరుతపులులు ఎక్కడ సంచరిస్తున్నాయో కనుగొన్నారు. ఇక్కడికి తూర్పుదిశగా మూడు మైళ్ళు వెళితే మంఛూరి అనే గ్రామం వస్తుంది. అక్కడికి అరమైలు దూరంనించి ఓ అడవి ప్రారంభమౌతుంది మీ చిఱుతలు అందులోనే సంచరిస్తున్నట్టు సమాచారం' అందింది" అన్నాడు కమీషనరే.

"దయచేసి వాటినెలాగైనా తిరిగి పట్టుకోడానికి ప్రయత్నించండి. నేను భారతదేశ జంతుప్రదర్శనశాల ఉద్యోగిని. ఎంతో ఖర్చు భరించి వాటిని థాయ్‌లాండ్ నుండి తెప్పించుకుంటోంది మా ప్రభుత్వం. నేను వట్టి చేతులతో వెళ్ళానంటే నా ఉద్యోగం ఊడిపోతుంది!" అన్నాను ప్రాధేయపడుతూ.

కమీషనర్ పెదవి విరిచి__"అయామ్ వెరీసారీ! మా దేశ పోలీసులకి మృగాలని ప్రాణాలతోపట్టే ట్రేనింగ్

ఇవ్వబడదు. మీ చిఱుతపులులు ఎక్కడ కనిపించినా సరే, కాల్చి పారెయ్యక తప్పదు! ఎందుకంటే, చుట్టుపక్కల గ్రామ ప్రజలు ఇప్పటికే భీతావహులై ఉన్నారు!'' అన్నాడు.

నిరాశతో మూలిగింది నా మనసు. ఇప్పుడెలా? ఆ కేప్సూల్‌ను ఎలా దక్కించుకోను? సడన్‌గా తట్టింది ఓ ఆలోచన.

''కమీషనర్ గారూ! మీ సిబ్బందితో కలిసి నేనూ వాటిని వెదకడంలో పాల్గొంటాను. పారిపోయిన మృగాలను పట్టుకునే ట్రేనింగ్ మాకు ఇవ్వబడుతుంది'' అన్నాను.

''మా కభ్యంతరం లేదు. నిక్షేపంగా పాల్గొనండి'' అంటూ పక్కనే నిల్చున్న ఇన్‌స్పెక్టర్ని చూపించి—''వాటిని వెదికే సిబ్బందికి ఈ ఇన్‌స్పెక్టర్ నాయకత్వం వహిస్తున్నారు. ఈయన పేరు షింగే! వీరి బృందం ఎల్లుండి మంఛూరీ గ్రామానికి బైలుదేరుతుంది. ఆలోగా మీ ఆరోగ్యం కుదుటపడితే వీరి వెంట వెళ్ళండి!'' అన్నాడు కమీషనర్.

తలూపాను. ''ఇంతకీ ఆ ట్రేన్ దుర్ఘటన ఎలా జరిగిందంటారు?''

''దర్యాప్తు జరుగుతోంది. ఇంకా రిపోర్ట్ అందలేదు. మీరు విశ్రాంతి తీసుకోండి. వస్తాం!'' అంటూ లేచాడు కమీషనర్.

ఇద్దరూ సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో నర్సు వచ్చి—''మిమ్మల్ని చూట్టానికి సైమన్ అనే అతను వచ్చాడు.

పంపించమంటారా?'' అంది.

నా పరిచయస్థుల్లో ఆ పేరుగల వాళ్ళెవరూ లేరు! పైగా ఇటువంటి అపరిచిత ప్రదేశంలో నన్ను చూట్టానికి ఒక వ్యక్తి రావడం ఏమిటి?

తెలుసుకోవాలన్న కుతూహలంతో_''పంపించండి!'' అన్నాను.

నర్సు వెళ్ళిన రెండు నిమిషాల తరవాత ముప్ఫై ఏళ్ళ యూరోపియన్ వచ్చాడు లోనికి. అతని భుజాన కెమెరా వేలాడుతోంది.

''గుడ్ మార్నింగ్ మిస్టర్ జయశంకర్! రెండు రోజుల్నించీ మిమ్మల్ని కలుసుకోవాలని ప్రయత్నిస్తున్నాను. కాని, డాక్టర్లు అనుమతించలేదు. ఈరోజు మీకు స్పృహ రావడంతో అనుమతి లభించింది,'' అన్నాడతను నవ్వుతూ.

''మీ గురించి చెప్పనేలేదు'' అన్నాను దిండు నానుకుంటూ.

''సారీ! నన్ను సైమన్ అంటారు. 'ది నేచర్' అనే ప్రముఖ అమెరికన్ వారపత్రికకు బర్మా రిపోర్టర్ని. మీరు థాయ్‌లాండ్ నుండి తెస్తున్న నల్ల చిఱుతలు గూడ్స్ ట్రేన్ ప్రమాదంలో తప్పించుకు పారిపోయిన వార్త వినగానే మిమ్మల్ని ఇంటర్వ్యూ చేసి వ్యాసరూపంలో మా పత్రిక కందించాలని వచ్చాను'' అన్నాను స్టూల్ మీద చతికిల బడుతూ.

''నన్ను ఇంటర్వ్యూ జేశాక మీరు నిరుత్సాహపడవచ్చు మిస్టర్ సైమన్!'' అన్నాను నవ్వుతూ.

''దేనికి?''

''మీ పాఠకుల్ని ఉద్రూతలూగించే విషయాలేవీ నా

దగ్గర లేవు. అతి మామూలు సంఘటన. అంతే!''

''ఫరవాలేదు. మీరు చెబుతూండండి. దాంట్లో మిగతా మసాళాలు మేళవించే పని నాది!'' అంటూ నోట్ బుక్ తెరిచాడతను.

''సరే, వినండి. నా పేరు మీకు తెలిసిందేకదా? నేను ఇండియా జంతు ప్రదర్శనశాల ఉద్యోగిని. థాయ్ లాండ్ లో నివసించే సుహార్తో అనే జమీందారు ఆనల్ల చిఱుతల్ని అమ్మదలచినట్టు విని, మా దేశం వాటిని కొనడానికి నిర్ణయించింది. వాటిని సురక్షితంగా తీసుకురావడానికి నేను పంపబడ్డాను. గూడ్స్ ట్రేన్ లో థాయ్ లాండ్ దాటి బర్మా సరిహద్దులో ప్రవేశించగానే రైలు ప్రమాదానికి గురై, అవి పారిపోయాయి. నేనిలా హాస్పిటల్లో పడున్నాను. అంతా కలిపి ఇంతే కథ!'' అంటూ ముగించాను.

''ఆ చిఱుత పులుల ఫోటోకూడా తీసే అవకాశం కలిగితే ఈ వ్యాసానికి ఇంకా బలం చేకూరేది!'' అన్నాడు సైమన్ కలం మూస్తూ.

''అడవిలో వాటికోసం గాలిస్తున్న పోలీస్ బృందంతో మీరూ చేరండి. కనీసం వాటి శవాలనైనా ఫోటో తియ్యగలుగుతారు.''

''అదేమిటి?''

''అటువంటి ప్రమాదకరమైన జంతువుల్ని పోలీసులు సజీవంగా పట్టుకోలేరు కదా? అందుకే, అవి కనిపించిన తక్షణం కాల్చి పారెయ్యాలని నిశ్చయించారు.''

''చాలా విచారకరమైన విషయం! మీ ఫోటో ఒకటి తీసుకోవచ్చా?'' అంటూ లేచాడు సైమన్.

తలూపాను.

కెమెరా సెట్ జేసి, క్లిక్ మనిపించాడు. "థాంక్స్! ఇక సెలవిప్పిస్తారా?"

"ఓ.కే!" అన్నాను చెయ్యి ఊపుతూ.

అతను తలుపువరకూ వెళ్ళి, చటుక్కున వెనుదిరిగి— "అన్నట్టు ఆచిలుకపులుల కంఠాలకి తోలుపట్టాలుకూడా ఉన్నాయటగా?" అన్నాడు.

ఊహించని విధంగా అతను వేసిన ఆ ప్రశ్నతో ఉలిక్కిపడ్డాను.

"తోలుపట్టాల సంగతి మీ కెలా తెలును?"

అతను నవ్వి—"ఊళ్ళో అందరూ అనుకుంటుండగా విన్నాను" అన్నాడు.

"ఔను. అవి జమీందారు పెంపుడు జంతువులుకదా? వాటి కంఠాల్లో అందమైన తోలు పట్టాలు కూడా ఉన్నాయి" అన్నాను నవ్వడానికి ప్రయత్నిస్తూ.

అతను వెళ్ళిపోయాడు.

నాలో సవాలక్ష సందేహాలు పడగలెత్తాయి. ఇతను నిజంగా ప్రెస్ రిపోర్టరా? లేక...

## 6

నన్ను హాస్పిటల్ నించి డిశ్చార్జ్ చేస్తున్నారు ఆరోజు.

ఉదయం ఎనిమిది గంటలకి వచ్చాడు ఇన్స్పెక్టర్ సింగ్. "మా బృందం ఈ రోజు బైలుదేరుతోంది. మీ ఆరోగ్యం కుదుటబడితే మా వెంట తీసికెళ్ళాలని వచ్చాను" అన్నాడు.

డాక్టర్ దగ్గర హెల్త్ ఫిట్నెస్ సర్టిఫికెట్ తీసుకుని అతని వెంట హాస్పిటల్లోంచి బైటపడ్డాను. పోలీస్ జీప్

పార్కు చేసి ఉంది బైట.

"మా కానిస్టేబుల్స్ వ్యాన్‌లో వెనక వస్తారు. మనం జీప్‌లో ముందు వెళదాం!" అన్నాడు.

ఇద్దరం జీప్ ఎక్కి బైలుదేరాం.

మూడు మైళ్ళ ప్రయాణమే కనక గంటలోపలే మంఘారీ గ్రామం చేరుకున్నాం. ఊరి చివర ఉన్న డాక్ బంగళా కాంపౌండ్‌లో జీప్ ఆపాడు సింగే.

బంగళా వరండాలో నిల్చున్న వ్యక్తిని చూసి ఉలిక్కి పడ్డాను.

అతను ప్రెస్ రిపోర్టర్ సైమన్!

మేము జీప్ దిగి వరండాలో కెళ్ళగానే అతను నవ్వి- "పోలీసులతో కలిసి ఆ మృగాల గురించి తెలుసుకోమని మీరిచ్చిన సలహా పాటించదలచాను, మిస్టర్ జయ శంకర్!" అన్నాడు.

ఇన్‌స్పెక్టర్‌కి అతన్ని పరిచయం చేశాను.

కానిస్టేబుళ్ళ రాకకోసం ఎదురుచూస్తూ అక్కడే కూర్చున్నాం. అంతలో ఓ జీపువచ్చి కాంపౌండ్‌లో ఆగింది. అందులో ఉన్న రెండు వేట కుక్కలనీ, ఓ యూరోపియన్ని చూసి, నేనూ, ఇన్‌స్పెక్టర్ ఒక రొన్నకరం చూసుకున్నాం.

జీపులోంచి రెండు రైఫిళ్ళు అందుకుని దిగాడతను. వెనకే ఆ వేటకుక్కలుకూడా కిందికి దూకాయి. నలభై ఏళ్ళుంటాయతనికి. పొడుగు. పొడుక్కితగ్గ లావు.

ఇన్‌స్పెక్టర్ సింగేను చూడగానే అతను కనుబొమ లెగరేసి—"హలో ఇన్‌స్పెక్టర్! ఆ చిఱుతల్ని వెతకడా నికి నియమించిన అధికారి మీరేననుకుంటాను," అన్నాడు కలుపుగోలుగా.

"ఔను. మీరెవరు?" అడిగాడు సింగ్ అతన్ని తేరి పార చూస్తూ.

"నన్ను రాబర్ట్ అంటారు! బ్రిటిష్ జాతీయుణ్ణి. బిజినెస్ దృష్ట్యా ప్రస్తుతం బర్మాలో ఉంటున్నాను. నా ముఖ్య హాబీల్లో వేట ఒకటి. ఇదివరకు పాతిక పులుల్ని చంపి గోల్డ్ మెడల్ అందుకున్నాను.

రైలు దుర్ఘటనలో పారిపోయిన ఆ నల్లచిఱుతలగురించి విని, వాటిని తుదముట్టించడంలో పోలీసులకి తోడ్పడ్డానికి, కమీషనర్ గారితో మాట్లాడాను. ఆయన అందుకు అనుమతించి, మీ గురించి చెప్పారు.

సౌకర్యంకోసం ఈ రెండుకుక్కల్నికూడా తెచ్చాను. ఇది ఆడకుక్క జూలీ, ఇది మగకుక్క యేగీ. రెండూ వేటలో ఆరితేరినవి. అడవిలో చిఱుతల ఉనికి ఇట్టే పసిగట్టగలవు..."

అతనిమాట ఇంకా పూర్తికాలేదు.

అంతలో ఓ అంబాసిడర్ కారువచ్చి కాంపౌండ్‌లో ఆగింది. అందరం అటు చూశాం. కార్లోంచి పాతికేళ్ళ యువతీ,గుండ్రాయిలాంటి నల్లఖైవేళ్ళ వ్యక్తీ దిగారు. వారి ముఖ కవళికలు చైనీయులని పోలి ఉన్నాయి ఇద్దరూ. పెద్దపెద్ద లెదర్ బ్యాగ్స్ భుజాలకి తగిలించుకుని మావైపు వచ్చారు.

"ఇక్కడేదో వేటబృందం బసచేసినట్టుందే!" అన్నాడతను కాంపౌండ్‌లో గెంతుతున్న కుక్కల్నీ, రాబర్ట్ చేతిలో ఉన్న రైఫిళ్ళనీ చూస్తూ.

"ఔను. ట్రేన్ ఏక్సిడెంట్‌లో తప్పించుకున్న చిరుత పులులను వేటాడ్డానికి వచ్చాం! మీరెవరు?" అడిగాడు రాబర్ట్.

"నా పేరు తింగ్ ఫ్రా! ఈమె నా భార్య చీ ఫెంగ్. నేను ఫారెస్ట్ కంట్రాక్టర్ని. చాలాకాలం క్రితం చైనా నించి వచ్చి బర్మాలో స్థిరపడ్డాను. ఈ చుట్టుపక్కల ఫారెస్ట్ ఏరియా ఎలా ఉందో చూసిపోదామని వచ్చాను" అన్నాడతను.

ఆ యువతి అందుకుని —"ఆ నల్ల చిఱుతల గురించి పేపర్లో— చదివాను. అవి ఈ అడవుల్లో నే తిరుగుతున్నా యన్నమాట. వాటిని ఎలా వేటాడతారో మీతో వుండి ప్రత్యక్షంగా చూడాలనుంది. అనుమతిస్తారా?" అంది ఉత్సాహంగా.

"వద్దు డార్లింగ్! నాకు మృగాలంటే చచ్చే భయం! పైగా చిఱుతపులులు చాలా ప్రమాదకరమైన జంతువులు!" అన్నాడు తింగ్ ఫ్రా భయంగా.

"భయం దేనికి? వీళ్ళంతా మనవెంట ఉంటారుగా? మిస్టర్ రాబర్ట్! ఆ జంతువుల మెడల్లో పెంపుడు కుక్కల్లా తోలు పట్టాలుకూడా ఉన్నాయని విన్నాను. నిజమేనా?" అంది చీ ఫెంగ్.

అంతవరకూ మౌనంగా వారి సంభాషణ వింటున్న నేను ఆమె నోటినించి తోలుపట్టాల ప్రసక్తి వినగానే ఉలిక్కిపడ్డాను.

రాబర్ట్ నవ్వి — "ఔను. వాటివల్ల అవి మరింత అందంగా కనిపిస్తాయటకూడా!" అన్నాడు నావైపు చూస్తూ.

నా బుర్ర చురుగ్గా పనిజేస్తోంది. వీళ్ళు తమ గురించి చెప్పుకుంటున్న దంతా నిజమేనా? లేక, ఆ ఫార్ములా కోసం ప్రయత్నిస్తున్న విదేశీ ఏజెంట్లా?

సైమన్ నిజంగా పత్రికా విలేఖరా? ఐతే, ఎటువంటి ప్రాముఖ్యతా లేని ఇంత చిన్న విషయాన్ని అమెరికన్ పత్రికల కెక్కిస్తానని దేనికి పరిగెత్తుకు రావడం?

బ్రిటిష్ జాతీయుడైన రాబర్ట్ నిజంగా వేటకోసం వచ్చాడా? చైనా దేశస్థుడైన తింగ్ ఫూ నిజంగా ఫారెస్ట్ కంట్రాక్టరా?

నా ఆలోచనలకి బ్రేకు వేస్తూ, పోలీస్ బలగంతో నిండిన వ్యాన్ వచ్చి ఆగింది. కాంపౌండ్ లో.

## 7

ఇన్ స్పెక్టర్ షింగే ఆదేశానుసారం అందరం తలో రైఫిల్ అందుకుని, కావలసిన సరంజామాతో కాలినడకన బయలుదేరాం అడవివైపు.

అడవిని సమీపించాక, ఇన్ స్పెక్టర్ అందర్నీ నాలు గైదు పార్టీలుగా విభజించాడు. నన్నూ, రాబర్ట్ నూ, అతని రెండు కుక్కల వెంట తూర్పుదిశగా వెళ్ళమన్నాడు.

అందరూ అతను చెప్పిన దిశల్లో ముందుకు సాగారు.

నేనూ, రాబర్ట్ వేటకుక్కల వెంట అడవిలో ప్రవేశించాం. కుక్కలు నేలనూ, పొదలనూ వాసన చూస్తూ ముందుకు సాగుతున్నాయి.

అరగంట తరవాత చిన్న కొండప్రదేశం చేరుకున్నాం. హఠాత్తుగా ఆడకుక్క మొరుగుతూ ఓ వైపు పరుగు తీసింది.

మగకుక్క మాత్రం గాలిలో వాసనచూస్తూ మా దగ్గిరే వుండిపోయింది. బైనాక్యులర్స్ తో కుక్క పరుగెత్తిన వైపు చూశాడు రాబర్ట్. "నథింగ్! ఏమీ కనిపించడంలేదు. జాలీ పొదల్లోపడి ఎటో మాయమైంది.

కాసేపటికి అదే వస్తుంది పదండి,'' అంటూ ముందుకు సాగాడు.

అతన్ని అనుసరించాను.

సరిగ్గా అదే సమయంలో మగకుక్క కూడా గొంతెత్తి మొరుగుతూ మరోవైపు పరుగుతీసింది.

రాబర్ట్ ఆగిపోయాడు. ''కుక్కలు చిఱుతపులుల వాసన పట్టేశాయి. అందుకే ఇంత ఆర్భాటం చేస్తున్నాయి,'' అన్నాడు.

చుట్టూ పరీక్షగా చూశాను.

ఫర్లాంగు దూరంలో అంతకుముందు ఆడకుక్క వెళ్ళిన వైపు ఆకాశాన కాకులూ, గద్దలూ ఎగురుతూ కనిపించాయి.

''అక్కడేదో జంతువు శవం పడుంటుంది, పదండి చూద్దాం!'' అన్నాడు రాబర్ట్.

ఇద్దరం వడివడిగా అటు నడిచాం.

చెట్లూ, పుట్టలూ దాటుకుంటూ అరగంట తర్వాత చిన్న మైదానం వంటి ప్రదేశం చేరుకున్నాము. రాబర్ట్ చెయ్యి అడ్డంపెట్టి నన్నుఆపాడు. మాకు కొద్దిదూరంలో సగంతిని పడున్న జంతువు శవం కనిపిస్తోంది.

బైనాక్యులర్స్‌లోంచి చూసిన రాబర్ట్ అదిరిపడి—

''మైగాడ్! అది జూలీ శవం!'' అన్నాడు దిగ్భ్రాంతితో. చటుక్కున అతని చేతిలోంచి బైనాక్యులర్స్ లాక్కొని చూశాను. నిజమే! అది జూలీశవం!! శవానికి కొద్ది దూరంలో చిన్నగుడిసె కనిపిస్తోంది. నాలుగు వైపులా మట్టిగోడలు లేపి, పైన గడ్డివాము కప్పిన గుడిసె అది. గుమ్మానికి తెరచివున్న చెక్క తలుపు.

"సందేహం లేదు. ఆ మృగాలు ఇక్కడే యెక్కడో నక్కి వుంటాయి. జూలీ వాటి ఉనికి కనిపెట్టి తన ప్రాణాలు పోగొట్టుకుంది" అన్నాడు రాబర్ట్.

అంతలో గుడిసె దగ్గర ఏదో కదులుతున్నట్లు లీలగా కనిపించింది. పరీక్షగా చూశాను. అదే సమయంలో గుడిసెలోంచి ఓ చిఱుత బయటకు వచ్చింది. నేనూ రాబర్ట్ అటే చూస్తుండి పోయాం.

చిఱుతపులి తలుపు దగ్గర నిల్చొని గట్టిగా ఆవులించి తోక ఊపుకుంటూ జూలీశవం పడున్న చోటికివచ్చి, పళ్ళతో శవాన్ని విదిలించ సాగింది.

అప్పుడు గమనించాను. అది ఆడచిఱుత! ఇప్పుడు దాని కడుపు పెద్దగా లేదు. అంటే పిల్లల్ని ఈనిందన్న మాట.

రాబర్ట్ రైఫిల్ బోల్టు లాక్ జేసి భుజానికి ఆనించాడు.

చిఱుతపులి అప్పుడే పక్కశాలొకటి నోట కరచుకుని రెప్పపాటులో గుడిసెలో కెళ్ళిపోయింది.

సడన్‌గా ఓ ఆలోచన వచ్చింది నాకు. "మిస్టర్ రాబర్ట్! మనందాన్ని చంపకుండా సజీవంగా పట్టుకోవచ్చు" అన్నాను.

"ఎలా?" అడిగాడతను రైఫిల్ దించుతూ.

"నేను చడీ చప్పుడూ చెయ్యకుండా గుడిసె దగ్గిర కెళ్ళి ఇవతలనించి తలుపుమూసి గొళ్లెం పెడతాను. తరవాత మిగతా వాళ్ళనిపిల్చి దాన్ని పట్టుకోవచ్చు" అన్నాను.

రాబర్ట్ తలూపి—"జాగ్రత్త! మీరు గుడిసెను సమీపించాక అది బైటికివస్తే, నాగురి తప్పితే, జరిగే పరిణా

మాలకి మీదే బాధ్యత!'' అన్నాడు.

తలూపి, పిల్లిలా అడుగులు వేస్తూ అటు నడిచాను.

గుండెలో దడ ప్రారంభమైంది. గుడిసె తలుపుకీ, రాబర్ట్ రైఫల్ కీ మధ్య వుండకుండా కాస్త యెడంగా నడుస్తున్నాను. గుడిసె దగ్గరవుతున్నకొద్దీ కాళ్ళు వణక నారంభించాయి. సన్నసన్నగా చెమటలు పట్టసాగాయి.

ఊపిరి బిగబట్టి గుడిసెని సమీపించాను. లోపల కుఁయ్—కుఁయ్ మన్న శబ్దాలు వినవస్తున్నాయి. గుడిసె లోనే ఉనిందన్నమాట పిల్లల్ని.

మెరుపులా గెంతాను తలుపుదగ్గరికి. తలుపు గొళ్ళెం పట్టిలాగి, మూసేశాను తలుపును. ఇవతల గొళ్ళెం బిగించి నిట్టూర్చాను తృప్తిగా. లోపల చిఱుతపులి పెద్దగా గాండ్రిస్తూ తలుపు దగ్గరకివచ్చి, పంజాతో గీరుతున్న శబ్దం అవుతూంది.

అంత వరకూ దూరంగా నిల్చున్న రాబర్ట్ పరిగెత్తుకు వచ్చాడు నా దగ్గరికి. ''మిస్టర్ జయశంకర్! మీ ధైర్యాన్ని నిజంగా మెచ్చుకోవాలి'' అన్నాడు అభి నందిస్తూ.

''మిగతా వాళ్ళని ఇక్కడకు రప్పించాలి. గాలిలో రెండు మూడుసార్లు పేలిస్తే వాళ్ళొస్తారు,'' అంటూ నా రైఫిల్ ఎత్తి గాలిలో పేల్చాను.

అనుకున్నట్టే అరగంట లోపల నలుదయిపులనుంచీ అందరూ పరుగెత్తుకొచ్చారు.

ఇన్‌స్పెక్టర్ షింగేకు జరిగింది చెప్పి—''మీ వాళ్ళని ఊళ్ళోకి పంపి, వెంటనే ఓ బోను తెప్పించండి,'' అన్నాను.

తక్షణం పదిమంది భటులు బయలుదేరారు.

మధ్యాహ్నం మూడుగంటల ప్రాంతంలో బోను మోసుకుంటూ తిరిగి వచ్చారు. దాన్ని గుడిసె తలుపుకి పూర్తిగా ఆనించి పెట్టించాను.

గుడిసె లోపల పులియింకా గాండ్రిస్తూనే వుంది. పిల్లల్నికన్న ఏ జంతువయినా సరే, చాలా ప్రమాదకరంగా మారిపోతుంది, పిల్లల రక్షణకోసం.

బోనుమీద ఎక్కి నిల్చున్నాను. మెల్లిగా గుడిసె తలుపు గొళ్లెంతీసి లోనికి తోశాను తలుపుని. వెంటనే బోను ద్వారం యెత్తిపట్టుకున్నాను. రెండు నిమిషాల వరకు ఏమీ జరగలేదు.

అందరం ఊపిరి బిగబట్టి చూస్తున్నాం. కాసేపయాక చిరుత అడుగులో అడుగు వేసుకుంటూ తలుపు దగ్గరికి వచ్చింది. అక్కడ నిల్చున్న వాళ్ళందరూ కనిపించేసరికి ఆగ్రహంతో దిక్కులు దద్దరిల్లేలా గాండ్రిస్తూ బైటికి లంఘించింది. వెంటనే తలుపు తోసేశాను. చిరుత, బోనులో ఖైదీ అయింది!

తల్లి కనిపించకపోవడంతో లోపల పెద్దగా అరుస్తున్నాయి చిరుతకూనలు. భటులచేత బోను వెనక్కి నెట్టించి, చేతిలో రైఫిల్ జాగ్రత్తగా పట్టుకుని గుడిసెలో ప్రవేశించాను.

ఓ మూల రెండు కూనలు గొంతెత్తి అరుస్తూ కనిపించాయి. పిల్లికూనల్లా ముద్దుముచ్చటగా ఉన్న వాటిని ఒళ్ళో ఎత్తుకుని గుడిసె ఇవతలికి వచ్చాను. ఆ దృశ్యం చూడగానే బోనులో ప్రళయతాండవం చెయ్యసాగింది తల్లి చిరుత. బోను తెలుపు కొద్దిగా ఎత్తి, పిల్లల్ని లోనికి తోశాను.

"సూర్యాస్తమయం కాబోతోంది. మగ చిరుతకోసం వెదుకుతూ కూర్చుంటే చీకటి పడిపోతుంది. దాని సంగతి రేపు చూద్దాం పదండి" అన్నాడు షిండే.

అందరం ఆకలి దప్పికలతో అలసి ఉన్నాం గనుక, అతనితో ఏకీభవించాం. జవాన్లందరూ కలిసి భుజాలమీద బోను మోసుకుంటూ బైలుదేరారు.

అంతలో, మమ్మల్ని వదిలి ఎటో వెళ్ళిపోయిన మగ కుక్క యేగీ హఠాత్తుగా వచ్చి మాతో కలిసింది!

సూర్యుడస్తమించే సమయానికి బంగళా చేరుకున్నాం. చిరుత ఉన్న బోను కాంపౌండ్ లో ఓ మూల దించబడింది. నా మనసంతా మగ చిరుతమీదే ఉంది. దాని మెడలోనే ఆ కేప్సూల్ ఉంది మరి!

అప్పుడే సడన్ గా ఓ ఆలోచన వచ్చింది.

వీరిలో నిజంగా ఆ కేప్సూల్ కాజెయ్యాలనుకున్న వ్యక్తులు ఉండి ఉంటే, ఈ రాత్రి తప్పకుండా బోనులో ఉన్న చిరుతపులి మెడలోంచి పట్టా కాజెయ్యడానికి ప్రయత్నిస్తారు.

నేనా కేప్సూల్ ను చిరుతల పట్టాలోనే దాచి వుంటానని వారు పసిగట్టినా, అది ఏ చిరుత మెడలో ఉందో ఖచ్చితంగా తెలిసి ఉండదు.

రాత్రి చీకట్లో బోను చుట్టుపక్కల నక్కి కాపు కాస్తే,

పట్టా ఎవ్వరు కాజెయ్యడానికి ప్రయత్నిస్తారో తెలిసిపోతుంది.

స్నానాలూ, భోజనాలూ ముగిశాక అందరూ ఎవ్వరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

రాత్రి సరిగ్గా పదిన్నరకు ఏ చప్పుడూ చెయ్యకుండా నా గదిలోంచి బైటపడ్డాను. జవాన్లందరూ అలసి ఉండటంవల్ల వాళ్లూ అదమరచి నిదరబోతున్నారు.

అడుగులో అడుగు వేసుకుంటూ బంగళా బైటికి వచ్చాను. చీకటి! పరిసరాలను నిశ్శబ్దం రాజ్యమేలుతోంది. కాంపౌండ్‌లో అక్కడక్కడా గుబురుగా ఎదిగిన పూల మొక్కలున్నాయి.

బోను దగ్గరికి నడిచాను. చిఱుతపులి కాళ్ళు బార్లా జాపుకూర్చుని పిల్లలకి పాలిస్తోంది. నన్ను చూడగానే గుర్రుమంది. చటుక్కున ఓ పొద వెనక్కి తప్పుకుని నక్కి నిల్చున్నాను.

అలా అర్ధరాత్రులు ఒంటరిగా నిల్చుని కాచుకోడం చాలా కష్టంగా ఉంటుంది. ఓపిగ్గా నిల్చుని చూస్తున్నాను.

అరగంట గడిచింది.

హఠాత్తుగా నా పక్కనే ఏదో చప్పుడైంది.

ఉలిక్కిపడి వెనుదిరగబోయాను. బుర్ర పగిలేలా పడింది దెబ్బ. చెవులు గింగురుమన్నాయి. కళ్ళల్లో చుక్కలు మెరిశాయి. మైకం కమ్ముకోసాగింది. ఉన్న పళంగా అక్కడే నేలకూలాను.

తిరిగి కళ్ళు తెరిచి చూస్తే, చీకట్లు తొలిగిపోయి తెల తెలవారుతోంది. దూరాని ఊళ్ళోంచి కోడికూతలు లీలగా వినిపిస్తున్నాయి. చటుక్కున లేచి కూర్చున్నాను.

చుట్టుపక్కల ఎవ్వరూ లేరు. ఒక్క ఉదుటున లేచి బోనువైపు పరుగెత్తాను. బోనులో కనిపించిన దృశ్యం నన్ను రాతిబొమ్మను జేసింది.

చిఱుత పులి నిర్జీవంగా పడుంది లోపల. ఈగలు దాని మీద పడి పొర్లుతున్నాయి. చిఱుత మెడలోని పట్టా మాయమైంది.

# 8

చిఱుతపులి మరణవార్త వినగానే అందరి మొహాల్లో దిగ్భ్రాంతి కనిపించింది. ఎలా జరిగిందని పరస్పరం తర్జన భర్జన పడసాగారు.

ఎవ్వరి మొహాల్లోనూ అనుమానాస్పదమార్పులు కనిపించలేదు. హంతకుడికి నటనలోనూ మంచి ప్రావీణ్యం ఉందన్నమాట!

ఇన్‌స్పెక్టర్ షింగే అందర్నీ ఆ విషాదంనుండి మళ్ళించి త్వరగా తయారై మగ చిఱుతకోసం బైలుదేరాలని ఆదేశించాడు.

సరిగ్గా పదిగంటలకి అందరం బైలుదేరాం.

మొదటిలాగే నేనూ, రాబర్ట్, అతని కుక్క యేగీ ఒక పార్టీగా అడివిలో ప్రవేశించాం.

కొద్దిదూరం నడిచామో లేదో, హఠాత్తుగా రాబర్ట్ కాళ్ళకింది ఎండుటాకులూ, పుల్లలూ ఫెళ ఫెళ విరిగి, అతను అమాంతం పెద్ద గోతిలో పడిపోయాడు. ఆ పడిపోవడంలో అతని ఎడంచేతిలోని రైఫిల్ ఎగిరి ఒడ్డున పడింది.

వేటగాళ్ళు అడివి దున్నలనీ, దుప్పులనీ సజీవంగా పట్టుకోడానికి అడవుల్లో ఇటువంటి గోతులు తవ్వి, పైన వెదురుబద్దలు పేర్చి, వాటిమీద ఎండుటాకులు కప్పి ఉంచుతారు. పైకి మామూలు నేలలా కనిపిస్తుందది. ఏమరుపాటుగావున్న జంతువులు ఇటు రాగానే అందులో పోపడితాయి.

చాలా సేపటి వరకూ రాబర్ట్ ఆ షాక్‌లోంచి తేరుకో లేదు.

అతని చెయ్యి అందుకుని ఇవతలకి లాగాను.

బట్టలకంటిన చెత్తా చెదారం దులుపుకుంటూ—"అడవుల్లో ఇవి మామూలే! పదండి" అన్నాడు రైఫిల్ అందుకుని. ఇద్దరం తిరిగి ముందుకు సాగాం.

హాఠాత్తుగా అతని కుక్క మొరగడం మొదలు పెట్టింది.

"వెరీ గుడ్! యేగీ, చిఱుతపులి వాసన పట్టేసింది" అన్నాడు రాబర్ట్.

నేలని వాసనచూస్తూ, మొరుగుతూ ఓ వైపు బైలు దేరింది కుక్క. ఇద్దరం రైఫిళ్ళు రెడీగా పట్టుకుని, అటు నడిచాం. కొద్దిదూరంలో నే పెద్ద మఱ్ఱిచెట్టు కనిపించింది.

కుక్క చెట్టుకిందికెళ్ళి వాసన చూడసాగింది.

చటుక్కున తలెత్తి ఎగురుతూ మొరగసాగింది.

ఇద్దరం చెట్టుకొమ్మలవైపు చూశాం.

చిఱుత కనిపించింది!

ఓ కొమ్మమీద నక్కికూర్చుని, నాలిక చప్పరిస్తూ యేగీని చూస్తోంది. మెరుపులా రైఫిల్ గురిపెట్టి కాల్చాను. అంతే! గుండు తగిలి పిండిబస్తాలా కిందకూలింది.

మరుక్షణం స్ప్రింగ్‌లా ఎగిరి పరుగుతీసింది.

చూస్తూ చూస్తూనే పొదల్లోపడి మాయమైంది.

అది పడ్డచోట రక్తపు మరకలు!

"గుండు తగిలింది దానికి! గాయపడ్డ చిఱుత చాలా ప్రమాదకరంగా మారిపోతుంది. ఇప్పుడెలా?" అన్నాడు రాబర్ట్.

"గాయంవల్ల అది ఎక్కువదూరం పారిపోలేదు. మనం చెరో దిక్కు వెళ్ళి వెతుకుదాం!" అన్నాను.

రాబర్ట్ తలూపి, కుక్కను వెంటబెట్టుకుని, చిఱుత పరిగెత్తినవైపు బైలుదేరాడు.

నేను మరోవైపు ముందుకు సాగాను. చెట్లూ, పుట్టలూ చాలా పరీక్షగా చూసుకుంటూ అరగంట నడిచి ఉంటాను.

హఠాత్తుగా ఓ చోట కాళ్ళకి బ్రేకులు పడ్డట్టు ఆగిపోయాను. పది గజాల దూరంలో కాళ్ళు బార్లా చాపి పడుంది చిఱుత, నిశ్చలంగా! రాయి అందుకుని దాని మీదికి విసిరాను. ఐనా కదలిక లేదు దానిలో.

చిఱుతపులి చాలా జిత్తులమారిదంటారు. ఇలాగే, చచ్చినట్టు పడుండి, శత్రువు దగ్గరికి రాగానే మీదికి లంఘిస్తుందిట!

రైఫిల్ రెడీగా పట్టుకుని అడుగులో అడుగు వేసుకుంటూ దాన్ని సమీపించాను. పరీక్షగా చూశాక, అది శ్వాస కూడా తీసుకోవడం లేదని రూఢి అయింది. ధైర్యంగా దాన్ని సమీపించాను.

చిఱుత నిజంగానే చచ్చింది.

క్షణం వృధా చెయ్యకుండా మడతకత్తి తీసి, దాని మెళ్ళోని తోలుపట్టా ఊడదీశాను. కుట్లు కట్ చేసి చూశాను ఆత్రంగా. కేప్‌సూల్ సురక్షితంగా ఉంది! తృప్తిగా నిట్టూరుస్తూ దాన్ని కోటుజేబులో వేసుకున్నాను.

అప్పుడు వినిపించింది వెనక ఏదో చప్పుడు.

లేస్తూ గిరుక్కున వెనుదిరిగాను.

రాబర్ట్!

రైఫిల్ నావైపు గురిపెట్టి నవ్వుతున్నాడు.

నా గుండెలో రేసుగుర్రాలు దౌడు తీస్తున్నాయి.

"మిస్టర్ జయశంకర్! జేబులోంచి ఆ కేప్సూల్ తీసి ఇలా పడేయ్! ఆ ఫార్ములాతో తిరిగి నాదేశం సూర్యుడస్తమించని సామ్రాజ్యాన్ని స్థాపించుకుంటుంది. కోల్పోయిన అఖండ పేరు ప్రతిష్టలను తిరిగి సంపాదించుకుంటుంది" అన్నాడు ఆ బ్రిటిష్ జాతీయుడు వికృతంగా నవ్వుతూ.

"అంత విలువైన ఫార్ములాను నీ నక్క బెదిరింపులకి భయపడి ఊరికే ఇస్తాననుకున్నావా?" అన్నాను వెటకారంగా.

రాబర్ట్ మొహం జేవురించింది. "ఊరికే ఇవ్వక! ప్రాణాలు పోగొట్టుకుని ఇవ్వు!" అంటూ రైఫిల్ నావైపు గురిపెట్టి, ట్రిగ్గర్ వత్తాడు.

క్లిక్‌మన్న శబ్దం! రైఫిల్ పేలలేదు!!

రాబర్ట్ నిర్ఘాంతపోయి, చటుక్కున మేగ్జిన్ తీసి చూశాడు. అతని మొహం వెలవెలబోయింది.

పకపక నవ్వాను. "ఇటువంటి పరిస్థితి వస్తుందని నాకు ముందే తెలుసు మిస్టర్ రాబర్ట్! అందుకే గుంటలో పడిపోయినప్పుడు నీ రైఫిల్ మేగ్జిన్‌లోంచి గుళ్ళు ఖాళీ చేశాను. ఆ ముందుచూపే ఇప్పుడు నా ప్రాణాలు కాపాడింది. ఇహ పరలోకానికి ప్రయాణం కట్టే వంతు నీది!" అంటూ నా తుపాకి ఎత్తి ఏమాత్రం సందేహించకుండా కాల్చేశాను.

సరిగ్గా అతని గుండెలో దిగింది గుండు.

రాబర్ట్ నమ్మనట్టు, విశ్వాసం రానట్టు నావైపు చూస్తూ గుండె పట్టుకుని బోర్లా పడిపోయాడు.

అప్పుడు మెరిసింది నా బుర్రలో ఓ ఆలోచన! కత్తి అందుకుని, చిఱుతపులి పంజా కొట్టినట్టు కుడి భుజంకింద రెండుమూడు గాట్లు పెట్టుకున్నాను.

రక్తం ధారగా కారసాగింది.

అంతలో, రైఫిల్ ప్రేలుళ్ళు విని అందరూ పరిగెత్తుకొచ్చారక్కడికి. రక్తసిక్తమైవున్న నన్నూ, కిందపడున్న రెండు శవాలనూ చూసి, నివ్వెరబోయారు.

"మేమిద్దరం ఇటు రాగానే ఆ పొదల్లో నక్కివున్న చిఱుత హఠాత్తుగా మామీదికి లంఘించింది. నన్ను గాయ పరిచి, రాబర్ట్ మీదికి దూకింది. ఆ స్థితిలో నా కేటూ తోచక రైఫిల్ గురిపెట్టి రెండుసార్లు కాల్చాను దాని మీద. అందులో ఓ గుండు రాబర్ట్‌కు తగిలింది..." అన్నాను మొసలిటక్కులు ప్రదర్శిస్తూ.

ఇన్‌స్పెక్టర్ షిండే, వచ్చేటప్పుడు తన సిపాయిల వెంట ఫస్టెయిడ్ బాక్స్ కూడా తెప్పించాడు అడివికి! దాన్ని తెరిచి కారుతున్న నా రక్తాన్ని దూదితో తుడిచి, మందువేసి బాండేజ్ కట్టాడు.

తరవాత, రాబర్ట్ శవాన్ని మోసుకుంటూ విచార వద నాలతో తిరుగుముఖం పట్టారందరూ!

బంగళా చేరగానే శవాన్ని సిపాయిల వెంట వ్యాన్‌లో పేగో సిటీకి పంపేశాడు ఇన్‌స్పెక్టర్.

ఆ రాత్రి అక్కడే రెస్టు తీసుకుని ఉదయం ఎవరిదారి వారు పట్టాలని మిగతావాళ్ళ అక్కడే ఉండిపోయాం.

గదిలో లైటార్పి మంచంమీద వాలాను.

బాగా అలసి వుండటం వల్ల అందరూ తమతమ గదుల్లో ఆదమరచి నిదురిస్తున్నారు. పడుకున్న మరు క్షణం నాకు నిదర పట్టేసింది.

అర్థరాత్రి ఎందుకో చటుక్కున కళ్ళు తెరుచు కున్నాయి. గదిలో గాఢాంధకారం! బైట చెట్లఆకులు కూడా కదులుతున్న అలికిడిలేదు. కళ్ళు పెద్దవిచేసి చీకట్లో పరీక్షగా చూశాను.

అప్పుడు కనిపించింది, మంచం కాళ్ళదగ్గర ఓ ఆకారం!

"ఎవ్వరూ?" అంటూ దిగ్గున లేవబోయాను.

అదే క్షణంలో లైటు వెలిగింది.

తింగ్ ఫ్రూ! చీఫెంగ్!!

"నా గదిలో ఏం జేస్తున్నారు మీరు?" అడిగాను నివ్వెరబోతూ.

తింగ్ ఫూ బంగారు పళ్ళు బైటపడేలా చిన్నగా నవ్వాడు. "ఇంకా అర్థంకాలేదా? ఆ కేప్ స్యూల్ కోసం వచ్చాం మిస్టర్ జయశంకర్!" అతని చేతిలో నల్లగా మెరుస్తోంది పిస్తోలు.

సాలోచనగా తలూపాను. "ఐతే మీరిద్దరూ రాబర్ట్ స్నేహితులన్నమాట!"

"రాబర్ట్‌తో మాకెలాంటి సంబంధం లేదు. అతను మా మనిషైవుంటే అలా కుక్కచావు చచ్చేవాడుకాదు. సరే, ఆ కాప్ స్యూల్ మీ దగ్గరుండటం మా దేశానికి ప్రమాదం. గత యుద్ధంలో పోగొట్టుకున్న టిబెట్‌ను

తిరిగి మీరు స్వాధీనం చేసుకోవడం మాకిష్టంలేదు...''
అన్నాడు తింగ్ ఫూ చాలా నెమ్మదిగా.

''కేప్ సూల్ ఏమిటి? మీ రేమంటున్నారో నాకర్థం కావడంలేదు.''

ఈసారి పకపక నవ్వింది చీఫెంగ్. ''బుకాయించి లాభంలేదు. నువ్వు చిఱుతపులి మెడలోంచి దాన్ని స్వాధీనం జేసుకున్న సంగతి మాకు తెలుసు. రాత్రి నిన్ను స్పృహ పోగొట్టిందికూడా మేమే.''

''నామాట నమ్మండి! కేప్ సూళ్ ఏమిటో నాకు తెలీదు.'' అంతవరకూ నవ్వుతున్న తింగ్ ఫూ మొహం మారిపోయింది.

''చీఫెంగ్! పాపం, అతనికి ప్రాణాలమీద ఆశ లేనట్టుంది. అతని కాళ్ళూ చేతులూ మంచానికి విరిచి కట్టెయ్. గదంతా వెదికి చూద్దాం. అప్పటికీ దొరక్క పోతే చిత్రవధ జేసి కక్కిద్దాం!'' అంటూ జేబులోంచి నైలాన్ తాడు తీసి ఆమెవైపు విసిరాడు.

చీఫెంగ్ తాడందుకుని నన్ను సమీపించింది. నిమిషాల్లో నాకాళ్ళూ చేతులూ మంచానికి విరిచి కట్టేసింది. తరువాత ఇద్దరూ కలిసి గది అణువణువూ వెదకసాగారు.

ఏమీ దొరక్క నిట్టూరుస్తూ నన్ను సమీపించారు.

నూలుపోగు వదలకుండా నా బట్టలు సోదాజేసి నిరుత్సాహంగా పెదవి విరిచారు.

''ఇప్పుడయినా మీకు నమ్మకం కలిగిందా? ఇక వదలండి నన్ను!'' అన్నాను గింజుకుంటూ.

''మిస్టర్ జయశంకర్! నువ్వుదాన్ని ఎవ్వరికో ఇచ్చేశావ్!'' అన్నాడు తింగ్ ఫూ నన్ను తీక్షణంగా చూస్తూ.

"ఎవరికిస్తాను? నా మనుషు లెవరున్నారిక్కడ?"

"ఇతను మాటలతో వినే ఘటంలా లేడు. మన చైనీస్ పద్ధతులుపయోగించామంటే క్షణంలో నోరు విప్పుతాడు." అంది చీ ఫెంగ్ అసహనంగా.

"ఔను. అదే చెయ్యాలి" అంటూ అడుగు ముందుకు వేశాడు తింగ్ ఫూ.

"మిస్టర్ తింగ్ ఫూ! అడుగు ముందుకు కెయ్యక! బుద్ధిగా పిస్తోలుకింది పడేసి చేతులెత్తు. చీ ఫెంగ్! నువ్వు కూడా!" అన్న కంఠంవిని ముగ్గురం ఉలిక్కిపడి అటు చూశాం.

ఇన్‌స్పెక్టర్ షింగే కిటికీలో పిస్తోలు గురిపెట్టి నిల్చున్నాడు. "చెప్పేది మీకే! పిచ్చివేషాలు వెయ్యడానికి ప్రయత్నించకండి. నేనొక్కణ్ణే లేను. నలుగురు కానిస్టేబుళ్ళుకూడా వున్నారు నావెంట" అన్నాడు షింగే కఠినంగా.

చేసేదిలేక పిస్తోలు కింద జారవిడిచాడు తింగ్ ఫూ.

"చీ ఫెంగ్! నువ్వువచ్చి తలుపు తెరువ్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

చీ ఫెంగ్ అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళితలుపు తెరిచింది. మరుక్షణం ఇన్‌స్పెక్టర్ షింగే, నలుగురు కానిస్టేబుళ్ళూ బిలబిలమంటూ వచ్చారు లోనికి.

వాళ్ళు ఆ చైనీయుల చేతులకి బేడీలు బిగించి బైటకు తీసికెళ్ళారు.

"ఇన్‌స్పెక్టర్ షింగే! సమయానికివచ్చి నన్ను కాపాడారు. లేకుంటే ఆ చైనీయుల చిత్రవధలు భరించలేక నేను దిక్కులేని చావు చచ్చేవాణ్ని," అన్నాను కృతజ్ఞతగా.

షింగే నవ్వి—"మిమ్మల్ని కాపాడటానికి రాలేదు మిస్టర్ సారథీ! ఆ కేప్సూల్ రాబట్టుకో డానికివచ్చాను" అన్నాడు.

అతని నోట నా అసలు పేరు విని నిర్ఘాంత పోయాను. షింగే పకపక నవ్వి—"ఆశ్చర్య పడకండి! మీరు ఇండియన్ ఇంటెలిజెన్స్ శాఖ ఉద్యోగి అయుంటారని నేను ముందే ఊహించాను.

హాస్పిటల్లో రెండురోజులు స్పృహతప్పి పడున్న సందర్భంలో మీరేదో కేప్సూల్ గురించీ, మైక్రోఫిల్మ్ గురించీ పలవరిస్తున్నారనీ, తనకు మీమీద అనుమానం ఉందనీ, డాక్టర్ మాకు తెలియచేశాడు.

కమీషనర్ గారు వెంటనే నన్ను రంగంలో దింపారు. ఇప్పుడు మీ ముగ్గురిమధ్య సంభాషణతో ఆ కేప్సూల్ ఎంత విలువైనదో అర్థమైంది. అదిప్పుడు మా భూభాగంలో వుంది గనక మాకే చెందాలి!" అన్నాడు.

"కథ బాగా నేవుది, కాని, అందులో చిన్నలోపం ఉంది!"

"ఏమిటది?"

"ఏదో కేప్సూల్ నాదగ్గర వుందనడం! ఆ చైనీయులిద్దరూ అర అంగుళం వదలకుండా నా సామానూ, బట్టలూ చెక్ చేశారు. ఏమీ దొరక లేదుమరి!"

"నేన్నమ్మను. రెండురోజుల వరకూ మీరీ గదిలోంచి కదలకూడదు. నా సిబ్బంది రాత్రింబవళ్ళూ యిక్కడ కాపలా వుంటారు. దాన్ని యిక్కడ కాకుంటే మరెక్కడో దాచివుంటారు మీరు. నేను క్షుణ్ణంగా వెదికి తృప్తి పడేవరకూ మిమ్మల్ని వదిలిపెట్టను," అన్నాడు ఇన్స్పెక్టర్ దృఢంగా.

# 10

రెండు రోజులు గడిచాయి. ఇన్‌స్పెక్టర్ ఎన్నిసార్లు గాలించినా, ఎన్ని తంటాలు పడ్డా ఆ కేప్సూల్ మాత్రం బయట పడలేదు. యమకింకరుల్లాంటి అతని భటులు, గదిలోపలా బైటా రాత్రింబవళ్ళూ కాపలా ఉన్నారు, ఈ రెండు రోజులు.

ఇన్‌స్పెక్టర్ విసిగి వేసారి, చివరిసారిగా నా గదిలోకి వచ్చాడు. "మిస్టర్ సారథీ! మొండికెయ్యడం మీకే నష్టం! అది దొరకందే మీరిక్కణ్ణించి కదల్లేరు. మర్యాదగా చెప్పండి దాన్నెక్కడ దాచారో?"

కాసేపు ఆలోచించి, ఇహ చెప్పక తప్పదన్నట్టు తలెత్తాను. "ఆల్‌రైట్ ఇన్‌స్పెక్టర్! మీకూ, నాకూ ఇబ్బందిలేకుండా నిజం చెప్పేస్తున్నాను. దానికోసం ఇన్నిదేశాల ఏజెంట్లు ఒక్కుమ్మడిగా నన్ను చుట్టుముట్టి ఉండటంతో వారివారి బారినుంచి దానిని కాపాడలేనని తెలిసిపోయి, ఆ మైక్రోఫిల్మ్ ఎవ్వరికీ దక్కకుండా కాల్చిపారేశాను!"

"మీ కట్టుకథ నమ్మడానికి నేనేం పసిపిల్లాణ్ణనుకున్నారా?...ఆల్‌రైట్! వేరొకరయితే చిత్రవధ చేసి దాన్ని దక్కించుకునే వాణ్ణి. మనిద్దరివీ మిత్రదేశాలు. మీ కారణాన మేము భారతదేశానికి శత్రువులం కాదల్చుకోలేదు.

మీరా కేప్సూల్‌ను వెళ్ళేటప్పుడు తీసికెళ్దామని ఎక్కడో భద్రంగా దాచివుంటారని నా అనుమానం. అది మీకూ, మాకూ ఎవ్వరికీ దక్కకుండా అక్కడే శాశ్వతంగా ఉండిపోవాలి!

ఈరోజు సాయంత్రం నాలుగ్గంటలకి మీ దేశం వెళ్ళే

విమానంలో మీరు వెళ్ళవచ్చు!'' అంటూ లేచాడు.

అన్నట్లే మధ్యాహ్నం మూడుగంటలకి అన్నిఏర్పాట్లూ చేసుకొని తిరిగి వచ్చాడు. అతని చేతుల్లో ఒకజతబట్టలు' బూట్లు ఉన్నాయి.

నేను తొడుకున్న బూట్లు, బట్టలు విప్పించి, అవి తొడిగించాడు. తరవాత నా దగ్గరున్న ప్రతివస్తువు చివరకు, నా చేతిల్రేలి ఉంగరంకూడా తీసేసుకున్నారు.

తరవాత, అతని సిబ్బంది నిఘామీద నన్ను బయటికి తీసికెళ్ళి వ్యాన్ ఎక్కించారు.

ఏర్ పోర్ట్ చేరగానే మళ్ళీ ఓగదిలోకి తీసికెళ్ళి కూర్చోబెట్టారు నన్ను.

ఇన్ స్పెక్టర్ బయటకెళ్ళి రెండు నిమిషాల తరవాత ఓ వ్యక్తిని వెంట బెట్టుకొచ్చాడు.

అతను ఏర్ పోర్ట్ డాక్టర్!!

''మిస్టర్ సారథీ! మీ విమానం బయలుదేరడానికి ఇంకా ఇరవై నిమిషాల వ్యవధివుంది. ఆలోగా చివరిసారిగా మిమ్మల్ని చెక్ చెయ్యాలి!'' అన్నాడు ఇన్ స్పెక్టర్.

డాక్టర్ నన్ను సమీపించి — ''మీ భుజం మీది గాయం చూపించండి!'' అన్నాడు.

''తప్పకుండా!'' అంటూ షర్టువిప్పి చెయ్యిచాపాను.

అతను మెల్లిగా గాయంమీది బాండేజ్ విప్పి, పరీక్షగా చూడసాగాడు గాయాలని.

కత్తితో అంగుళంలోతు దింపుకున్న గాయాలవి. ఇంకా పచ్చిగానే వున్నాయి. డాక్టర్ బొటనవేళ్ళతో కాసేపు వాటిని వత్తిచూశాడు. తరవాత తల అడ్డంగా వూపి ''నో ఇన్ స్పెక్టర్! ఇందులో ఎటువంటి వస్తువూ దాచబడలేదు,'' అన్నాడు.

ఇన్ స్పెక్టర్ సాలోచనగా తలూపి—"ఆల్ రైట్! కట్టు కట్టెయ్యండి" అన్నాడు.

డాక్టర్ తిరిగి గాయంమీద కట్టుకట్టేశాడు.

అంతలో విమానం బయలుదేరడానికి సిద్ధంగావున్నట్టు మైక్ లో ఎనౌన్స్ అయింది. సిబ్బంది వెంట తీసికెళ్ళి నన్ను విమానం ఎక్కించాడు ఇన్ స్పెక్టర్.

ఢిల్లీ ఏర్ పోర్ట్ లో విమానం దిగగానే, టాక్సీలో సరాసరి మా హెడ్ క్వార్టర్స్ చేరుకున్నాను.

నన్ను చూడగానే హార్దిక స్వాగతం పలికారు డైరెక్టర్ ముఖర్జీ.

కుర్చీలో చతికిలబడి, జరిగిందంతా పూసగుచ్చినట్టు వివరించా నాయనకు.

అంతావిన్న ఆయన, చేతో బట్టతల బాదుకొని— "ఓహ్ గాడ్! అంత విలువైన ఫార్ములా, అనుకోకుండా చేజిక్కితే కాల్చిపారేశావా?" అన్నారు.

"అటువంటి ఫార్ములాను కాల్చి పారెయ్యడానికి నాకేమైనా పిచ్చిపట్టిందను కున్నారా? అది సురక్షితంగా నాదగ్గరే వుంది. బర్మా ఏర్ పోర్ట్ లో ఆ డాక్టర్ నా గాయాన్ని పరీక్షించాడుగానీ, దానికి కట్టివున్న బాండేజ్ ను పరిశీలించలేదు. అక్కడే జరిగింది వారి పొరపాటు!

నేను కేప్ సూల్లోంచి మైక్రోఫిల్మ్ తీసి, దాన్ని బ్యాండేజ్ మడతలో నిటారుగాదాచి గాయానికి కట్టు కట్టుకున్నాను. వారిదృష్టి కేవలం కేప్ సూల్ మీద వుండటంవల్ల బాండేజ్ మడతవైపు వారి ఆలోచన వెళ్ళలేదు!" అంటూ చుట్టవిప్ప సాగాను.

—: ఐపోయింది :—

# లక్ష్మి చెలి!!

వసుంధర

"నన్నాశీర్వదించు నాన్నా!" అంటూ డబ్బు తండ్రి కందించి, ఆయన పాదాలకు ప్రణామం చేశాడు శ్రీనాథ్.

నరసింహులు కుడిచేత్తో డబ్బందుకుని ఎడంచేతిలోకి మార్చుకుని—కొడుకును కుడిచేత్తో - "దీర్ఘాయుష్మాన్ భవ!"–అని దీవించాడు. శ్రీనాథ్ లేచి నిలబడితే ఆయన డబ్బు లెక్క పెట్టి "మూడువందల ఇరవై" అన్నాడు.

"అసలు నాలుగొందలిరవై వచ్చింది నాన్నా - కానీ నాకుద్యోగమిప్పించి నాయనకు వందా ఇచ్చేశాను నువ్వు చెప్పిన ప్రకారం. ఇలా మొత్తం పది నెలలివ్వాల్సుంటుంది కదా..." అన్నాడు శ్రీనాథ్.

నరసింహులు డబ్బు జేబులోకి తోసేసి — "ఎన్ని మూడొందలైతే పదిలక్షలయ్యేను..." అన్నాడు.

"పదిలక్షలెందుకు నాన్నా-మనిద్దరం తినడానికీ తిరగడానికీ రెండొందలయాభై చాలు. ఇందులోనే మనకింకా మిగుల్తుంది..." అన్నాడు శ్రీనాథ్.

నరసింహులు కొడుకువంక పరీక్షగా చూశాడు. ఆయనకు నవ్వొచ్చింది. అతనికళ్ళలో మెరుపును చూస్తుంటే. ముప్పై మూడొందలిరవై రూపాయలు సంపాదించగలిగినందుకు వచ్చిన మెరుపు అది. కానీ తనకు పదిలక్షలు సంపాదించే మార్గం తెలుసు!

అంతలోనే ఆయన మనసుఆర్ద్రమైపోయింది. కొడుకు చాలా బుద్ధిమంతుడు. ఏ విధమైన దురలవాట్లూ లేవు. తన పనేదో తప్పితే ఇంకేమీ అక్కర్లేదతనికి. అతను చెప్పినట్లు తమకు రెండొందలయాభై చాలు. కానీ అలా గని సరిపెట్టుకోవలసిందేనా?

"ఒరేయ్ అబ్బీ. నీకుద్యోగం రావడం నాకు చాలా సంతోషంగా ఉందిరా. నీ జీవితం స్థిరపడ్డట్లే లెక్క. ఇంక నేనేమైపోయినా ఫరవాలేదు..." అన్నాడు నరసింహులు.

"బాగుంది నాన్నా. నువ్వేదైనా అయిపోవడమెందుకు?"

కొడుకువంక చూసి అప్యాయంగా నవ్వాడు నరసింహులు "ఇంత కాలం నేను బ్రతికున్నదెందుకురా నిన్నో దారిలో పెట్టాలనే! నీకోదారి ఏర్పడగానే నా బ్రతుక్కర్థమేముంది? నిన్నింకా గొప్పవాణ్ణి చేస్తేనే అది సార్థకమాతుంది. ఆ ప్రయత్నంలో నేనేమైనా ఫరవా

లేదంటున్నాను..."

"నాకింకే ఆశలూ లేవు నాన్నా. ఇంతకాలం నువ్వు కష్టపడ్డావు. ఇకముందు కష్టపడ్డానికి వీల్లేదు. నిన్ను పువ్వుల్లో పెట్టి పూజించుకుంటా నాన్నా. నీలాంటి తండ్రి దొరకడం నా అదృష్టం" అన్నాడు శ్రీనాథ్.

భారంగా నిట్టూర్చాడు నరసింహులు — "నిజమే నేమోరా, నీకోసం నేను అందర్నీ పోగొట్టుకున్నాను. అన్నీ వదులుకున్నాను. అదంతా నిన్ను గాలికి వదిలేయడం కోసం చేసినది కాదుగదా, నీ భవిష్యత్తును తీర్చిదిద్దడానికే..."

శ్రీనాథ్ కళ్ళలో తనకు గుర్తున్న గతం మెదిలింది. అప్పుడు తనకు పదేళ్ళు. ఒకరాత్రివేళ తండ్రి హడావుడిగా కంగారుగా ఇంటికివచ్చి తలుపుతట్టాడు. అమ్మ హడావుడిగా వచ్చి తలుపు తీసింది.

"అబ్బి ఎక్కడ?" అన్నాడాయన.

అప్పటికే తనకు మెలకువ వచ్చింది. "నువ్వింట్లో నే ఉండు. తలుపులన్నీ వేసేసుకో. ఎవరు తలుపు తట్టినా ఎంత గట్టిగా మోదినా తలుపు తీయకు. రేపుదయం బయల్దేరి సామర్లకోటకు టికెట్ కొనుక్కుని రాజమండ్రీలో నే దిగిపో. నేనువచ్చి నిన్ను స్టేషన్ దగ్గర కలుసుకుంటాను. ప్రస్తుతం నేనూ అబ్బిగాడూ దొడ్డిగుమ్మాన వెళ్ళిపోతాం మళ్ళీ దొడ్డితలుపు వేసేసుకో" అన్న ఆయన మాటలు విన్నాడు.

ఆరాత్రికి రాత్రి ఇద్దరూ బయల్దేరి రాజమండ్రీ చేరుకున్నారు. స్టేషన్ కెదురుగావున్న లాడ్జిలో బసచేశారు. మర్నాడు తండ్రి రోజల్లా స్టేషన్‌లో గడిపి వచ్చాడు. అలా రెండ్రోజులు చేశాడు. ఆ తర్వాత తను బయల్దేరి

బెజవాడ వెళ్ళివచ్చాడు. రావడం ఒక్కడే వచ్చాడు.

అమ్మేది నాన్నా—అనడిగితే చచ్చిపోయిందన్నాడు. తనేడిస్తే ఓదార్చాడు. బెజవాడనుంచి నాన్న తనకు సంబంధించిన స్కూలు సర్టిఫికేట్లన్నీ తెచ్చాడు. తనని రాజమండ్రిలో చేర్పించాడు. ఈపదేళ్ళూ అహోరాత్రులు శ్రమించాడాయన—తన కోసం.

మొదట్లో తనకు అమ్మగురించి బెంగగా ఉండేది కానీ ఆరోజు రాత్రి ఏంజరిగిందో-తండ్రి ఉన్నపళంగా బెజవాడ ఎందుకు వదిలిపెట్టాడో-తన తల్లి ఎందుకు చచ్చిపోయిందో ఇంతవరకూ తనకు తెలియలేదు.

బెజవాడలో నాన్న కాస్త పేరున్న వడ్రంగి. ఆయనకు సంపాదన బాగానే ఉండేదక్కడ. అటువంటప్పుడు ఆ ఊరెందుకు వదలాల్సొచ్చిందో తెలియక పోవడం ఒక ఆశ్చర్యమైతే ఇక్కడికి వచ్చేక ఆయన తనకు తెలిసిన వడ్రంగం, గృహనిర్మాణం వగైరాపనుల జోలికిపోక కేవలం కాయకష్టంచేసి ఎందుకు జీవించాడో కూడా—తనకు అర్థంకాని విశేషం!

“అవును నాన్నా నువ్వనుకున్నది సాధించావు. ఇంక విశ్రాంతి తీసుకో...”

నరసింహులు నవ్వి “నీవు బెజవాడలోనే ఉద్యోగం రావాలనెందుకు ప్రయత్నించానో నీవు తెలియదురా... నేను సాధించాల్సిందింకా చాలావుంది” అన్నాడు.

శ్రీనాధ్ ఆశ్చర్యంగా తండ్రివంక చూశాడు.

## 2

అది రెండంతస్తుల మేడ. మరీకొత్తది కాకపోయినా అది చూడ్డానికి విశిష్టమైనది గానేవుండి ఆ ప్రాంతాల

విలక్షణంగా కనబడుతుంది. ఆ మేడ సోమయాజులుగారిది!

ఆ మేడముందు ఒక జ్యోతిష్కుడు కూర్చునివున్నాడు. అతను తన ప్రత్యేక వేషధారణతో చూపరులను బాగా ఆకర్షిస్తున్నాడు. అతను చేతులుచూసి భూతభవిష్యద్వర్తమానాల గురించి చకచకా చెప్తున్నాడు. ఆ విద్యలో బాగా ప్రావీణ్యమున్నట్లు కనిపిస్తున్న అతని ముందు అప్పుడే ఒక యువకుడు ఆగాడు. అతను శ్రీనాథ్.

"ధన్యవాదాలు స్వామీ - మీరు చెప్పినట్లే నాకు ఉద్యోగం వచ్చింది..." అంటూ పదిరూపాయలనోటును జ్యోతిష్కుడి కందించాడతను. జ్యోతిష్కుడేవో అస్పష్టంగా అతన్నాశీర్వదించి-ఆ పదిరూపాయలూ అందుకొని రొంటిన దోపుకున్నాడు. ఆ తర్వాత, "చూడు-నీకు వచ్చిన జీతాన్నిలాగే విచ్చలవిడిగా ఖర్చు చేసేస్తున్నావా?" అన్నాడు.

"లేదు స్వామీ, మా నాన్న నాకు నెల ఖర్చులకని యాభై రూపాయలిచ్చాడు. ఏవరేజ్ చూసుకుంటే రోజుకు రూపాయికూడా ఖర్చుకాదు నాకు. అందులోనే మీకు పదిరూపాయలిచ్చాను. ఇది నేను నా సంతోషం కొద్దీ మీకిస్తున్నది..." అన్నాడు శ్రీనాథ్.

"చాలా అమాయకుడిలాగున్నావ్. ఎలాగడుపుతావో ఏమిటో రోజులు. ఏదీ నీ చెయ్యోసారి ఇలా పారేయ్" అన్నాడు జ్యోతిష్కుడు. శ్రీనాథ్ అతనికి చేయి అందించాడు. అతని చేయిని పరిశీలిస్తున్న జ్యోతిష్కుడి ముఖం గంభీరంగా మారిపోయింది. "త్వరలో నువ్వు లక్షాధికారివి కాబోతున్నావు. కానీ నీ తండ్రికి మాత్రం ఏవో

గండాలున్నట్లు తోస్తుంది......"

శ్రీనాథ్ కంగారుగా, "ఆ గండాలకూ, నేను లక్షాధికారిని కావడానికీ సంబంధముందా స్వామీ" అన్నాడు.

"ఉంది!"

"అయితే నాకు లక్షలు వద్దు. వద్దు స్వామీ" అన్నాడు శ్రీనాథ్.

"వెర్రివాడా. అవి నువ్వూ నేనూ గీసిన రేఖలు కావు. కాస్త జాగ్రత్తగా వుండమని మీ నాన్నను హెచ్చరించు. అంతే చాలు." అన్నాడు జ్యోతిష్కుడు. శ్రీనాథ్ అక్కణ్నించి లేచి వెళ్ళిపోయాడు.

అక్కడ చుట్టూ మూగినవారిలో నలుగురైదుగురు నిరుద్యోగులు గబగబా చేతులు చాపి, "మా ఉద్యోగమెప్పుడొస్తుందో చూడండి స్వామీ" అన్నారు.

జ్యోతిష్కుడు గబగబా వారి చేతులు చూసి జాతకాలు చెప్పాడు. మరో పావుగంటయ్యేసరికి జ్యోతిష్కుడి దగ్గర జనం లేరు. ఇంకో రెండు నిముషాల్లో కాబోలు కారొకటి మేడలోంచి బయటకు వచ్చింది. జ్యోతిష్కుడు చటుక్కున లేచి నిలబడ్డాడు.

కార్లోంచే పలకరించాడు సోమయాజులు. "ఏమయ్యా పంతులూ, మా ఇంటిముందునించి మకాం మార్చవా?"

"లక్ష్మి చెఱ విడిపించమని అడుగుతోంది బాబూ. మీరేమో నవ్వి ఊరుకుంటారు. లక్ష్మీదేవికి చెఱ విడిపించే వరకూ నా మకాం ఇక్కడే" అన్నాడు జ్యోతిష్కుడు.

"సరే- జ్యోతిష్కుడివి కదా. లక్ష్మికి చెర ఎప్పుడు వదుల్తుందో నీకు తెలియదా?"

"ఎందుకు తెలియదు బాబూ! తెలిసినా ఏదో భ్రమ!"

"అయితే ఎప్పుడు విడుతుందంటావ్ - చెర..."

"టైము వచ్చేసింది బాబూ. ఇంకెవ్వరూ ఆపలేరు."

"సరే మంచిది. అమ్మగారు నిన్ను పిలుస్తున్నారు. లోపలకు వెళ్ళు..."

జ్యోతిష్కుడి ముఖంలో ఆశ్చర్యం కనిపించింది. "నిజంగానే టైము వచ్చేసిందన్న మాట" అన్నాడు అప్రయత్నంగా.

సోమయాజులుగారి కారు వెళ్ళిపోయింది.

జ్యోతిష్కుడు మాత్రం తడబడుతున్న అడుగులతో లోపలకు వెళ్ళాడు. బయటనుంచీ చూడడమే కానీ ఈ మధ్య కాలంలో అతనెన్నడూ ఆ భవనంలో అడుగు పెట్టలేదు.

అతనడుగుపెట్టిన హాలు అందచందాలు గమనిస్తూండగా "వచ్చేరా పంతులుగారూ" అన్న మాట వినపడింది. అతను చటుక్కున అటు తిరిగాడు.

ఆవిడ ముఖం అతనికి పరిచితమైనదే! తరుచుగా తన్ని చూస్తూనే వుంటుంది. ఇంతవరకూ నవ్వడం తప్పిదే ఎప్పుడూ పలకరించి ఎరుగదు.

"వచ్చేనమ్మా - మహాలక్ష్మి శోభమీది. అందుకే చెరలో ఉన్న లక్ష్మిని నిర్లక్ష్యం చెయ్యగలిగారు..." అన్నాడు జ్యోతిష్కుడు.

"నిజంగా మా ఇంట్లో లక్ష్మి వుందంటారా? ఉంటే ఏ రూపంలో?" అందావిడ.

"బంగారు అచ్చుల రూపంలో. లక్షలు లక్షలు విలువ చేస్తుందమ్మా" అన్నాడు జ్యోతిష్కుడు.

"అయితే ఈ రోజే చూపించాలి మీరు" అందావిడ.

"అదంత సులభం కాదు. కనీసం ఒక రోజు గడువు కావాలి. ఈలోగా నేను అంజనం వేయాలి. అంజనంలో లక్ష్మిని చూడాలి" అన్నాడు జ్యోతిష్కుడు.

"అదంతా కుదరదు. ఈ రోజే ఎలాగో అలా లక్ష్మిని చూపాలి మీరు. ఎందుకంటే ఇంట్లో ఉన్న లక్ష్మి రేపటిదాకా ఆగేలా లేదు..." అందావిడ.

"అదేం ఏమయింది?" జ్యోతిష్కుడు ఆశ్చర్యంగా అడిగాడు.

"బెదిరింపు ఉత్తరం ఒకటి వచ్చింది. మా ఆయన దాన్నే మాత్రమూ లక్ష్యపెట్టడంలేదు. మాఇంట్లో పాతిక లక్షలు విలువచేసే బంగారపుటచ్చులున్నాయట. అవి తనకు స్వాధీనం చేయకపోతే ఈ ఇంటినీ మమ్మల్నికూడా నాశనం చేస్తామని ఎవడో ఆకాశరామన్న ఉత్తరం రాశాడు. ఆయన అది చూసి నవ్వి, వాణ్ని రానీయ్ చూద్దాం అన్నారు..." అందావిడ.

జ్యోతిష్కుడి ముఖం మాత్రం గంభీరంగా అయిపోయింది. "మీరేం భయపడకండమ్మా. మీ ఇంట్లోని లక్ష్మినింకెవ్వరూ కదపలేరు. ఈ వేళ అంజనం వేసి చూసి రేపు చెబుతాను..." అన్నాడు.

ఆవిడ ముఖం మాత్రం దిగులుగానే వుంది.

"అన్ని తతంగాలకూ ఒక నూర్రూపాయలు ఖర్చంటుంది..." అన్నాడు జ్యోతిష్కుడు.

"చూడండి పంతులుగారూ. మా ఇంట్లో డబ్బుందని మీకు తెలిసినప్పుడు ఎప్పుడైనా రహస్యంగా వచ్చి ఎత్తుకుపోవచ్చుగా..." అందావిడ.

జ్యోతిష్కుడు ముక్కుమీద వేలేసుకుని, "మీ

ఆహ్వానంమీదనే మీ ఇంటికొస్తాను. మీరడిగిన మీద టనే ధనం చూపిస్తాను, మీరిచ్చిన దానం స్వీకరిస్తాను. ఆ తర్వాత నా వృత్తికి స్వస్తి చెబుతాను'' అన్నాడు.

సోమయాజులుగారి భార్య జ్యోతిష్కుడితో కాసేపు బేరాలు పెట్టింది. అతను దిగిరాలేదు. తనకు పదిలక్షలు దానమిచ్చితీరాలని చెప్పాడు.

చిట్టచివరకు జ్యోతిష్కుడిమాటల కంగీకరించింది సోమయాజులుగారి భార్య. కానీ ఆవిడ నవ్వుతూ, "ఒక వేళ చివరి క్షణంలో మేము మిమ్మల్ని మోసంచేస్తే'' అంది.

జ్యోతిష్కుడు నవ్వలేదు. "అన్ని ఏర్పాట్లూ చేసుకుని వస్తాను. మీరు నా షరతులంగీకరించిన పక్షంలో రేపటికి కొన్ని పనులు చేయాలి. ముందుగా మీ ఇంట్లో ఉన్న నగలూ, ఇతర విలువైన ఆభరణాలూ బ్యాంకులో లాకర్లో దాచేయాలి. రేపు మధ్యాహ్నం పన్నెండింటికల్లా ఆ పని పూర్తిచేసుకుని వచ్చే మాటయితే మిగతా పని నేను చూస్తాను...''

"అన్నీ లాకర్లో దాచడమెందుకు?''

"రేపు మీకు కాసేపు స్పృహ వుండదు. ఆ సమయంలో మీ ఇల్లు దోచుకుపోగలనన్న అనుమానం మీకుండవచ్చు...'' అన్నాడు జ్యోతిష్కుడు.

"వాటం చూస్తే మీరు నిజంగా పాతిక లక్షలు చూపించేలాగున్నారే?''అంది సోమయాజులుగారి భార్య.

"అవును. అందులో పదిహేను మీవి. పది నావి...'' అన్నాడు జ్యోతిష్కుడు.

# 3

"శాంతా" సోమయాజులుగారు భార్యని పిలిచాడు.

శాంతాదేవి పరుగెత్తుకుంటూ వచ్చింది "ఏమన్నాడు నీ జ్యోతిష్కుడు?" కాస్త ఆత్రుతగానే అడిగారాయన.

ఆవిడ ఒక్క నిముషం ఆగి ఊపిరిపీల్చుకుని, "మధ్య మీకెందుకీ గొడవలు?" అంది.

"మళ్ళీ టెలిఫోన్ వచ్చిందినాకు..." అన్నాడు సోమయాజులు.

"ఏమని?"

"ఈ రాత్రికే పాతికలక్షలూ ఇచ్చుకోవాలట లేకపోతే సర్వనాశనం చేస్తారుట..."

"మీరేమన్నారు?"

"నాకేం తెలియదు పొమ్మన్నాను..."

"అలాగంటే ఎలాగండీ..." అంది శాంతాదేవి భయంగా.

"చేయగలిగినదేముంది? మన ఆస్తింతా కలిపి అయిదు లక్షలు చేయదు. పదేళ్ళక్రితం లక్షరూపాయలకు చవగ్గా వచ్చిందికదా అని ఈ భవంతి కొన్నాను తప్పితే ఇంత భవనం మెయింటైన్ చేసే తాహతుకూడా నాకు లేదు... ఇప్పుడున్నపళంగా ఈ ఇంట్లో పాతికలక్షలున్నాయ్ అవితెచ్చి ఇమ్మంటే నేనేం చేసేది? ఎక్కణ్ణించి తెచ్చేది?"

"అవుననుకోండి. కానీ అవతలవాడూరికే అడగడు కదా."

"అందుకే నాకేమీ తెలియదు. కావాలంటే మా ఇంటికి రా. డబ్బెక్కడుందో చూపించు. అంతా పట్టుకు

పో. అన్నాను..." అన్నాడు సోమయాజులు.

"అంటే వాడేమన్నాడు?"

"ఏమీ అనలేదు. నవ్వాడు. చాలా గట్టిగా అదోలా నవ్వాడు" అన్నాడు సోమయాజులు.

"ఆ తర్వాత..."

"ఫోన్ పెట్టేశాడు..." సోమయాజులు నవ్వేశాడు.

"ఓ మూల నేను హడలి చస్తుంటే మీకు నవ్వొలాగొస్తోందండీ." అంది శాంతాదేవి చిరాగ్గా.

"చెబుతాన్లేగానీ, నీ జ్యోతిష్కుడి సంగతి చెప్పు."

వివరంగా చెప్పింది శాంతాదేవి. సోమయాజులుగారి ముఖం గంభీరంగా అయిపోయింది. "నాకేదో అనుమానంగా ఉంది. ఇది నవ్వవలసిన విషయంకాదు" అన్నాడాయన.

"అది నేనెప్పుడో చెప్పాను."

"నువ్వు చెప్పడానికేంలేగానీ జ్యోతిష్కుడి గురించి నాకు చాలా అనుమానాలున్నాయి" అన్నాడు సోమయాజులు. "అతనికి మనింట్లో బంగారముందని ఎన్నాళ్ళనించి తెలుసు? కనీసం రెండు నెలలుగా అతను నాతో ఈ మాట అంటున్నాడు. దాన్ని బట్టి రెండునెలలనించే ఈ విషయమతనికి తెలుసునా అనుకుందామా అంటే అంతకు ఒకటి రెండు నెలలముందే మనింటిదగ్గర మకాం పెట్టాడు. బంగారం గురించి తెలిసే అతనిక్కడ మకాం పెట్టాడా? బంగారంగురించి అతనికెలా తెలిసింది? అసలు మనింట్లోకి బంగారం ఎందుకు, ఎలావచ్చింది? జ్యోతిష్కుడికీ వివరాలన్నీ తెలిసిన పక్షంలో మనకు తెలియకుండా దాన్ని తరలించుకు పోవచ్చుగదా..."

"ఈ సందేహాలు నాకూ వచ్చాయండీ. కానీ జ్యోతిష్కుడి మాటలు మీకు చెప్పాను గా. నా మటుక్కు నాకు అతను నమ్మదగ్గ వ్యక్తి అనే తోస్తోంది. అతను నిజంగానే జ్యోతిష్కుడు. అతనికి కొన్ని మానవాతీత శక్తులుండి ఉండాలి. వాటి సాయంతో అతను మనింట్లోని బంగారాన్ని కనుగొని వుంటాడు. మనకిష్టముంటే నే దాన్ని చూపించ దలిచాడు. లేకపోతే..."

"అదలాగుంచు. అందుకు పదిలక్షలు ప్రతిఫలం కోరుతున్నాడతను. అతని మాటలను బట్టి చూస్తూంటే డబ్బు విషయంలో బాగా నమ్మకంగా ఉన్నాడతను. ఇందులో ఏదైనా మోసముండి వుండాలి. లేదా జ్యోతిష్కుడు నిజం చెబుతున్నాడనుకోవాలి..." అన్నాడు సోమయాజులు.

"ఇప్పుడేం చేయాలో చెప్పండి."

"చేయడానికేముంది? మన జాగ్రత్తలో మన ముండాలి..."

శాంతాదేవి భర్తవంక ప్రశ్నార్థకంగా చూసింది.

"గంగులుకి చెబుతాను గుమ్మంకద్ద కాపలా కాయమని."

శాంతాదేవికి గంగులు తెలుసును. అతను సోమయాజులుకు నమ్మిన బంటు. బలంలోనూ, ఆకారంలోనూ ఏనుగు.

## 4

"అబ్బీ—"

"ఏం నాన్నా!"

"ఉద్యోగమెలాగుంది రా?"

"ఉద్యోగానికేం? రాజాలాగుంది."

"ఎలా ఉన్నా అది నువ్వింకెన్నాళ్ళో చేయనక్కర్లేదురా అబ్బీ!"

"ఏం నాన్నా?"

"మనం లక్షాధికార్లమైపోతున్నాం. ఎటొచ్చీ అందుకు నీ సహాకారం కావాలి..."

"ఏమిటిది నాన్నా" అన్నాడాశ్చర్యంగా శ్రీనాథ్. తన సహాకారంతో తాము లక్షాధికార్లమైపోతామంటే అతనికాశ్చర్యంగా ఉంది.

"చెబుతాను కానీ దానికిముందు నేను నీకో కథ చెప్పాలి" అన్నాడు నరసింహులు. అతని కళ్ళముందు ఆ కథ మెదుల్తున్నట్లుంది. కళ్ళు ఏవో దృశ్యాలను చూస్తున్నట్లుగా ఉన్నాయి. శ్రీనాథ్ చెప్పమన్నట్లుగా తండ్రి వంక చూశాడు. కానీ ఆయన కొడుకును చూడలేదు. ఆయన పెదవులు మాత్రం కదిలాయి.

"పదేళ్ళ క్రితం కథ ఇది..." నరసింహులు మొదలు పెట్టాడు. "ఈ ఊళ్ళో అప్పుడు నేను పచ్చగానే బ్రతుకుతున్నాను. చాలామంది ఇళ్ళలో నేను చేసిన ఫర్నిచర్ వుండేది. అప్పుడే నాకు సత్యంబాబుగారితో పరిచయమైంది. రహస్యపుటరతో ఒక టేబిల్ చేయమన్నాడాయన. నేను చేశాను. నా పనితనానికాయన ఆశ్చర్యపోయాడు. ఆయన అదేపనిగా నన్ను పొగుడుతూంటే నేను తేలిగ్గా తీసిపారేసి, అవకాశం రావాలి గానీ ఇంతకంటె గొప్పగా చేయగలను నేనని చెప్పాను. ఆయన కళ్ళు మెరిశాయి.

"అయితే నాకో పెద్దపని చేయాలి. చేస్తావా?" అన్నాడాయన.

"ఏ పనైనా చేస్తాను కానీ బాగా డబ్బు కావాలి" అన్నాను.

"ఎంత కావాలేంటి?" అన్నాడాయన.

"ముందు పని చెప్పండి" అన్నాను.

ఆయన అప్పుడొక భవనం నిర్మిస్తున్నాడు. అదించుమించు పూర్తి కావచ్చింది. అది రెండంతస్తుల మేడ. రెండో అంతస్తులో వరుసగా మూడు గదులున్నాయి. వాటిలో నేను రహస్యపుటరలు ఏర్పాటు చేయాలి.

సరేనన్నాను నేను.

"ఇది చాలా రహస్యం. నువ్వెవరివో ప్రపంచానికి తెలియకూడదు. ఆ ఇంటికి నువ్వెప్పుడూ మారువేషంలోనే రావాలి" అన్నాడాయన.

అలాంటివి నాకు చేతకావన్నాను.

"నువ్వేం చేయనక్కర్లేదు. అన్నీ నేను చూసుకుంటాను. నాతో పద" అన్నాడాయన.

నేనాయన కారెక్కాను. కార్లో వేషం మార్చుకునేందుకవసరమైన సామగ్రి వుంది. నున్నని క్రాపింగు పోయి గుండు, పిలక ఏర్పడింది నాకు. ముఖానికి మీసాలు. వేషం మార్చుకోవడం అంత సులభమని నేనెన్నడూ అనుకోలేదు.

ఇద్దరం కలిసి ఆయన భవనానికి వెళ్ళాం. ఆయన చెప్పిన గదులు చూడూ "బాగా పరీక్షగా చూసేక, మరో పదిరోజుల్లో ఇల్లు కట్టడం పూర్తయిపోతుందనుకుంటాను. అప్పుడే నా పని మొదలుపెడతాను. అన్నీ నేనే స్వయంగా పూర్తి చేస్తాను. కొన్ని అరలు గోడల్లోనూ కొన్ని అరలు నేలమీదా ఏర్పాటు

చేస్తాను. బ్రహ్మరుద్రుడికి కూడా వాటిని కనుగొనడం సాధ్యంకాదు. ఆ విధంగా నేను వాటిని తయారు చేస్తాను. మీరుమాత్రం నా గురించి సిమెంటూ వగైరా అవసర వస్తువులు ఏర్పాటు చేయించండి..." అన్నాను.

సత్యంబాబుగారి ముఖంలో ఆనందం స్పష్టంగా చూసేను. ఆయన భవననిర్మాణం పూర్తయి, బయట అలంకరణ జరుగుతున్న సమయంలో నేను పని మొదలు పెట్టాను.

"ఎంత?" అనడిగాడాయన పని మొదలుపెట్టే ముందు.

"అడ్వాన్సు పదివేలు. నా పని మీకు నచ్చితే ఇంకో పదిహేనువేలివ్వాలి. నచ్చకపోతే పదివేలు చాలు..." అన్నాను.

ఆయన అంగీకారసూచకంగా తలూపి, అడ్వాన్సుగా పదివేలిచ్చేశాడు. నాకు చాలా సంతోషం కలిగింది. ఇది నేనూహించని సంపాదన.

అయితే నేను స్వీకరించిన పని నాకే ఓ సవాల్‌గా భావించాను. అంత డబ్బునాయన ఖర్చుపెట్టదల్చుకొన్నప్పుడు ఆయనకు సంతృప్తి కలిగించడం నా విధి. డబ్బు ఎగవేడానికూడా ఆయన నా పనిని తప్పుపట్టలేని విధంగా ఉండాలి. అందుకే మొత్తం వారంరోజుల పాటు రాత్రీ పగలూ శ్రమించి మూడు గదుల్లోనూ, మొత్తం ఇరవైఏడు రహస్యపుటరల్ని తయారుచేశాను.

అందులో ఒక తమాషా చేశాను. గది నేలకీ, గోడలకీకూడా పూర్తిగా తాళంచెవి పట్టే కీ హోల్ డిజైన్

ఉంచాను. అంటే గది గోడల్నిగానీ నేలనుగానీ చూస్తూంటే కొన్ని వందల కీ హోల్స్ కనబడతాయన్న మాట. కానీ అన్నీ డిజైన్స్ కావు. ప్రతిగదిలోనూ తొమ్మిది కీ హోల్స్. రహస్యపుటరలకు కీ హోల్స్. వాటిని గుర్తుపట్టడానికి కొన్ని వివరాలున్నాయి.

ఆ వివరాలనుబట్టి కరెక్ట్ కీ హోల్స్‌ను ఐడెంటిఫై చేయవచ్చు. వాటిని మూసి వేస్తూ ఇనుపముక్కలుంటాయి. అయస్కాంతం సహాయంతో ఆ ఇనుపముక్కను తీసి వేసి వాటికోసం ప్రత్యేకం తయారుచేయబడ్డ స్టెయిన్‌లెస్ స్టీలు తాళం చెవులతో ఆ అరలను తెరువవచ్చు. ఒక్కొక్క గదికి ఒక్కొక్క తాళం చొప్పున మొత్తం మూడు తాళాలు తయారుచేశాను నేను.

సత్యంబాబు వచ్చి గదిలోని ఏర్పాటు చూసి దంగై పోయాడు. ఇలాంటి పనితనం అద్భుతం అన్నాడాయన. మర్నాడు నాకు పదిహేను వేలు కాక పాతిక వేలిస్తానని చెప్పాడు. నేను చాలా సంబరపడ్డాను. నా జీవితంలో నే ఒక పెద్ద మలుపు వస్తోందనుకున్నాను. అది నేను వేస్తున్నలాంటి మలుపు కాదని అప్పట్లో నాకు తెలియదు.

ఆ ఇంట్లో గృహప్రవేశ మహోత్సవం జరగడానికి రెండ్రోజులుందన్న రోజు రాత్రి పదకొండు గంటలకు నేనూ, సత్యంబాబూ ఆ భవంతికి వెళ్ళాం.

అప్పుడే సత్యంబాబు నా కళ్ళు చెదిరిపోయే నిధి చూపించాడు. అది ప్యాకేజీ సెట్లలో ఉన్న బంగారు అచ్చులు. ఒక్కొక్కటి కేజీకి తక్కువకాకుండా వున్న ఆ అచ్చులు మొత్తం యాభైకి పైగా వున్నాయి.

"ఇంత బంగారమా! ఎలా వచ్చింది?" అన్నాను ఆశ్చర్యంగా.

"అదంతా నీ కనవసరం. ఇది దాచడానికే నిన్ను రహస్యపుటరలు చేయమన్నాను" అన్నాడు సత్యం బాబు.

"రహస్యంగా మీరే దాచలేకపోయారా? మధ్య నన్నెందుకు పిలిచారు?"

సత్యంబాబు నవ్వాడు. "ఈ అరల రహస్యం నీకూ నాకూ తప్ప మరెవ్వరికీ తెలియకూడదు. అందుకే ఈ బంగారం దాచడానికి నీ సహాయం తీసుకుంటున్నాను. ఇద్దరు మనుషులుంటే పని త్వరగా అయిపోతుంది. సులువుగా కూడా ఉంటుంది..."

నేకాయనకు సహాయం చేశాను. అన్నీ మధ్యగదిలోని తొమ్మిది అరల్లోనూ సర్దేశాం. సర్దడం పూర్తయ్యేక మళ్ళీ అరలు మూసేసి కీ హోల్స్‌లో ఇనుపముక్కలు పెట్టేశాం. సత్యంబాబు గదంతా కలియదిరిగి "అద్భుతం!" అన్నాడు.

ఆయన మాటెందుకు. ఆ గదిలో అప్పటి పరిస్థితిలో-ఆ పనితనం నాదేనా అని నాకే ఆశ్చర్యం వేసింది. నేను సత్యంబాబువంక చూసి ఆశ్చర్యపోయాను.

ఆయన చేతిలో రివాల్వర్ ఉంది.

"ఈ రహస్యం మనిద్దరికే తెలుసును. నీ భార్యకు నేను అన్నమాట తప్పకుండా పాతిక వేలూ అందజేస్తాను. నువ్వు నాకు చేసిన మేలు నేను మరవలేను. కానీ నా వృత్తి అలాంటిది. నిన్ను చంపక తప్పదు..." అన్నాడు సత్యంబాబు.

ఊహించని పరిణామానికి దెబ్బతిన్నాను. "ఇది చాలా అన్యాయం బాబూ" అన్నాను.

"నాకు తెలుసు. కానీ అన్యాయాలు చేయడం నాకు తప్పడం లేదు. నేను కట్టించిన ఈ భవంతి నా అన్యాయాల కారణంగానే వెలసింది. ఇంత బంగారం అన్యాయంగా చేజిక్కించుకున్నాను. ఈ రహస్యాన్ని దాచడానికింకో అన్యాయం అవసరం" అన్నాడు సత్యంబాబు.

నాబుర్ర వేగంగా పనిచేసింది. మరికాసేపు ఆయన్ను కబుర్లలో పెట్టాను. తిరగబడే తెలివితేటలు నాకున్నవని ఆయనూహించలేదు.

మెరుపులా ఆయనపై దాడిచేశాను. ఆయన చేతిలోని రివాల్వర్ నా చేతిలోకి వచ్చింది. ఇంక నేను క్షణం కూడా ఆలోచించలేదు. ఆ దుర్మార్గుణ్ని బ్రతకనివ్వడం చాలా ప్రమాదమనిపించింది. అప్పటికప్పుడు కాల్చేశాను. ఆయన చచ్చిపోగానే నాలో వణుకు ప్రారంభమైంది.

రివాల్వర్‌ను, తాళంచెవులను జేబులో వేసుకుని మారువేషంలోనే అక్కణ్నించి బయటపడ్డాను. ఇంటిముందు ఓ టాక్సీ సిద్ధంగా వుంది. టాక్సీ ఎక్కి ఇల్లుచేరాను.

నేను టాక్సీ దిగేముందు నాకు టాక్సీవాలా చావు కబురు చెప్పాడు చల్లగా. "సార్ ఆ భవనంలోంచి ఎవరో వచ్చి టాక్సీ అడుగుతారనీ, అడిగిన వ్యక్తిని అడిగిన చోట దింపి, తర్వాత తనకు సమాచారం చెప్పమనీ, ఒకాయన నన్ను కోరాడు. మీరు పారిపోగలిగితే ఈ లోగా ఎక్కడైనా పారిపోండి. మానవత్వం గలవాడిగా ఈ సహాయం నేను మీకు చేస్తున్నాను."

నేనాశ్చర్యపడి, "ఏమీ తెలియదని బుకాయించలేవా?" అన్నాను.

"మరొకరూ, మీరొకరూ అయితే సరిపోతుంది.

నన్నడిగినదెవరనుకున్నారు! పీటర్!'' అన్నాడు.

నా గుండెలదిరాయి. పీటర్ ఆడుళ్ళో రౌడీలకు. రౌడీ అతని పేరు చెబితే పోలీసులే భయపడతారు. ఏమాత్రం తప్పేడు సమాచారాన్నందించినా టాక్సీ డ్రైవర్‌కి ప్రాణాలు దక్కవు.

నేను టాక్సీడ్రైవర్‌కి ధన్యవాదాలు చెప్పాలని తలుపు తట్టాను. మీ అమ్మ తలుపు తీసేలోగా వేషం మార్చేసుకున్నాను. మీ అమ్మకు వివరాలన్నీ చెప్పకుండా ముందు నిన్ను రక్షించాలనుకున్నాను. అందుకే రాత్రికి రాత్రి నిన్ను తీసుకుని మకాం మార్చేశాను. మీ అమ్మనికూడా రాజమండ్రీ రమ్మనమని చెప్పాను కానీ ఆమె రాలేదు.

ఒకటి రెండు రోజులు చూసి వేషం మార్చుకుని బెజవాడ వెళ్ళి వచ్చాను. ఇంట్లో మీ అమ్మ లేదు. మనింటికి పీటర్ వచ్చాడనీ అమ్మను తీసుకువెళ్ళాడనీ తెలిసింది. ఆ తర్వాత ఇంతవరకూ మీ అమ్మ జాడ తెలియలేదు...''

నరసింహులు ఆగిపోయాడు. శ్రీనాథ్ కళ్ళలోని ఆశ్చర్యం చూసి ఆయనకు నవ్వొచ్చింది.

''నాన్నా!'' అన్నాడు శ్రీనాథ్. ''అయితే నువ్వో పెద్ద నేరస్థుడివన్నమాట...''

''కనీసం పోలీసుల దృష్టిలో కాదు'' అని నవ్వాడు నరసింహులు. ''సత్యంబాబుగారి హత్యగురించి ఎక్కడా ఎటువంటి వార్తా రాలేదు. ఆయన మాయమైనట్లు ఆయన కొడుకు ఫిర్యాదిచ్చాడట. పోలీసులింతవరకూ ఆయన జాడ కనుక్కోలేకపోయారు. ఆ మేడ తమకు అచ్చిరాలేదని భావించి, సత్యంబాబుగారబ్బాయి దాన్ని చవగ్గా అమ్మేస్తే సోమయాజులుగారది కొనుక్కున్నారు. ఆ

ఇంట్లో బంగారం గురించి నాకు తప్ప మరెవ్వరికీ తెలియదు..."

శ్రీనాథ్ తండ్రివంక ఆశ్చర్యంగాచూసి, "తెలిసి ఏం లాభం నాన్నా?" అన్నాడు.

"ఉంది. ఓ ఇరవై అచ్చులు మనం తెచ్చుకోబోతున్నాం" అన్నాడు నరసింహులు.

"ఎలా?"

"ఇలా!" అంటూ నరసింహులు కొడుకు చెవిలో ఏమిటో చెప్పాడు. శ్రీనాథ్ అంతా శ్రద్ధగా విన్నాడు.

"వింటూంటే సులభంగానే ఉంది కానీ నాకెక్కువ్వ భయం వేస్తోంది. అన్నీ అనుకున్నట్లుగా జరుగుతాయంటావా?"

"అంతా నీకెందుకూ. నేను చెప్పినట్లు చెయ్..." అన్నాడు నరసింహులు.

"అలాగే చేస్తాను. కానీ ఆ పీటర్ ఎవడు? వాడు మనింటికెందుకు వెళ్ళాడు? అమ్మని ఏం చేశాడు? భవనంలో ఉన్న బంగారం గురించి వాడికేమీ తెలియదా?" అన్నాడు శ్రీనాథ్.

"నీ ప్రశ్నలు సరైనవే కానీ వాటికి జవాబులు మనకీ తెలియదు. ఆ పీటర్ ఎవడో వాడికి బంగారం గురించి ఎంతవరకూ తెలుసో నాకు తెలియదు కానీ, నేను మాత్రం నాకు తెలిసిన రహస్యాన్ని భద్రంగా దాచాను.

ఒక వడ్రంగి మేస్త్రీ ఆ భవనంలో ప్రత్యేకంగా పని చేసేడని ఇంకెవరికైనా తెలుసో తెలియదో కానీ ఆ వడ్రంగీ మేస్త్రీ రూపం మాత్రం వారెవ్వరూ చూడలేదు. అందుకే నేను మకాం మార్చేక వడ్రంగం చేయ

లేదు. కాయకష్టం చేసి బ్రతికాను. నన్నింకెవ్వరూ ఏ విధంగానూ అనుమానించలేని విధంగా ప్రవర్తించాను. నిన్ను గ్రాడ్యుయేటు చేశాను. మకాం మళ్ళీ బెజవాడకు మార్చాను.

బంగారం గురించీ, నీ ఉద్యోగం గురించీ ప్రయత్నాలు మొదలుపెట్టాను. నీ బ్రతుకు పూర్తిగా ఒక దారిలో పడింది. నేను బంగారాన్నందిస్తే నీ బ్రతుకు బంగారు బాటలో నడుస్తుంది. లేదూ, నీకొచ్చిన నష్టమేమీ లేదు. ఇదే పని నేను కాస్త ముందుగా చేసి ఉంటే ఏమో, బంగారం దొరక్కపోతే, నా బ్రతుకు అంతమైతే, నీ చదువు ఆగిపోయేది. దాంతో నీ భవిష్యత్తేమైపోయేదో ఏమో'' అన్నాడు నరసింహులు.

''నువ్వు చాలా మంచివాడివి నాన్నా!'' అన్నాడు శ్రీనాథ్.

''నేను నిజంగా మంచివాడనైతే దేవుడు నా కన్యాయం చేయకూడదు. నేను రేపు తలపెట్టినపని జయప్రదంగా ముగుస్తుంది'' అన్నాడు నరసింహులు.

## 5

''ఏమండీ'' అంది శాంతాదేవి.

''ఏం?''

''టైము పన్నెండు కావస్తోందనుకుంటాను. మనం అన్నివిధాలా సిద్ధంగా ఉన్నట్లేనా?''

''ఆహా! నగలూ, నట్రా లాకర్ జేరాయి. క్యాషంతా బ్యాంకులో డిపాజిట్టయింది. దొంగాడు పట్టుకుపోవాలంటే ఫర్నిచరుంది. లేదా నీ మెడలో మంగసూత్రాలున్నాయి...''

"ఛా- అవేం మాటలండీ" అంది శాంతాదేవి.

"అవును మరి. ఇంట్లో ఇంకెవరున్నారు? కొడుకూ-కోడలూ హనీమూన్ వెళ్ళి పదిరోజులయింది. కూతురు పిక్నిక్ వెళ్ళి రెండ్రోజులయింది. నువ్వూ, నేనూ, పని మనిషీ, నౌకర్లూ, తోటమాలీ..." సోమయాజులేదో అనబోతూండగా...

"అది కాదండీ. ఒకవేళ మన అదృష్టం పండి పాతిక లక్షల బంగారం బయటపడితే, పదిలక్షలు ఆ జ్యోతిష్కుడికి ధారపోయాల్సిందేనంటారా?" అంది శాంతాదేవి.

"అదా నీ బాధ?" అని నవ్వాడు సోమయాజులు. "ఈ సోమయాజులు ఆడిన మాట తప్పడు. అన్న ప్రకారం పదిలక్షలూ జ్యోతిష్కుడికి సమర్పించుకుంటాడు. అయితే డబ్బుతో వాడు బయటపడగానే గంగులు వాణ్ణి వెంటాడుతాడు. మన పదిలక్షలూ మనకు చేర్చుతాడు..."

"గంగులు వచ్చేడంటారా?"

"వాడు నమ్మినబంటు. వచ్చి చాలసేపయింది. కావాలంటే నువ్వుకూడా వెళ్ళి చూడు."

"వద్దులెండి" అంది శాంతాదేవి. గంగులంటే ఆవిడ కిష్టమే కానీ అతన్ని చూడాలంటే ఆవిడకు భయం. అతను చేసిన ఘనకార్యాలు వింటూంటేనే ఒళ్ళు జలదరిస్తుందావిడకు. చాలా భాగం అవి తమకు శ్రేయోభిలాషిగానే చేసినప్పటికీ, కోడిని చంపలేనుగానీ ఎవరైనా చంపి వండితే తినగలను అనే మాంసాహారినిలా ఆవిడదీ జాలిగుండె! అందుకని సాధారణంగా ఆవిడ గంగులుని చూడదు. కానీ అతని రక్షణ ఉందని నిశ్చింతగా

తెలిసేవరకూ ఆవిడకు తృప్తిగా ఉండదు. భర్త ఆ సంగతి చెప్పాక ఆవిడకిప్పుడు తృప్తిగా ఉంది.

"సరే. మన తక్కిన నౌకర్లందర్నీ బయటకు పంపించేశాను. తోటమాలినికూడా పంపించేశాను. పనిమనిషి మాత్రం ఇంట్లోనే ఉంటుంది రహస్యంగా ఓ కంట జ్యోతిష్కుడిని కనిపెడుతూ" అన్నాడు సోమయాజులు.

"అన్నీ చెప్పారా దానికి!"_ అంది శాంతాదేవి.

"ఆహా అన్నీ చెప్పాను" అన్నాడు సోమయాజులు.

సరిగ్గా అప్పుడే గడియారం పన్నెండు గంటలు కొట్టింది. జ్యోతిష్కుడు హాల్లో అడుగుపెట్టాడు. అతను వచ్చినవైపు చూసి, "ఏమయ్యా పంతులూ వీధివైపునించి కాదా వస్తి?" అన్నాడు సోమయాజులు ఆశ్చర్యంగా.

"లేదండీ. పదిలక్షలతో వ్యవహారం. ఎలాగైనా శాస్త్ర జాగ్రత్తగా ఉండాలి. అందుకని దొడ్డివైపునించి వచ్చాను" అన్నాడు జ్యోతిష్కుడు.

"నీ జోస్యం నిజమయేలాగే కనబడుతోందయ్యా. బెదిరించినవాడు రాలేదు నిన్న!"

జ్యోతిష్కుడిముఖంలో గర్వం కనబడుతోంది. "ఎలా వస్తాడండీ రాలేడు. ఎవడికైనా విధి లిఖితం తప్పదు. మీ ఇంట్లో నిధి ఉందని తెలిసీ నేనేం చేయగలిగాను. మీరు పిలిచేవరకూ అలా ఎదురుచూస్తూ కూర్చున్నాను. వాడూ అంతే. మీ ఇంట్లో లక్ష్మీదేవికి నా ద్వారా చేర్చ తప్పాలని రాసిపెట్టి వుంది. ఆ సంపద మీ కనుభవం కావాలని వుంది. మీ ద్వారా నాకు కొంత రావాలని వుంది. మధ్య మూడోవాడేంచేయగలడండీ..."

"అన్నీ సిద్ధంగా వున్నాయి. అంజనం వేశావా! నిధి కనపడిందా?"

"అన్నీ సిద్ధమేనండీ. మీ మేడమీద మూడు వరుస గదులున్నాయి. వాటిల్లో ఒక దాంట్లో వుంది నిధి. ఏ గది అన్నది మాత్రం మనం పరిశీలించి తెలుసుకోవాల్సిందే" అన్నాడు జ్యోతిష్కుడు.

ముగ్గురూ మేడమీదకు నడిచారు. మొదటిగదిలోకి వెళ్ళేక జ్యోతిష్కుడు తన జేబులోంచి రెండు గుళికలు తీశాడు. "లక్ష్మిని సందర్శించే ముందు మీరివి వేసుకోవాలి..."

సోమయాజులు సందేహంగా భార్యవంక చూశాడు. శాంతాదేవికూడా అదే రకంగా భర్తవంక చూసింది.

"ముహూర్తం మించిపోతోంది. త్వరగా!" అన్నాడు జ్యోతిష్కుడు.

దంపతులిద్దరూ తటపటాయించకుండా గుళికను నోట్లో వేసుకున్నారు. వేసుకున్న క్షణంలోనే వారికి కళ్ళు తిరిగి నట్లయింది. మరు క్షణంలోనే ఇద్దరూ స్పృహ తప్పి కుప్పలా కూలిపోయారు.

## 6

"ఏయ్! ఇలారా" అని పిలిచాడు శ్రీనాథ్.

కాషాయ బట్టలు కట్టుకుని జ్యోతిష్కుడి వేషంలో వున్న ఒక మనిషి శ్రీనాథ్ వంక ఆశ్చర్యంగా చూసి–"నేనా ఎందుకు?" అన్నాడు.

"ఒక చిన్న పనిచేయాలి. అందుకు ప్రతిఫలంగా పాతిక రూపాయలిస్తాను నీకు" అన్నాడు శ్రీనాథ్.

"ఏమిటూ పని?"

"టాక్సీలో ఒక ఇంటికి వెళ్ళాలి. అన్నీ తెలుసున్న వాడిలా చనువుగా ఆ ఇంట్లో ప్రవేశించాలి. వాచ్‌మన్

లేడా ఇంటికి. ఇంట్లోకి ప్రవేశిస్తూనే ఒక హాల్లోకి వెడ తావు. ఆ హాల్లో టేబిల్ మీద రెండు బ్రీఫ్ కేసులుంటాయి. చాలా బరువుగా వుంటాయవి. ఒక్కొక్కటి పాతిక, ముప్ఫై కేజీలకు తక్కువ కాకుండా వుంటుంది. అవి రెండూ తీసుకుని బయటకు వచ్చి మళ్ళీ టాక్సీ ఎక్కాలి. పెద్ద మర్రిచెట్టు అని చెబితే చాలు. టాక్సీ వాడు నిన్నక్కడకు తీసుకు వెడతాడు. ఆ రెండు బ్రీఫ్ కేసులూ మర్రిచెట్టు వెనక వదిలి రావాలి..." అన్నాడు శ్రీనాథ్.

జ్యోతిష్కుడి కళ్ళు మెరిశాయి. "ఆ బ్రీఫ్ కేసుల్లో ఏముంది?"

"అది నీ కనవసరం. ఈ పని చేసినందుకు నీకు పాతిక రూపాయలు ముడతాయి. ఎక్కడా ఎవరూ నిన్నడ్డగించరు. పోలీసుల ప్రసక్తి రానేరాదు..." అన్నాడు శ్రీనాథ్.

అన్నింటికీ అంగీకరించాడు జ్యోతిష్కుడు. శ్రీనాథ్ అతన్ని తను ముందుగా చెప్పి ఉంచుకున్న టాక్సీ దగ్గరకు తీసుకువెళ్ళాడు. జ్యోతిష్కుడు టాక్సీ ఎక్కాడు.

టాక్సీ సోమయాజులు ఇంటిముందాగింది. జ్యోతిష్కుడు టాక్సీ దిగి ఇంట్లోకి వెళ్ళాడు.

సోమయాజులుగారి కెదురింటిముందు నిలబడి కాపలా కాస్తున్న గంగులులో చలనం వచ్చింది. టైము చూసుకున్నాడు. పన్నెండుంపావయింది. అంతవరకూ జ్యోతిష్కుడిలా కనబడేవాడెవడూ ఇంట్లోకి వెళ్ళలేదు. అతనికి బాగా చిరాగ్గా వుంది. అప్పటికో మనిషి టాక్సీ దిగి ఇంట్లోకి వెళ్ళాడు. వేషధారణను బట్టి అతనే సోమ

యాజులుగారు చెప్పిన జ్యోతిష్కుడయుండాలని గంగులు అనుకున్నాడు.

జ్యోతిష్కుడు హాల్లోకి వెళ్ళాడు. శ్రీనాథ్ చెప్పినట్లు గానే అతనికి రెండు బ్రీఫ్‌కేసులు కనపడ్డాయి. ఎత్తి చూశాడు. చాలా బరువుగా వున్నాయవి. రెండూ రెండు చేతుల్తోటీ పట్టుకుని వీధిలోకి వచ్చి టాక్సీ ఎక్కాడు. "పెద్ద మర్రిచెట్టు" అనగానే టాక్సీ కదిలింది.

గంగులు తనూ కదిలి నాలుగంగలు వేసి దగ్గరో ఆనుంచిన మోటర్ సైకిల్ ఎక్కాడు. టాక్సీననుసరించసాగాడు.

టాక్సీ సందులు, గొందులు చాలా తిరిగింది. వెళ్ళిన దారమ్మటే మళ్ళీ మళ్ళీ వెళ్ళింది. అలా సుమారు రెండు గంటలసేపు ప్రయాణం చేసి అది ఒక మర్రిచెట్టు దగ్గర ఆగింది. జ్యోతిష్కుడు రెండు బ్రీఫ్‌కేసులూ తీసుకుని మర్రిచెట్టు వెనక్కు వెళ్ళాడు. క్షణం మాత్రం తటపటాయించి వాటినక్కడ వదిలేశాడు.

అవి చాలా బరువుగా ఉన్నాయి. అందులో బంగారముండవచ్చు లేదా ముక్కలైన మనిషి శవాలుండవచ్చు. టాక్సీవాలా తొందరచేస్తున్నాడు. అతను తిరిగి టాక్సీ ఎక్కాడు.

టాక్సీ కదిలి వెళ్ళిపోయిన అయిదునిమిషాలకు గంగులు మర్రిచెట్టును సమీపించాడు.

టాక్సీలో టాక్సీవాలా జ్యోతిష్కుడికి పాతికరూపాయలూ ఇచ్చి దింపమన్న చోట దింపేసి తనదారిన తను పోయాడు.

# 7

టాక్సీ కదిలేక - ఆ టాక్సీని గంగులనుసరించి వెళ్ళేక - ఇవన్నీ రహస్యంగా ఆ ప్రాంతాల్లోనే ఉండి గమనిస్తున్న శ్రీనాథ్ సోమయాజులుగారింట్లో ప్రవేశించాడు. ఏదో తెలియని బెదురులో అతని గుండెలదురుతున్నాయి.

అతను హాల్లోకి ప్రవేశించగానే ఎవరో తన్ను పిలిచినట్లయింది. తలెత్తి పైకి చూశాడు. మెట్లమీద జ్యోతిష్కుడి రూపంలో ఉన్న ఒక వ్యక్తి తనను పిలుస్తున్నాడు. అతన్ని శ్రీనాథ్ గుర్తుపట్టాడు. ఈ భవనం ముందే కూర్చుని చేతులు చూస్తూంటాడాయన. నిన్ననే తనాయనకు పదిరూపాయలుకూడా ఇచ్చాడు. ఆయనిక్కడెందుకున్నాడు?

"మీరా?" అన్నాడాశ్చర్యంగా.

"పైకిరా..." అన్నాడు జ్యోతిష్కుడు. శ్రీనాథ్ గబగబా పైకి వెళ్ళాడు.

"మీ నాన్న నాకు తెలుసు. అన్నీ వివరంగా చెప్పాడు. టాక్సీ దొడ్డిగుమ్మం దగ్గర సిద్ధంగా ఉందా?" అన్నాడు జ్యోతిష్కుడు.

"ఉందండి..."

"సోమయాజులుగారి మనిషి తప్పుదారి తొక్కాడా?"

"తొక్కాడండి!"

"నీకోసమే చూస్తున్నాను. పద - లక్ష్మిని కళ్ళారా చూద్దువుగాని..." అన్నాడు జ్యోతిష్కుడు. శ్రీనాథ్ కుతూహలంగా ఆయన్ననుసరించాడు. ఇద్దరూ మేడమీదున్న మధ్యగదిలోకి వెళ్ళారు. గదినిండా బంగారపు అచ్చులు. శ్రీనాథ్ కళ్ళు చెదిరిపోయాయి.

"ఇది నిజంగా బంగారమేనా?"

"ఏమీ సందేహంలేదు. దీనివిలువ కనీసం పాతిక లక్షలుంటుంది. అయితే ఇందులో మనం తీసుకోబోయేది కేవలం పదిలక్షలు మాత్రం. మిగతా పదిహేను లక్షలూ సోమయాజులుగారిది..."

"మనమంటే - మీరూ వాటా కావాలా?"

"వెర్రివాడా - నాకు డబ్బెందుకు? నీ తండ్రి నా స్నేహితుడు. పదిలక్షలూ నీకే. నాకిందులో ఏమీ అక్కర్లేదు. నేను కోరుకునేది భగవదనుగ్రహం ఒక్కటే!" - అని జ్యోతిష్కుడు కంగారుగా - "ఇంకెంతో టయిం లేదు. నువ్వు చాలా జాగ్రత్తగా ఇల్లుచేరాలి. కనీసం నాలుగు టాక్సీలైనా మారు. అవసరమైతే రిక్షాకూడా ఉపయోగించుకో..." అన్నాడు.

అక్కడ ఆరేడు బ్రీఫ్‌కేసులున్నాయి. శ్రీనాథ్ అందులో రెండింటిలో ఓ ఇరవై అచ్చులుసర్దాడు. అక్కణ్ణించి కదిలి వెళ్ళాడు. అతను వెళ్ళేసరికి దొడ్డి గుమ్మం దగ్గర టాక్సీ సిద్ధంగా వుంది. జ్యోతిష్కుడుచెప్పిన విధంగానే అతను టాక్సీలు మారాడు. ఇంటికి రిక్షాలో వెళ్ళాడు. అయినా అతని గుండెలు గుబగుబలాడ్తూనే ఉన్నాయి.

అంత డబ్బు తన స్వంతమవుతోందంటే ఇంకా ఏదో కలలా ఉందతనికి.

# 8

జ్యోతిష్కుడు ఆ గదిలో ఉన్న రహస్యపు టరలన్నీ ఒకటొక్కటే మూసేశాడు. గది చూడ్డానికి యథాప్రకారంగా ఉంది. గదినిండా బంగారపు అచ్చులు మాత్రం వున్నాయి.

'ఇంక సోమయాజులుగారికి స్పృహవచ్చే మార్గం చూడాలి...' అనుకున్నాడు జ్యోతిష్కుడు.

"అబ్బ - ఇంత బంగారం ఒక్కసారిగా చూస్తూంటే కళ్ళు చెదిరిపోతున్నాయి..."

అన్నమాటలు విని కంగారుగా వెనక్కు తిరిగాడు జ్యోతిష్కుడు. అక్కడ కనబడ్డ మనిషినిచూసి అతని పై ప్రాణాలు పైనేపోయాయి - "పీటర్!" అన్నాడతను అప్రయత్నంగా.

"నా పేరు తెలుసా నీకు..." ఆశ్చర్యంగా అన్నాడు పీటర్.

"నిన్నెరగని వాళ్ళెవరైనా ఉంటారా ఈ ఊళ్ళో!"

పీటర్ నవ్వాడు — "తెలుసు కాబట్టి నాదారికి అడ్డు రాకు మరి..." అన్నాడు.

"ఏమిటి నీదారి?"—అన్నాడు జ్యోతిష్కుడు.

"ఈ డబ్బు నాది. దీనిగురించి నేను అనరాని మాటలూ, పడరానిపాట్లూ పడ్డాను. ఇప్పటి దీని విలువ కనీసం పాతిక లక్షలుంటుంది..." అన్నాడు పీటర్.

"మరీ అంత అత్యాశకు పోకు, నా అంచనా ప్రకారం దీని విలువ పదిహేను లక్షలకు మించకపోవచ్చు .." అన్నాడు జ్యోతిష్కుడు. కానీ అతని మనసులోమాత్రం- ఈ పీటర్ కి దీని విలువ ఇంత ఖచ్చితంగా ఎలా తెలుసునా అని ఆశ్చర్యంగా ఉంది.

పీటర్ త్వరగా ఆ అచ్చుల్ని లెక్క వేశాడు—"ఇంకో ఇరవై వుండాలి. ఏంచేశావ్?"

జ్యోతిష్కుడు అదోలా పీటర్ వంక చూసి "ఇంకా ఉన్నాయేమో - నేనింకా ఈ ఒక్కగదినే చూశాను.

దీన్నానుకుని అటూఇటూ గదులున్నాయి...'' అన్నాడు.

''అది సరే — ఈ బంగారాన్ని నువ్వెలా కనుక్కున్నావ్?'' అన్నాడు పీటర్.

''నేను జ్యోతిష్కుణ్ణి. ఎక్కడ బంగారమున్నా నాకు తెలుస్తుంది...''

పీటర్ జేబులోంచి రివాల్వర్ తీశాడు - ''నువ్వు మాట్లాడుతున్నది పీటర్‌తోనని గుర్తుంచుకో. పిచ్చిపిచ్చి వేషాలు వేయకుండా నిజం చెప్పు...''

జ్యోతిష్కుడు క్షణంమాత్రం తటపటాయించాడు— ''నన్ను ప్రాణాలతో వదిలిపెడతానంటే నిజం చెప్తేస్తాను...'' అన్నాడు.

''చెప్పు!''

''సత్యంబాబుగారు తెలుసుగదా నీకు...''

''ఊఁ''

''ఆయన ఈ మూడు గదుల్నీ ప్రత్యేకంగా తయారు చేయించారు—ఒక వడ్రంగి మేస్త్రీచేత...'' అంటూ నరసింహులి కథంతా వివరంగా చెప్పాడు.

''ఎవడా వడ్రంగి మేస్త్రీ? వాడి పేరు నరసింహులు కాదుగదా...''

''కాదు. రమణయ్య...'' అన్నాడు జ్యోతిష్కుడు— ''రమణయ్య నాకు స్నేహితుడు. తన కథంతా నాకు వివరంగా చెప్పి ఈ బంగారం తన పాలైజేయాలన్నాడు. ఎన్నాళ్ళుగానో నిధి వుందని ఊరిస్తున్నా సోమయాజులు గారు చలించడంలేదు. ఆఖరికి విసిగిపోయి నేనే ఒక ఆకాశరామన్న ఉత్తరం ఆయన పేరును రాశాను. ఆయ నింట్లో పాతికలక్షలున్నాయనీ అవి బయటపెట్టి నాకివ్వక

పోతే ప్రాణాలు తీసేసి-వాళ్ళని సర్వనాశనం చేస్తాననీ.

దాంతో వాళ్ళలో చలనం వచ్చింది. నిధిమీద నమ్మకం కుదిరింది. పాతిక లక్షల్లో పదిలక్షలు నాకివ్వడాని కూడా అంగీకరించారు వాళ్ళు. ప్రస్తుతం స్పృహలేని స్థితిలో వున్నారు వాళ్ళు. అనుకున్న ప్రకారం పాతికా కు పదిహేను లక్షల బంగారమే ఉండడంలో నేను తెల్ల బోయాను. రమణయ్య నాకు చెప్పిన ప్రకారం-ఇక్కడ ఈ గదిలోనే బంగారమంతా దొరకాలి మరి...''

''జాప్యం చేస్తే కొంపలు మునుగుతాయి. నాకు దొరికిందే చాలు. అసలు పోయిందనుకున్న దాంట్లో కొంతయినా దక్కింది అదే చాలు...'' అని - ''నీ రమణయ్యని నాకు పరిచయం చేస్తావా? నాకూ ఇలాంటి రహస్యపుటరలు చేయగలదేమో కనుక్కోవాలి. చాలా అవసరం...'' అన్నాడు పీటర్.

''చేస్తానుగానీ నేనిక్కడున్నట్లు నీకెలా తెలిసింది? ఇంత ఖచ్చితంగా ఇక్కడికెలా రాగలిగావ్? నీకూ జోస్యం తెలుసునా?'' అన్నాడాశ్చర్యంగా జ్యోతిష్కుడు.

''అన్నీ కార్లో చెబుతాను. ముందు బంగారం బ్రీఫ్ కేసుల్లోకి సర్దాలి...'' అన్నాడు పీటర్. ఇద్దరూ బంగారాన్ని బ్రీఫ్ కేసుల్లోకి సర్దారు. ఆ తర్వాత వీధిలోకి వచ్చారు. కార్లో కూర్చున్నాక పీటర్ కథ చెప్పడం మొదలుపెట్టాడు.

''సత్యంబాబు ఆదాయమంతా స్మగ్లింగ్ మీదనే. ఆయనకు నేను కుడిభుజంగా వుండేవాడిని. మాదంతా చాలావరకూ కమీషన్ వ్యాపారం. ఒక వస్తువును తెలి

విగా కొంతకాలంపాటు దాచి-ఆ తర్వాత దాన్ని చేర్చ వలసిన చోటుకు చేర్చడం మా పని. రహస్య పత్రాలూ, మత్తు పదార్థాలూ అంతవరకూ చాలా రవాణా చేశాం కానీ-బంగారం రవాణా చాలాకాలంవరకూ చేయలేదు.

మా సంస్థమీద బాగా గురి కుదిరేక-ఈ బంగారం మా దగ్గరకు వచ్చింది. ప్రస్తుతం పోలీస్ చెకింగ్ చాలా దారుణంగా ఉన్నదనీ-ఈ బంగారాన్ని బొంబాయిలోని ఒక సేఠ్ కు చేర్చాలనీ-కానీ అందుకు కనీసం ఒక నెల రోజులు ఆగాలని బంగారాన్ని మాకిచ్చినతను కోరాడు. మొత్తం వ్యవహారం నడిపించడానికి-అనగా బంగారాన్ని దాచడానికీ, ఆ తర్వాత గమ్యస్థానం చేరడానికీ లక్ష రూపాయలడిగాం. అంగీకారం కుదిరేక పాతిక వేలు అడ్వాన్సుకూడా పుచ్చుకున్నాం.

బంగారం దాచేబాధ్యత సత్యంబాబు తీసుకున్నాడు. బంగారమున్న ప్యాకేజీ పెట్టెలు ఆయన కొత్తగా కడుతున్న భవనానికి తరలించబడ్డాయి. ఆరోజు రాత్రి ఆయన ఒక మేస్త్రీని తీసుకుని ఇంట్లో ప్రవేశించారు. నేనో టాక్సీవాలా నా ఇంటికి కాపలాగా ఉంచాను.

ఆ తర్వాత సత్యంబాబు ఆచూకీ దొరకలేదు. వెళ్ళి చూస్తే ఆయన కొత్త భవనంలో చచ్చి పడివున్నాడు. వెంటనే వెళ్ళి సత్యంబాబు కొడుకుని కలుసుకుని పరిస్థితి వివరించి చెప్పాను.

అంతా విని—"ఈ పరిస్థితుల్లో మా నాన్న చావు బయటపడితే అటు బంగారము పోవొచ్చు, ఇటు ఇంటి పరువూ గంగపాలు కావచ్చు. శవాన్ని రహస్యంగా మాయం చేసేయ్. ఓ వారంరోజులూరుకుని-సర్దుకోవలసిన

వస్తే సర్దుకుని అప్పుడు మేము పోలీస్ కంప్లయింట్ ఇస్తాం...'' అన్నాడు సత్యంబాబు కొడుకు. అంతే చేశాన్నేను.

టాక్సీవాలా నా కందజేసిన సమాచారాన్నిబట్టి- హంతకుడు తిన్నగా బయల్దేరి నరసింహులు అనబడే వడ్రంగి మేస్త్రీ ఇంటికి వెళ్ళినట్లు తెలిసింది. అయితే పోలికలు విచారించి చూడగా సత్యంబాబుగారు భవనానికి పిలిచిన మేస్త్రిగానీ, హంతకుడు కానీ నరసింహులు కాదని తెలిసింది. నరసింహులు భార్య నడగ్గా-ఎవరో నరసింహులికి తెలిసినతను అర్ధరాత్రివేళ తనింటికివచ్చి కాసేపుండి వెళ్ళిపోయాడనీ చెప్పింది.

కానీ నాకు నరసింహులుమీద బాగా అనుమానంగా వుంది. అతనికి ఎంతో కొంత సమాచారం తెలిసుండా లనిపించింది. అందుకే అతని భార్యను పట్టుకున్నాను. నా కస్టడీలో ఉంచాను. ఆమెను చూస్తే అమాయకురాలని తోచింది. కానీ ఆరోజునించే నరసింహులు మాయం కావడమూ-ఆ తర్వాత తన భార్యకోసమైనా అతను తిరిగి రాకపోవడమూ నరసింహులిమీద నా అనుమానాన్ని పెంచాయి.

దురదృష్టవశాత్తూ నరసింహులికి సంబంధించిన ఫోటో లేమీ దొరకలేదు. కొడుకుమీది బెంగతో కొద్దిరోజులకే ఆవిడా చనిపోయింది.

ఏదేమైనా బంగారం భవనంలోనే మాయమయుండా లని నా నమ్మకం. అందుకు మరో అవకాశంలేదు. కానీ ఎలా మాయమైందో-అదెక్కడ దాచబడిందో ఎంత ప్రయత్నించినా తెలుసుకోలేకపోయాను.

ఆ ఇల్లు అచ్చిరాలేదనీ_అందుకే బంగారం పోవడమూ, తండ్రి చనిపోవడమూ జరిగాయనీ సత్యంబాబు కొడుక్కి సెంటిమెంటు పట్టుకోగా_అతనా యిల్లు అమ్మేశాడు.

ఆ బంగారానికి నష్టపరిహారంగా మేము ఏడు లక్షలు కట్టాల్సి వచ్చింది. ఆ డబ్బు చాలా కష్టంమీద సంపాదించాం. నెమ్మదిమీద తీర్చాము. కానీ మరీ చెడ్డపేరు వచ్చింది. వ్యాపారం పడిపోయింది. నమ్మకంమీద నడిచే ఈ వ్యాపారంలో ఒకసారి చెడ్డపేరువస్తే చాలా కష్టం. ఆ తర్వాత ప్రయత్నబలంమీద అయిదారేళ్ళకు మళ్ళీ కాస్త చెప్పుకోదగ్గ స్థాయికి చేరుకున్నాం.

కానీ నేను మాత్రం ఆ ఇంటిమీదో కన్ను వేసుంచాను. ఆ ఇంట్లో నా ఏజంటు నాకు ఉప్పందించే ఏర్పాటుంది. ఈరోజు నా ఏజంటుద్వారా నే నాకు సమాచారమందింది. సరైన సమయానికి బంగారం అందుకోగలిగాను...'' కథ పూర్తిచేసి గర్వంగా చూశాడు పీటర్.

# 9

మధ్యాహ్నం మూడుగంటలవేళ సోమయాజులుకు మెలకువ వచ్చింది. అప్పటికాయనభార్య నిద్రపోతూనే ఉంది. ఆయనే తట్టి లేపేసరికి కళ్ళు నులుముకుంటూ లేచిందావిడ. ఇద్దరూ వాస్తవాన్ని గ్రహించడానికి కాసేపు పట్టింది. నెమ్మదిమీద పరిస్థితులన్నీ అకళింపు చేసుకున్నాక ''జ్యోతిష్కు దేదే?'' అన్నాడు సోమయాజులు.

''అవును_ఏడీ?'' అంది శాంతాదేవి.

ఇద్దరూ జ్యోతిష్కుడికోసం ఇల్లంతా వెదికారు. పనిలో పనిగా యింట్లో ఖరీదయిన వస్తువులేమైనా పోయాయా అన్నదికూడా చూశారు. శాంతాదేవి ఒంటి మీది నగలతో సహా అన్నీ భద్రంగా ఉన్నాయి.

"మనం మూడుగంటలసేపు మైకంలో పడిపోయామన్నమాట. ఈ మూడు గంటల్లోనూ జ్యోతిష్కుడు ఏం చేశాడో?" అన్నాడు సోమయాజులు. ఆయన మాటలు పూర్తికాకుండానే ఆ ఇంట్లో గంగులు ప్రవేశించాడు.

గంగుల్ని చూస్తూనే సోమయాజులు ముఖం వికసించింది. "ఏంరా_ఏం జరిగింది?" అనడిగాడు.

"పన్నెండుపావుకీ_న్నరకీ మధ్య మనింటిముందో టాక్సీ ఆగిందండి. అందులోంచి ఓ సన్యాసి దిగాడండి. తిన్నగా ఇంట్లోకి వెళ్ళి రెండు బరువైన పెట్టెలతో చ్చాడండి. అవి టాక్సీలో వేసుకుని బయల్దేరితే మోటార్ సైకిల్ మీద నేను వెంటాడేనండి. ఓ రెండు గంటలసేపు నన్నూరంతా తిప్పి_చివరకు టాక్సి ఓ మర్రి చెట్టుదగ్గర ఆగిందండి. అక్కడ ఆ సన్యాసి బరువైన రెండు పెట్టెల్ని చెట్టువెనకాల దాచి వెళ్ళిపోయాడండి. నేను వెళ్ళి ఆ పెట్టెను చూతునుగదా_ఓ పట్టాన మూతలూడి రాలేదండి. అతి కష్టంమీద తెరిచిచూస్తే అందులో కంకరరాళ్ళు తప్ప ఏమీ లేదండి..."అన్నాడు గంగులు.

"ఏడిసినట్లుంది. అదంతా మనని దోవ మళ్ళించడాని కాడిన నాటకమన్నమాట. అయితే జ్యోతిష్కుడు పెద్ద పథకంమీదనే వచ్చాడు. మనకంటే తెలివిగా మని

లాడు. బంగారాన్ని దక్కించుకునే ఉంటాడు...''
అన్నాడు సోమయాజులు బాధగా.

''నేను వదలిపెట్టలేదండి. ఆ సన్యాసిని కలుసుకున్నా నండి. ఎవరో కుర్రాడు కోరిన ప్రకారం చేశాటండి. ఆ తర్వాత నెంబర్నిబట్టి టాక్సీనికూడా పట్టుకున్నానండి. అయితే అందులో డ్రైవరు వేరేగా ఉన్నాడు. ఓ వంద రూపాయలు తీసుకుని తన టాక్సీని కాసేపు పారుగూ రతనికిచ్చేడట...'' అన్నాడు గంగులు.

''సరేలే_ఇందులో నువ్వు చేయగలిగింది చేశావ్_షంక నువ్వు వెళ్ళొచ్చు'' అన్నాడు సోమయాజులు.

గంగులు వెళ్ళిపోయేసరికి ''అన్నట్లు_మనింట్లో పనిమని షేమయింది? దానికి చెప్పాంగదా_ఇల్లంతా ఓ కంటకని పెడుతూండమని...'' అన్నాడాయన భార్యతో.

''అదేనండీ_నాకూ చిత్రంగా ఉంది. అదేమయిందో కనపట్టంలేదు...'' అంది శాంతాదేవి.

''జోతిష్కుడి వాటం చూస్తే గుండెలు తీసిన బంటులాగున్నాడు.వాడు దాన్నికూడా కనిపెట్టి ఏమైనా చేయలేదుగదా అని భయంగా వుంది నాకు...'' అన్నాడు సోమయాజులు.

''వాడంతటివాడేకానీ_ దాసీదాని గురించి ఎంతని ఆలోచిస్తాం?'' అంది శాంతాదేవి.

''ఒకవేళ వాడు దాన్ని చంపేసి _ ఎక్కడైనా పారేస్తే ఆ శవం పోలీసులకు దొరికితే_శవాన్ని పోలీసులు మన పనిమనిషిదని గుర్తిస్తే_మనం కూఢా కేసులో ఇరు క్కుంటాం...''

శాంతాదేవి మొగుడువంక చిత్రంగా చూసి___

"ఏమండీ_జ్యోతిష్కుడు నెలల తరబడి బంగారం గురించి చెబుతూంటే దాన్ని గురించే పట్టించుకోలేదు మీరు_ఇప్పుడు దీనికెంతదూరం ఆలోచించారండీ..." అంది.

"బాగుందే_అది కల్పన. ఇది వాస్తవం" అన్నాడు సోమయాజులు.

# 10

కారు ఓ ఇంటిముందాపాడు పీటర్. జ్యోతిష్కుడూ అతనూ కలిసి_బ్రీఫ్ కేసులనింట్లో జేరవేశారు. తర్వాత పీటర్ తలుపులు వేశాడు.

"మిస్టర్ నీ పేరేమిటో తెలియదుకానీ నీ సాయం చాలా కావాలి నాకు. ముందుగా రమణయ్యను నా దగ్గరకు తీసుకురావాలి నువ్వు. అతని సాయంతో ఈ ఇంట్లో గదిలో రహస్యపుటరలు చేయించాలి..."

"అది నావల్లకాదు. మిత్రద్రోహం చేయలేను నేను..." అన్నాడు జ్యోతిష్కుడు.

"నాకు నీ మిత్రుణ్ణి సాయపడమనడం ద్రోహమవుతుందా?"

"ఒక విధంగా ద్రోహమే! ఒకసారి రహస్యపుటరలు చేసినందుకేగదా రమణయ్యను సత్యంబాబు అంతంచేయాలనుకున్నాడు. మీ పని పూర్తయ్యాక మీరూ అలాగే అనుకుంటే...? అనుకుంటే ఏమిటి_అలాగే అనుకుంటారు!"

"అనవసరపుటనుమానాలు పెట్టుకోవడంవల్ల, మిత్రద్రోహం సంగతటుంచి ముందు నీ ప్రాణాలుకూడా పోవచ్చును..." అన్నాడు పీటర్.

"సరే_ఆలోచించుకో_ఈ ఇంట్లోంచి నువ్వేవిధంగానూ బయటపడలేవు. అర్ధగంట టైమిస్తున్నాను. ఆలోచించుకుని నీ నిర్ణయం చెప్పు. ఆ కాసేపూ నేను బయటతిరిగి వస్తాను..." అన్నాడు పీటర్.

"వ్యవధి అనవసరం. ఒకవేళ అంగీకరించిన పక్షంలో నన్ను వదిలిపెడతావా?"

"వదిలిపెట్టను. నువ్వా రమణయ్య చిరునామా ఇవ్వాలి. ఇచ్చిన చిరునామా తప్పయితే_అది తెలిసిన మరో ముప్పై నిముషాలకంటె బ్రతకవు నువ్వు..."

"సరైనదైతే ఎంతకాలం బ్రతుకుతాను?"

"జ్యోతిష్కుడివి కదా_అది నీకే తెలియాలి..."

"నా ఆయుర్దాయం నీకంటె ఎక్కువేవుంది" అంటూ జ్యోతిష్కుడు హఠాత్తుగా పీటర్ మీద కలబడ్డాడు. పీటర్ ఇది ఊహించినట్లు లేదు. జ్యోతిష్కుడు మాత్రం కలయబడడంలో పీటర్ మెడమీద తమాషాగా ఒక నరం నొక్కాడు. క్షణాలమీద పీటర్‌కు స్పృహతప్పింది.

జ్యోతిష్కుడి వేషంలోనున్న నరసింహులు పీటర్‌ని పక్కగదిలోకి లాగి ఓమూలగా పడుకోబెట్టాడు. తర్వాత అతను నెమ్మదిగా ఆ ఇంట్లోంచి బయటకు వచ్చి దారిని పోతున్న రిక్షా అతన్ని పిలిచి బేరమాడాడు.

బంగారమున్న మూడు బ్రీఫ్ కేసులూ రిక్షాలో వేయించాడు. రిక్షా శరవేగంతో వెళ్ళిపోయింది.

నరసింహులు వెళ్ళిన తర్వాత గంటకు పీటర్‌కు స్పృహ వచ్చింది. జరిగిందంతా స్ఫురణకు వచ్చింది. పీటర్ కారు ఎక్కాడు. అతని కారు శరవేగంతో ఓ భవనంముందు ఆగింది. పీటర్ కారు దిగాడు. భవనంలో అడుగు పెట్టాడు.

గుమ్మంలోనే ఒక అందమైన యువతి అతన్ని చూసి కన్నుగీటింది.

"బాస్ ఉన్నారా?" అడిగాడు పీటర్.

"ఉన్నారు కానీ కొత్తపిట్ట వచ్చింది. కాస్త ఖుషీలో ఉన్నారు..."

"పీటర్ వచ్చాడని చెప్పు. అర్జంటంటున్నాడని చెప్పు..." అన్నాడు పీటర్.

ఆ యువతి మెట్లెక్కి మేడమీదకు వెళ్ళింది.

మరో పదినిముషాల్లో ఒకతను మెట్లుదిగి వచ్చాడు.

మనిషి తెల్లగా పుష్టిగా వున్నాడు. వయసు ముప్పైకీ నలభైకీ మధ్యలో ఉంటుంది. ముఖంలో చిరాకు కాస్త కనబడుతోంది - "ఏమిటి వేళకానివేళ వచ్చావ్?" - అన్నాడు.

"పదిహేను లక్షలు విలువచేసే ముప్ఫై బంగారపు టచ్చులు చేతికి చిక్కినట్లే చిక్కి మాయమయ్యాయి. మీకోపిక ఉందంటే అంతా వివరంగా చెబుతాను..." అన్నాడు పీటర్.

అతని చిరాకు పూర్తిగా తొలగిపోయినట్లుంది— "చెప్పు!"-అన్నాడు ఆత్రుతగా.

పీటర్ అంతా వివరంగా చెప్పాక - "మా నాన్నగారు దాచిన బంగారం ఇన్నాళ్ళకు బయటపడిందన్న మాట. నిన్ను మెచ్చుకోక తప్పదు..." అన్నాడతను.

"అవును ముత్యంబాబూ" అన్నాడు పీటర్ - "కానీ ఏం లాభం?"

"అలా నిరుత్సాహపడకు. ఒకసారి చేజిక్కాక జ్యోతిష్కుడెక్కడికి పోతాడు? మనవాళ్ళని ఊరంతా

వదిలిపెడదాం వాడి ఆనవాళ్ళు చెప్పి వేటకుక్కల్లా ఊరంతా గాలించమందాం. సన్యాసిలాంటి వాడెవడు కనబడ్డా పట్టుకుని లాక్కుని రమ్మందాం..." అన్నాడు ముత్యంబాబు.

"తండ్రిని మించిన తెలివి మీది..." అన్నాడు పీటర్ మెచ్చుకుంటూ.

ముత్యంబాబు హఠాత్తుగా—"ఒకవేళ జ్యోతిష్కుడిది మారువేషమేమో!" అన్నాడు.

"అదే నిజమైతే. ఇక ఈ జన్మకు మనం వాణ్ణి పట్టలేము" అన్నాడు పీటర్ నీరుకారుతూ...

—:ఐపోయింది:—

# మానవుడా? దానవుడా?

అజీజ్

"జైల్లో రెండేళ్ళనించీ తాగిన బీడీముక్కలే తాగి నోరు పాడైపోయింది. ఓ సిగరెట్ వుంటే పడేయ్యండి!'' అన్నాడు షణ్ముగం జైలు గేటు దగ్గర కాపలా కాస్తున్న గార్డుని.

''ఈరోజు విడుదలయ్యేవుగా? తట్టెడు కొనుక్కొని తాగు!'' అన్నాడు గార్డు నవ్వుతూ.

''తట్టెడు మాట దేవుడెరుగు. ఒక్క సిగరెట్ కొనుక్కోడానికి దమ్మిడీ ఉంటేగా జేబులో! ఇంటికెళ్ళి పెళ్ళాంనడిగి తేగానీ పదిపైసలు పుట్టే యోగం లేదిప్పుడు మా ఇల్లు కోడంబాకంలో వుంది. ఇక్కణ్నించి కాలి నడకన అక్కడికి చేరేసరికి చీకటిపడుతుంది.

కారు ముందుకు సాగాలంటే పెట్రోల్ ఎంత అవసరమో నాలో ఊపిరి ఆడాలంటే సిగరెట్ అంత అవసరం. రెండేళ్ళు మీ జైల్లో ఎన్ని అవస్థలు పడ్డానో ఆ పరంధాముడికే తెలుసు!'' అన్నాడు షణ్ముగం.

గార్డుకి అతనిమీద జాలేసినట్టుంది. కుడిచేతిలో వున్న రైఫిల్ ఎడం చేతిలోకి మార్చుకుని జేబులోంచి సిగరెట్ పాకెట్, అగ్గిపెట్టి తీసి, ఓ సిగరెట్ అందించేడు.

షణ్ముగం సిగరెట్ అంటించుకుని—''థాంక్స్, బస్తా!'' అంటూ కదలబోయేడు.

''మళ్ళీ వస్తావా? జైలుకి?'' అన్నాడు గార్డు.

షణ్ముగం నవ్వి—''నోరు జారింది! వెళ్దా!'' అంటూ గబగబ ముందుకు అడుగులు వేసేడు.

షణ్ముగానికి ముప్పై ఐదేళ్ళుంటాయ్. నల్లగా, పొట్టిగా, గున్న ఏనుగలా వుంటాడు మనిషి. పిసరంత బొజ్జ. కండలు తిరిగిన ఒళ్ళు. గుడ్లగూబలాంటి కళ్ళు. పీచు తల.

మాసి ముడతలుపడ్డ నల్ల కాటన్ పాంటూ, గళ్ళ షర్టూ వేసుకున్నాడు. మెడలో మఫ్లర్!

సిగరెట్ దమ్ములాగుతూ తల వంచుకుని గబ గబ నడుస్తున్నాడు.

ఆ సెంట్రల్ జైలు ఏరియానించి సిటీలోకి వెళ్ళాలంటే ఓ అరమైలు దూరం నిర్మానుష్యమైన ఆ రోడ్డమ్మట నడవాలి. అప్పటికే పరిసరాలవి చీకట్లు ముసురుకుంటున్నాయి. రోడ్డు కిరుపక్కలా వున్న ఎలక్ట్రిక్ దీపాలు అప్పుడే వెలిగేయి.

వెనక ఏదో కారు తననే సమీపిస్తున్నట్టు చప్పుడు విని చటుక్కున ఆగేడు షణ్ముగం. సందేహ నివృత్తి కోసం ఇంకా వెనక్కి తిరిగి చూడకముందే ఓ బ్లూరంగు ఫియట్ కారు వచ్చి అతని పక్కన ఆగింది!

షణ్ముగం కళ్ళు చిట్లిస్తూ కార్లోకి చూసేడు.

స్టీరింగ్ ముందు ఒకేఒక వ్యక్తి కూర్చునున్నాడు. డార్క్ ఆఫ్ కలర్ లాంగ్ కోట్, అదేరంగు ఫెల్ట్ హాట్. మెడలో చెవులవరకూ ఎత్తుగా చుట్టుకున్న మఫ్లర్.

పరిసరాలని చిరు చీకట్లు కమ్ముకోడంవల్లా, ఆ వ్యక్తి తలమీది ఫెల్ట్ హాట్‌ని బాగా ముందుకి లాక్కుని పెట్టుకోడంవల్లా షణ్ముగానికి అతని మొహం స్పష్టంగా కనిపించడంలేదు.

"లిఫ్ట్ కావాలా?" అడిగేడతను కీచుకంఠంతో.

షణ్ముగంకు ఆశ్చర్యం వేసింది. కారణం, దారిన పోయే దానయ్యలకి, కారాపి లిఫ్ట్ ఇచ్చే పెద్దమనిషెవ్వడూ ఇంతవరకూ తటస్థపడలేదతనికి! అదీ, ఈ జిడ్డోడే దుస్తుల్లో ఉన్న తనవంటి దేభ్యంగాడికి లిఫ్ట్ ఇవ్వాలనుకునే పెద్దమనిషి ఈ లోకంలో వుండటం వింతలోకి వింత!

"ఏమిటి ఆలోచిస్తావ్? రా, కూర్చో!" అన్నాడతను మరోసారి. షణ్ముగం తేరుకుని, దొరికిన ఛాన్సు దేనికి వదులుకోవాలని బాక్ డోర్ తెరిచి లోన కూర్చున్నాడు.

"ఎక్కడికెళ్ళాలి?" అడిగేడతను వెనుదిరిగి చూడకుండా.

"కోడంబాకం!"

కారు కదిలింది.

షణ్ముగం ఇంకా పూర్తిగా ఆశ్చర్యంలోంచి తేరు కోలేక పోతున్నాడు.

చూస్తూ, చూస్తూనే కోడంబాకం వచ్చేసింది. వీధి మలుపులో రోడ్డు పక్క కారాపేడతను. అప్పటికే బాగా చీకటి పడింది.

కార్లో ఇప్పుడా వ్యక్తి ఆకారం తప్ప మరేమీ కని పించడంలేదు.

"నీ ఇల్లు ఎక్కడుంది?" అడిగేడతను వెనుదిరిగి.

"అదుగో, ఆ సందులో పడి ఫర్లాంగు నడిస్తే వస్తుంది!"

"పెళ్ళాం, పిల్లలూ వున్నారా?"

"పిల్లలేరు! నాలాటి వాళ్ళకి పుస్తెకట్టిన పెళ్ళాలు కూడానా? ఉంచుకున్న బాపతు... నేను జైలుకెళ్ళాక అదింకా ఆ ఇంట్లోనే వుందో, ఎవ్వడితోనైనా ఎగిరి పోయిందో తెలీదు!"

"నీతో చాలా ముఖ్యమైన పనుంది నాకు!"

"తెల్సు! ముందే అనుమానించేను. లేకుంటే, దారిన పోయేవాడికి లిఫ్ట్ ఇవ్వడం ఏమిటి?"

"నిజమే! ఈరోజు జైల్లోంచి ఎవ్వడు విడుదలవుతాడా అని మధ్యాహ్నంనించీ పడిగాపులు గాస్తున్నాను జైలు పరిసరాల్లో. ఇప్పటికి నువ్వు బైటపడ్డావ్!"

"ఇంతకీ, నాతో ఏమిటి పని?" అడిగేడు షణ్ముగం అసలు విషయానికి వస్తూ.

"ఎక్కడైనా తీరిగ్గా కూర్చుని మాట్లాడే విషయం

అది... బాగా డబ్బు ముడుతుంది నీకు!" అతను చాలా నెమ్మదిగా మాట్లాడుతున్నాడు. కంఠం క్రీచుగా వుంది.

"నా జీవితంలో సగభాగం నేరాల్లో గడిచి పోయింది. రెండేళ్ళు శిక్ష అనుభవించి ఇప్పుడే బైట పడ్డాను. చేతిలో చిల్లి కానీ లేదు. జైల్లో పూటకింత కూడైనా దొరికేది. ఇక్కడ చేతిలో డబ్బులేందే మంచి నీళ్ళుకూడా దొరకవు. న్యాయంగా సంపాదిస్తే నాలుగు వేళ్ళుకూడా నోట్లోకి వెళ్ళవు. కనక, నువ్వేం చెప్పినా చెయ్యడానికి నేను సిద్ధం!" అన్నాడు షణ్ముగం దృఢంగా.

"గుడ్! అందుకే నీలాంటివాళ్ళకోసం నేను గాలిం చేది. పద, వివరంగా మాట్లాడుకుందాం" అంటూ కారు పోనిచ్చేడతను.

రెండుమూడు రోడ్లు దాటి మాప్పిళ్ళై స్ట్రీట్ లోకి తిరిగింది కారు. ఆ వీధిలో ఓ చిన్నసైజు మేడముందు ఆపేడతను. ఇంటిచుట్టూ చిన్న కాంపౌండ్. ఇనప ఊచల గేటు.

"కారు లోనికి తీసుకెళ్ళాలి. కాస్త ఆ గేటు తెరువ్!" అన్నాడతను.

షణ్ముగం దిగి గేటు తెరిచేడు.

అతను కారు కాంపౌండ్ లోనికి పోనిచ్చి, కుడివైపు కట్టివున్న గేరేజ్ లో ఆపి దిగేడు. ఇంటికి తాళం వేసి వుంది.

అతను తాళం తెరిచి—"రా!" అన్నాడు.

హాల్లో డిమ్ లైటు వెలుగుతోంది. కుడివైపు గోడ

వారగా పైకెళ్ళడానికి మెట్లున్నాయి. అతను తలుపు మూసి మెట్లవైపు నడిచేడు. అలవాటు ప్రకారం అక్కడి వస్తువుల్ని ఎక్స్‌రే కళ్ళతో పరిశీలిస్తూ అతన్ని అనుస రించేడు షణ్ముగం!

ఇద్దరూ మెట్లెక్కి పైకి చేరుకున్నారు. పైన రెండు గదులున్నాయి. అతను ఓ గది తలుపు తెరిచి లోన అడుగుపెట్టేడు. అందులో మరీ తక్కువ వోల్టేజ్ బల్బు వెలుగుతోంది. అంతసేపూ ఆ వ్యక్తి మొహం ఒక్కసారి చూడాలనుకుంటున్న షణ్ముగం నిరుత్సాహ పడ్డాడు. ఆ వెలుగులో ఒకరి మొహాలొకరు స్పష్టంగా చూసుకోడం కష్టం!

షణ్ముగాన్ని సోఫాలో కూర్చోమన్నట్టు సైగచేస్తూ' కాస్త ఎడంగా వున్న సోఫాలో చితికిలబడ్డాడతను.

"ఇప్పుడు చెప్పు. ఏమిటి సంగతి?" అడిగేడు షణ్ముగం కూర్చుంటూ.

"పాండీబజార్‌లో వున్న మెటెర్నిటీ హోమ్ ఎప్పు డైనా చూసేవా?"

"మెటెర్నిటీ హోమ్ అంటే?"

"ప్రసూతి గృహం! ఆడవాళ్ళు పిల్లల్ని కంటారే, అది!"

"చూశాను!"

"ఈరాత్రి అందులోంచి ఓ పిల్లవాణ్ని ఎత్తుకు రావాలి!"

షణ్ముగం పకపక నవ్వి "ఈ పనికేనా నన్నిక్కడికి తెచ్చింది?" అన్నాడు.

"ఔను! దేనికలా నవ్వుతావ్?"

"ఇంత ఇదిగా నన్నిక్కడికి తీసుకొచ్చావంటే, ఎవర్నైనా సఫా చెయ్యమనో, ఏ అందమైన అమ్మాయి నైనా కిడ్నాప్ చేసి తీసుకురమ్మనో అంటావనుకున్నాను! చాలా చిన్నపని చెప్పావ్!"

"దీనికే వెయ్యిరూపాయలు ముడతాయి నీకు!"

"ఆ హాస్పిటల్లో రోజూ అనేకమంది పిల్లల్ని కంటూంటారు. అందులో ఏ పిల్లాణ్ని ఎత్తుకురావాలి?"

"ఏ పిల్లాడైనాసరే! ఎర్రగా, బొద్దుగా, ఆరోగ్యంగా వుండాలి!"

"అంత _ పెంపకం తీసుకోవాలనుకుంటే, అనాథ శరణాలయాల్లో దిక్కూ మొక్కూ లేక ఎందరో పిల్లలున్నారుగా?"

ఆ మాట అతనికి నచ్చనట్టుంది. "నీకు డబ్బు కావాలా, వద్దా? అనవసరంగా కాలయాపన చెయ్యక! ఇప్పుడు సరిగ్గా పది గంటలవుతున్నాయి. సిటీలో జనసంచారం సన్నగిల్లుతుంది. మంచి సమయం వెళ్ళు!" అన్నాడు.

"ఆల్ రైట్! వెళ్ళడానికి నాకేం అభ్యంతరంలేదు. ఖర్చులకు కొంత డబ్బిలాపడేయ్!" అన్నాడు షణ్ముగం లేస్తూ.

అతను జేబులోంచి పర్సుతీసి, మూడు వంద రూపాయల నోట్లు లాగి, టీపాయ్‌మీదికి విసిరేడు.

షణ్ముగం వాటిని అందుకుని జేబులో కుక్కుతూ "వస్తాను! ఎదురుచూస్తుండు" అని బైటికి నడిచేడు.

## 2

అదే మెటెర్నిటీ హోమ్!

వీధిలో మనిషిమాత్రుడు లేడు. మెయిన్ గేటు మూసి ఉంది.

కాంపౌండ్ పిట్టగేటు దూకి లోనికి వెళ్ళడం పెద్ద సమస్యకాదు. మెడలోని మఫ్లర్ బిగదీసుకుంటూ ఓసారి అటూ ఇటూ చూసి గోడని సమీపించేడు షణ్ముగం.

కన్ను మూసి తెరిచేలోగా ఎగిరి అవతలకి దూకేడు. కాంపౌండ్‌లో మసక చీకటి. హాస్పిటల్ సింహద్వారం ముందున్న వరండా ఇనప వల గేటు మూసి ఉంది. వరండాలో ఉన్న బల్బు గుడ్డిగా వెలుగుతూ కునికిపాట్లు పడుతోంది.

అది రెండంతస్తుల భవనం. పై అంతస్తులో డిమ్ లైట్లు వెలుగుతున్నాయి. వాటర్ పైప్ అందుకుని సులభంగా పైకి జేరుకోవచ్చు. గబ గబ నీటిగొట్టంవైపు నడిచేడు.

వేడికోసం కాసేపు అరచేతులు రుద్దుకొని గొట్టం అందుకున్నాడు. కన్నుమూసి తెరిచేలోగా పై కెగబాకి తెరిచి ఉన్న కిటికీ అంచు అందుకున్నాడు. కాసేపు అంచుపట్టుకుని వేళ్ళాడి, శరీరంలో స్ప్రింగ్ యాక్షన్ ఏర్పడ్డాక ఎగిరి కిటికీమధ్య కూర్చున్నాడు. గుండెలో సన్నగా దడ ప్రారంభమయింది.

గదిలోకి చూసేడు. ఖాళీ! మనిషి ఛాయలేదు. ఆ గదిలో ఎవ్వరో ఒక పేషెంట్ వుంటుందనుకున్న షణ్ముగం నిరుత్సాహపడ్డాడు.

సాలోచనగా తలూపుతూ, కిటికీ దిగి దగ్గరగా వేసి ఉన్న తలుపులవైపు నడిచేడు. సందుమధ్య కన్నుపెట్టి నడవాలోకి చూసేడు, ఎవ్వరైనా తిరుగుతున్నారేమోనని. ఎవ్వరూ లేరు!

ఆగి ఆగి పేషెంట్ల దగ్గులూ, పనిగండుల కేరింతలూ

వినిపిస్తున్నాయి. తలుపుమీద చెయ్యివేసి మెల్లిగా ఓ రెక్క తెరిచేడు. అంతే! నడవాలో ఎవ్వరో వస్తున్న అడుగుల ధ్వని. షణ్ముఖం గుండె గుభిల్లుమంది.

చటుక్కున రెక్కమూసి, వెంట్రుకవాసి సందులోంచి నడవాలోకి చూసేడు. ట్రేలో దూదీ, మందు సీసాలూ పట్టుకుని వెళుతోంది ఓ నర్సు!

ఊపిరి బిగబట్టి నిల్చున్నాడు. ఆమె నడవా దాటి, మెట్లు దిగి కిందికెళ్తున్న శబ్దం క్రమంగా దూరమైంది.

మెల్లిగా తలుపు తెరిచి నడవాలోకి అటూ ఇటూ తొంగిచూసేడు. ఎవ్వరూ లేరు. తేలికపడ్డ మనసుతో బైట అడుగుపెట్టేడు.

అంతే! కెవ్వుమన్న స్త్రీ కంఠం వినగానే షణ్ముఖం గుండె లవుసిపోయేయి. చెవులు రిక్కించేడు. కింద యెక్కడో బాధగా అరుస్తున్న స్త్రీ కంఠం అది.

చిన్నగా నవ్వుకున్నాడు. అది ప్రసూతి గృహం! కింద ఎవ్వరో ప్రసవవేదనపడుతున్నట్లున్నారు, అందుకే, ఇంత క్రితం ఆ నర్సు మందులూ మాకులూ తీసుకెళ్ళింది.

అడుగులో అడుగు వేసుకుంటూ పక్క గదివైపు నడిచేడు. తలుపుదగ్గిర ఆగి మునివేళ్ళతో తోసేడు. తెరుచుకుంది. గదిలోకి తొంగిచూసేడు. మంచంమీద తల్లీ, ఉయ్యాలలో కుర్రాడూ మంచి నిదరలో ఉన్నారు.

లోన అడుగుపెట్టి, తలుపుమూశి వెనుదిరిగేడు. అడుగులో అడుగు వేసుకుంటూ ఉయ్యాలని సమీపించేడు. పడుకున్న పసివాణ్ణి మెల్లిగా చేతుల్లోకి ఎత్తుకున్నాడు. వాడికి చుట్టబెట్టివున్న బట్టలు తీసి, భుజంమీదుగా ఛాతీకి కట్టుకుని వాణ్ణంగులో పడుకోబెట్టుకున్నాడు.

ఆలస్యం చేస్తే కొంప మునగవచ్చు. పిల్లి అడుగులు వేస్తూ తలుపు వైపు నడిచేడు. సరిగ్గా అప్పుడే గుడ్డలో ఉన్న కుర్రాడు అటూ ఇటూ కదిలినట్టు తోచింది. శబ్దం కానివ్వకుండా తలుపు తెరిచేడు. అంతే!

కుర్రాడు గుక్క తిప్పుకోకుండా రాగం మొదలు పెట్టేడు. వెనక, మంచం కిర్రుమన్న చప్పుడు! వాడి తల్లి నిదర లేచి ఉంటుంది!! దడదడమంటున్న గుండెతో నడవాలోకి గెంతేడు.

గదిలో అరుపులు—"దొంగ! దొంగ, నా బాబు నెత్తుకుపోతున్నాడు. పట్టుకోండి. రక్షించండి."

కుర్రాడి ఏడుపు అంతకంతకీ ఎక్కువవుతోంది. పణ్మ్ముగానికి ముచ్చెమటలు పడుతున్నాయి. మెరుపులా పక్క గదిలోకి దూరేడు. కిందినించి కొందరు పైకి పరిగెత్తుకొస్తున్నట్టు మెట్లమీద చప్పుడు వినిపించసాగింది.

కన్ను మూసి తెరిచేలోగా కిటికీని సమీపించేడు పణ్మ్ముగం. కిటికీ ఎక్కి జాగ్రత్తగా నీటిగొట్టం అందుకున్నాడు. కాళ్ళు వణుకుతున్నాయి. చమటవల్ల పట్టు జారితే అంత ఎత్తునించి కిందపడి కుర్రాడితోబాటు తనూ గోవిందా!

మొదటిసారి ఏడుకొండలవాడికి మొక్కుకుంటూ జర జర కిందికి జారేడు. గుక్క తిప్పుకోకుండా ఏడుస్తున్నాడు కుర్రాడు. అదృష్టం బావుంది. చివరికి నేలమీద అడుగుపెట్టేడు.

క్షణం వేసుచెయ్యకుండా కాంపౌండు పిట్టగోడ వైపు పరుగుతీసేడు. రెప్పపాటులో ఎగిరి బైటికి దూకేడు. కొద్ది దూరంలో రోడ్డుపక్క ఆపి ఉంది ఫియట్ కారు.

బాణంలా అక్కడికి చేరుకున్నాడు.

ఫ్రంట్ డోర్ తెరిచి, కట్టుకున్న బట్టవిప్పి వ్రక్కనున్న సీట్లోకి విసిరేశాడు. స్టీరింగ్ ముందు కూర్చుని కారు స్టార్టు చేసి వేగంగా ముందుకు పోనిచ్చేడు.

# 3

"క్రైంబ్రాంచికి ఫోన్ చెయ్యండి!" అన్నా రెవరో.

లేడీ డాక్టర్ తన ఆఫీస్ గదిలోంచి ఫోన్ చేసింది.

ఇన్ స్పెక్టర్ రాజారెడ్డి, సార్జంట్ డేవిడ్, కొంత సిబ్బంది హుటాహుటిన వచ్చేరక్కడికి.

లేడీడాక్టర్ జరిగిందంతా ఇన్ స్పెక్టర్ కు చెప్పింది.

"ఆ పాప తల్లి ఎక్కడుందిప్పుడు?"

"పై అంతస్తులో స్పృహతప్పి పడుంది!"

అందరూ పైకి వెళ్ళి ఆ గదిలో అడుగుపెట్టేరు.

అంతక్రితమే స్పృహ రావడానికి ఇంజక్షన్ ఇచ్చారు గనక ఆమె కళ్ళు తెరిచి పిచ్చి పిచ్చిగా చూస్తోంది.

"దొంగ! నా బాబు నెత్తుకుపోతున్నాడు. పట్టు కోండి. నా బాబును రక్షించండి" ఇంకా ఆ షాక్ నుంచి తేరుకోనట్టుంది. పలవరిస్తోంది.

"మీరు ఆ వ్యక్తిని చూశారా?" అడిగేడు ఇన్ స్పెక్టర్ ఆమెవైపు చూస్తూ.

ఆమె రాజారెడ్డివైపు కళ్ళుతిప్పింది. యూనిఫాంలో ఉండడం మూలాన అతను పోలీస్ ఆఫీసర్ అని గ్రహించింది. అక్కడికి పోలీసులు వచ్చేశారని తెలుసుకుంది.

కాస్త ధైర్యం వచ్చింది కాబోలు. "చూశాను" అంది.

"ఎలా ఉంటాడు?"

"తలుపువైపు పోతుండగా చూసేను. పొట్టిగా, లావుగా ఉంది ఆకారం. పీచుతల. మెడలో మఫ్లర్. నా బాబును బట్టలో పడుకోబెట్టి భుజం మీదుగా కట్టు కున్నాడు..."

"మీ అరుపులువిని కూడా అతను వెనక్కి తిరిగి చూడ లేదా?"

"లేదు. వెంటనే తలుపు తెరుచుకుని బైటికి వురికేడు."

"మీ వారి ఉద్యోగం ఏమిటి?"

"ఫిలిం రిప్రజెంటేటివ్!"

"మీ బాబుని అపహరించడంవల్ల మీ బంధువుల్లో ఎవ్వరికైనా ఏదైనా లాభం ఉందా? ఆలోచించి చెప్పండి!"

"లేదు!"

"మీరు ఆందోళనపడి ఆరోగ్యం పాడుచేసుకోవద్దు. మీ బాబుని ఉదయంలోగా ఎక్కడున్నాసరే వెదికి మీ కప్పగిస్తాము" అంటూ లేచాడు ఇన్స్పెక్టర్.

## 4

"డాక్టర్!" పిల్చింది నర్స్.

వార్డులో రౌండ్ కెళ్ళబోతున్న లేడీ డాక్టర్ ఆగి, ప్రశ్నార్థకంగా చూసింది.

"మీకు ఓ పార్సిల్ వచ్చింది. సంతకం చేసి తీసుకో డానికి రమ్మంటున్నాడు పోస్ట్మెన్!"

డాక్టర్ కనుబొమలు ముడివడ్డాయి. హాస్పిటల్ కి రోజూ పోస్టురావడం మామూలు. కొత్త కొత్త మందుల ఎడ్వర్ టైజ్ మెంట్స్ వస్తుంటాయి, బుక్ పోస్టుల్లో.

కాని, డాక్టర్ పేర పార్సిల్ రావడమేమిటి?

"పార్సిలా?" అంది సందేహంగా.

"ఔను! చిన్న చెక్క పెట్టి!" అంది నర్స్.

"అతన్ని ఇక్కడికే రమ్మను!"

రెండు నిమిషాల తర్వాత చేతిలో చిన్న చెక్క పెట్టి పట్టుకుని, లోనికి వచ్చేడు పోస్ట్ మెన్.

డాక్టర్ సంతకంచేసి దాన్ని తీసుకుంది.

బరువుగా ఉంది! దాదాపు గజం పొడవు పెట్టి. చిన్న చిన్న మేకులు కొట్టి సీలు వేయబడుంది. బల్లమీది పెన్సిల్ చెక్కే చాకు అందుకుని నర్సుకిస్తూ, మూత ఊడదీయమన్నట్టు సైగ చేసింది డాక్టర్.

నర్సు మూత ఊడదీసి గావుకేక పెట్టింది!

డాక్టర్ రాతిబొమ్మలా గుడ్లు తేలవేసి పెట్టెలోకి చూస్తూండిపోయింది.

పెట్టెలో వెల్లికితలా పడుకోబెట్టి వుంది శవం! తెల్లని పసికందు శవం!! కళ్ళు సగం మూతలు పడున్నాయి. నోరు కొద్దిగా తెరిచివుంది. కంఠం దగ్గరా, చేతి మణికట్ల దగ్గరా, లోతైన కత్తిగాట్లు.

అప్పుడు పడింది డాక్టర్ దృష్టి, ఓమూల మడతపెట్టి ఉన్న కాగితంమీద. వణికే చేత్తో దాన్ని అందుకుని విప్పి చూసింది. తెలుగులో గజిబిజిగా రాసిన అక్షరాలు.

"డియర్ డాక్టర్!

రాత్రి మీ హాస్పిటల్లో ఓ కుర్రాడు మాయమయ్యేడు. వాడి శవాన్ని పెట్టిలో పెట్టి పార్సిల్ జేస్తున్నాను. దయచేసి ఈ శవాన్ని వాడి తలిదండ్రుల కప్పచెప్పండి.

ఈశ్వరుని ఆజ్ఞ లేనిదే చీమైనా చావదంటారు. వీడికి

ఈశ్వరాజ్ఞ అయింది. వెళ్ళిపోయేడు. చింతించి ప్రయోజనం! కంటికి కనిపించని ఓ సూక్ష్మజీవి ఇలా మానవాకృతి దాలుస్తుంది. కొన్నాళ్ళు జీవించి, తరవాత మరణిస్తుంది. అంతే!''

డాక్టర్ తల గిరగిర తిరుగుతోంది.

ఉత్తరం మడిచి, టేబిల్ మీది టెలిఫోన్ ముందుకు లాక్కుంది.

''ఎస్, ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి స్పీకింగ్!''

''ఇటీజ్ మెటెర్నిటీ హాస్పిటల్!''

''మళ్ళీ ఏం జరిగింది?'' ఇన్‌స్పెక్టర్ కంఠంలో ఆతృత.

''ఘోరం జరిగిపోయింది ఇన్‌స్పెక్టర్! ఫోన్‌లో చెప్పే ఓపిక ఇప్పుడు నాలో లేదు. తల తిరుగుతోంది. మీరు తక్షణం బైలుదేరండి'' అంటూ రిసీవర్ క్రెడిల్ చేసింది డాక్టర్.

ఇన్‌స్పెక్టర్ నిమిషాల్లో వచ్చాడక్కడికి.

పెట్టెలోని పసికందు శవం చూడగానే స్థాణువై పోయేడు.

ఆ ఉత్తరం విప్పి అందించింది డాక్టర్.

ఉత్తరం చదివి, కాసేపు శవాన్ని పరీక్షగా చూసిన ఇన్‌స్పెక్టర్ బుర్రలో తళుక్కుమంది ఓ ఆలోచన.

''డాక్టర్! పసివాణ్ని చంపదలుచుకున్న వాళ్లు, కత్తితో కేవలం కంఠం దగ్గర కోస్తే చాలు, చేతి మణికట్టు కూడా కొయ్యడం జరిగింది. దీని అర్థం ఏమిటి?''

''ఆలోచించాలి! బాగా ఆలోచిస్తేగానీ ఈ ప్రశ్నకి జవాబు దొరికేలా లేదు. ఇప్పుడు నాలో ఆలోచించే శక్తి పూర్తిగా నశించింది.''

"అంతేకాదు, శవం పూర్తిగా తెల్లగా పాలిపోయి ఉంది. ఇదికూడా గమనించతగ్గ విషయమే!"

"ఔను!"

సాలోచనగా తలూపి—"దయచేసి ఈ ఘోర వార్తను పిల్లాడి తలిదండ్రులకి చెప్పకండి," అన్నాడు ఇన్స్పెక్టర్.

"మీరు ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. నాకు తెలుసు. ఈ విషయం వింటే, ఆ భార్యాభర్తలిద్దరూ పిచ్చివాళ్ళవుతారు. ఈ రహస్యం మనలోనే గుప్తంగా వుండాలి. కాని, ఈ కసాయిపని చేసిన ఆ కిరాతకుణ్ని మాత్రం మీరు పట్టుకునితీరాలి" అంది డాక్టర్ ఆవేశంగా.

"పట్టుకోడం కాదు డాక్టర్! వాడ్ని ఉరికంబం ఎక్కించేవరకూ నేను నిదరబోను!" పళ్ళు పటపట కొరికేడు ఇన్స్పెక్టర్ రాజారెడ్డి.

# 5

"ఈ రాత్రి ఇంకో కుర్రాణ్ని మాయంచేసి తీసుకు రావాలి!" అన్నాడతను కీచు కంఠంతో.

మసక చీకట్లో అతని మొహం చూడ్డానికి ప్రయత్నిస్తూ—"ఇంతకీ, ఈ పసికుర్రాళ్ళని ఏం చేస్తావ్!" అడిగేడు షణ్ముగం.

ఆ ప్రశ్న అతనికి నచ్చనట్టుంది. సోఫాలోఇబ్బందిగా కదిలి—"అది నీ కనాసరం! డబ్బు కావాలనుకుంటే ఒప్పుకో. లేదా, మానెయ్!" అన్నాడు.

"డబ్బు ఎవడికి చేదు? మళ్ళీ హాస్పిటల్లోనా?"

"ఇక హాస్పిటల్లో వద్దు! పోలీస్ కాపలా ఏర్పాటయుంటుంది. చాలా ప్రమాదం!"

"మరి?"

"కురుప్పన్ వీధి. ఇంటి నెంబర్ నూటపదహారు. బాగా జ్ఞాపకం పెట్టుకో. ఆ ఇంట్లో ఐదు రోజుల క్రితం ఓ పిల్లాడు పుట్టేడు. చాలా జాగ్రత్తగా తీసుకురావాలి!"

"సరే, సగం డబ్బు ఇలా అడ్వాంసుగా పడెయ్!" అంటూ లేచాడు షణ్ముగం.

అతను పర్సు తీసి, ఐదు నోట్లు లెక్కపెట్టి టీపాయ్ మీదికి విసిరేడు. వాటినందుకుని హిప్ పాకెట్లో కుక్కుతూ బైటికి నడిచేడు షణ్ముగం.

# 6

అదే కురుప్పన్ వీధి!

వీధి మొదట్లో కారాపి దిగేడు షణ్ముగం. మెడలోని మఫ్లర్ బిగదీసుకుంటూ చుట్టూ చూసేడు. అది సెకెండ్ షో టైం గనక వీధిలో మనిషి మాత్రుడు లేడు. పెంట కుప్పల్లో పడుకుని చలికి తెగ ఏడుస్తున్నాయి ఊర కుక్కలు.

చక చక ఇంటి నెంబర్లు చెక్ చేసుకుంటూ వీధిలో నడవసాగేడు. కొద్దిదూరం వెళ్ళాక కనిపించింది నూట పదహారో ఇల్లు. తలుపులు మూసివున్నాయి. పక్కనే ఇనప ఊచల కిటికీ.

అరుగు ఎక్కి కిటికీగుండా లోనికి చూసేడు. టేబిల్ మీద లాంతర్ వెలుగుతోంది. పడుకునే సమయం గనక, వత్తి బాగా తగ్గించి ఉంచేరు. ఓ గోడవారగా నులక మంచం. ఆ మంచంమీద ఓ యువకుడు పడుకుని గుర్రు కొడుతున్నాడు.

బహుశా, పుట్టిన కుర్రాడి తండ్రయుంటాడు. పాపం.

దురదృష్టవంతుడు. కిటికీ దగ్గర్నించి కదిలి తలుపు ముందుకి వచ్చేడు షణ్ముగం. మునివేళ్ళతో మెల్లగా తట్టేడు తలుపుని.

ఐదు నిమిషాలు గడిచినా ఎవ్వరూ వస్తున్న అలికిడి లేదు. మళ్ళీ తట్టేడు. మరో ఐదు నిముషాలు గడిచేయి. విసుగు పుడుతోంది షణ్ముగానికి. ఈమారు దబ దబ తట్టేడు. గురక ఆగిపోయింది.

"ఎవ్వరు?" మంచంమీద లేచి కూర్చున్న చప్పుడు.

"సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్ని!"

"ఆఁ!"

"సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్ని."

మంచం దిగి గబగబ తలుపువైపు వస్తున్న అడుగుల శబ్దం.

తలుపు తెరుచుకుంది. "ఎవ్వరు?" మసక చీకట్లో షణ్ముగాన్ని పరీక్షగా చూట్టానికి ప్రయత్నిస్తున్నాడతను.

"నేను సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్నండి! ఓ చోరీ కేసు ఇన్వెస్టిగేషన్ చేస్తున్నాను. దొంగ ఈ వీధిలోనే వున్నట్టు వివరాలు అందేయి!"

"ఈ వీధిలో వున్నాడా?"

"యస్! మీ ఇంటివెనక వుంది చూడండి ఇల్లు. దాంట్లో."

"ఏమిటీ? మా ఇంటి వెనక ఇంట్లో వుంటున్న ముకుందరావు దొంగా! చాలా మంచివాడులా కనిపిస్తాడే!"

"దొంగ వెధవలు అలాగే కనిపిస్తారెండి! అర్ధ రాత్రి మీ నిద్ర చెడగొట్టి శ్రమ ఇస్తున్నాను. అతనిగురించి రెండు మూడు ప్రశ్నలడిగి వెళ్ళిపోతానంతే!"

"ఇందులో శ్రమేముందండీ! అటువంటి దొంగ రాస్కెల్స్ని పట్టివ్వడంలో పోలీస్ డిపార్ట్మెంట్కు సాయపడటం మా ధర్మం. బైట చలిగా వుంది. రండి లోన కూర్చుని మాట్లాడుకుందాం!" అంటూ తలుపుకడ్డం తొలగేడతను.

ఆ అవకాశం కోసమే ఎదురుచూస్తున్న షణ్ముగం తెచ్చిపెట్టుకున్న హుందాతో లోపల అడుగుపెట్టేడు.

"కూర్చోండి!" అంటూ టేబుల్ కెదురుగా వున్న కుర్చీ చూపించేడతను.

షణ్ముగం మెరుపులా ముందుకుదూకి అరచేతి అంచుతో ఒక్కటి ఇచ్చేడు అతని మెడమీద. అతనా షాక్లోంచి తేరుకోకముందే మరో రెండు మెరుపు దెబ్బలు తీసేడు వరసగా.

ఊహించని ఆ దాడికి అతను తట్టుకోలేక, ఉన్న పళంగా నేలకూలేడు. అతనికి స్పృహ తప్పిందనిబాగా నిర్ధారించుకున్నాక, చమట తుడుచుకుంటూ పక్కకి తిరిగేడు షణ్ముగం.

ఆ గది పడివైపు మరో గది వుంది. తలుపులు దగ్గరగా వేసివున్నాయి. తలుపుముందాగి, సందులోంచి చూసేడు లోనికి.

దీపం వెలుగుతోంది. మంచంమీద తల్లీ కుర్రాడూ మంచి నిదరలో ఉన్నారు. కింద చాప పరుచుకుని ఓ ముసలమ్మ పడుకునుంది. ముగ్గురూ గాఢ నిదరలో ఉన్నారు.

మునివేళ్ళతో తలుపుతోసి లోన అడుగుపెట్టేడు. సవ్వడి కానివ్వకుండా మంచందగ్గరికి నడిచి ఆగేడు. జేబులోంచి చిన్నసీసా బైటికి తీసేడు. మూత తెరిచి లోపల ఉన్న ద్రవాన్ని వేళ్ళమీద పులుముకున్నాడు.

సీసా జేబులోకి తోస్తూ మంచంమీదికి వంగేడు. తల్లి పక్కన పడుకున్న పసిపాప ముక్కుదగ్గిర నిమిషం వరకూ వేళ్ళు ఉంచేడు... ఇహ వాడు ఏడుస్తాడనే భయం లేదు. గంటకిగానీ తిరిగి స్పృహరాదు!

మెల్లిగా వాణ్ణి ఎత్తుకుని వెనక్కి తిరిగేడు. ఆ తిరగడంలో కింద పడుకున్న ముసలమ్మకి కాలు తగిలింది. కలవరపడ్డాడు.

కళ్లు తెరిచి చూస్తోంది ముసల్ది!

అరవడానికి నోరు తెరిచింది కాబోలు. భయంతో అరుపు బైటికి రావడంలేదు. నోరు అలాగే తెరిచి గుడ్లప్పగించి చూస్తోంది!

"అరవక! అరిస్తే పీక నొక్కి పారేస్తాను..." షణ్ముగం మాట ఇంకా పూర్తికాకముందే మంచం కిర్రు మన్న చప్పుడు.

అదిరిపడి మంచంవైపు చూసేడు.

కుర్రాడి తల్లి అటుతిరిగి పడుకుంటోంది!

షణ్ముగం గుండె కాస్త తెప్పరిల్లింది. "ఏయ్ ముసలీ! చెప్పేది నీకే! అరిచి గోలవేశావో, పుణ్యానికి ప్రాణాలు పోతాయ్! కిక్కురుమనకుండా అలాగే పడుకో" అంటూ గబగబ గదిలోంచి బైటికి నడిచేడు.

బైటికి రాగానే కాలి సత్తువకొద్దీ పరుగు లంకించేడు. అప్పుడు ప్రారంభమయ్యేయి ఇంట్లో కేకలు. ముసల్ది గొంతు చించుకుని గావుకేకలు పెడుతోంది.

# 7

"ఇన్ స్పెక్టర్ గారు ఉన్నారా?"

"ఉన్నారు!"

"వారితో అర్జంటుగా మాట్లాడాలి."

"మీ పేరు?"

"శివరాం!"

సార్జంట్ డేవిడ్ లోనికెళ్ళి, రెండు నిమిషాల తరవాత తిరిగివచ్చి—

"రండి" అన్నాడు.

శివరాం కాళ్ళీడ్చుకుంటూ ఇన్ స్పెక్టర్ ఆఫీస్ రూం లోకి నడిచేడు. అతని మొహం పీక్కుపోయి వుంది. జుత్తు అస్తవ్యస్తంగా పడుంది.

"ప్లీజ్, టేక్ యువర్ సీట్!" అన్నాడు ఇన్ స్పెక్టర్ రాజారెడ్డి.

శివరాం నీరసంగా కుర్చీలో జారగిలబడి "ఇన్ స్పెక్టర్ గారూ! రాత్రి మా బాబుని ఎవ్వరో ఎత్తుకుపోయేరు" అన్నాడు జీరబోయిన కంఠంతో.

సార్జంట్, ఇన్ స్పెక్టర్ ఇద్దరూ ఉలిక్కిపడ్డారు.

"ఏం జరిగిందో వివరంగా చెప్పండి!" అన్నాడు రాజారెడ్డి ఆతృతగా.

రాత్రి తనింటికి సి.ఐ.డి. ఇన్ స్పెక్టర్నని ఓ వ్యక్తి రావడం, తనని మూర్ఛ పోగొట్టడంవరకూ చెప్పి—

"మళ్ళీ నాకు స్పృహవచ్చి చూస్తే నా భార్యా, అమ్మా గుండెలు బాదుకుంటూ ఏడుస్తున్నారు. వాళ్ళ అరుపులు విని అప్పటికే ఇరుగుపొరుగు ఇళ్ళవాళ్ళు గుమిగూడి ఉన్నారు. ఏం జరిగిందని అడిగేను ఖంగారుగా.

బాబుని ఎవడో దొంగ ఎత్తుకుపోయేడని చెప్పేరు. నా గుండె ఆగిపోయినంత పనయింది. అర్ధరాత్రి ఇన్స్పెక్టర్నని ఇంట్లోకి వచ్చి నన్ను స్పృహ పోగొట్టినవాడే ఆ దొంగయియుంటాడని గ్రహించేను.

ఇంట్లో ఎక్కడి వస్తువులక్కడే ఉన్నాయి, ఒక్క బాబు తప్ప! దీన్నిబట్టి ఆ దొంగ బాబుకోసమే వచ్చాడని తెలుస్తోంది. ఆ ముక్కుపచ్చలారని పసికందుని వాడేం జేసుకుంటాడో ఎంతకీ అర్థంకావడంలేదు.

డబ్బుకోసం పిల్లల్ని ఎత్తుకుపోయి బ్లాక్ మెయిల్ జేస్తారని విన్నాను. నేను గుమాస్తాగిరీజేసుకు బ్రతికే మధ్యతరగతి బడుగుజీవిని. నా దగ్గిరేముందని?

ఇన్స్పెక్టర్ గారూ! ఇదివరకే నా భార్యకి రెండు కడుపులు పోయి, ఎన్నో మందులూ, మొకులూ, నోములూ నోచేక ఈ కుర్రాడు పుట్టేడు. ఎలాగైనాసరే, మీరు నా బాబుని రక్షించాలి!'' అతని కళ్ళలో నీటి పొర.

ఇన్స్పెక్టర్ వివరాలు రాసుకుని ''ఇక మీరు వెళ్ళండి. నిర్భయంగా ఉండండి! మీవాళ్ళకి కూడా ధైర్యం చెప్పాలి. మీ బాబు ఎక్కడున్నాసరే వెతికి మీ కప్పగిస్తాను,'' అన్నాడు.

అలా అన్నాడేకాని, ఈ జన్మలో ఆ పసివాణ్ణి సజీవంగా కనిపెట్టగలననే నమ్మకంలేదు ఇన్స్పెక్టర్కి.

శివరాం లేచి, నమస్కారంపెట్టి వెళ్ళిపోయేడు.

''సార్జంట్!''

''యస్ సార్!''

''అతన్ని వెంబడిస్తూ వెళ్ళి, ఇంటికి కొద్దిదూరంలో

పోస్ట్‌మెన్ కోసం ఎదురుచూస్తుండు. అతను రాగానే ఏదో ఒక సాకుతో ఇక్కడికి తీసుకురా!'' అన్నాడు ఇన్‌స్పెక్టర్.

డేవిడ్ తలూపి బైటికి నడిచేడు.

ఇన్‌స్పెక్టర్ ఆలోచనలు తీవ్రరూపం దాల్చేయి. సిగరెట్ మీద సిగరెట్ అంటిస్తూ కేసును కూలంకషంగా పరిశీలిస్తున్నాడు.

పన్నెండు గంటల ప్రాంతంలో డేవిడ్ తిరిగివచ్చేడు. ''మీ ఊహ కరెక్టే సార్! పోస్ట్‌మెన్ పార్సిల్‌తో శివరాం ఇంటికి వెళ్ళబోతుండగా ఆపి, పిల్చుకొచ్చేను'' అన్నాడు.

''తీసుకురా లోనికి!''

డేవిడ్ వెళ్ళి పోస్ట్‌మెన్‌ని వెంటబెట్టుకొచ్చేడు.

అతని చేతిలోని పార్సిల్ అందుకుంటూ-''దీన్ని మేము తీసుకుంటున్నాం!'' అన్నాడు ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి.

''అదేమిటి సార్?'' పోస్ట్‌మెన్ కళ్ళు ఆశ్చర్యంతో విప్పారేయి.

''భయపడక! ఈ పార్సిల్ మేము తీసుకున్నట్టు మీ అధికార్లకి తెలీజేస్తాం! ఇందులో దొంగసొమ్ముంది. ఇక నువ్ వెళ్ళు!''

ఆ పార్సిల్‌ని ఇన్‌స్పెక్టర్ రిసీవ్ చేసుకున్నట్టు రసీదు తీసుకుని వెళ్ళిపోయేడు పోస్ట్‌మెన్.

చెక్కపెట్టెని అటూఇటూ తిప్పిచూసేడు రాజారెడ్డి. ఫ్రం అడ్రస్ లేదు! అది స్థానిక జనరల్ పోస్టాఫీస్‌లో బుక్ చెయ్యబడింది. జేబులోంచి తాళం చెవులగుత్తితీసి, దానికి వేలాడుతున్న మడతకత్తి మొనతో పెట్టె మేకులు ఊడదీసి మూత తెరిచేడు.

శవం!

ప్రాణంలేని పసివాడి శవం!!

వెనకటిలాగే, గొంతుమీదా, చేతి మణికట్ల దగ్గిరా కత్తిగాట్లు. పాలగారితి బొమ్మలా తెల్లగా పాలిపోయి వుంది శవం.

పెట్టెమూల మడత బెట్టిన ఉత్తరం! చటుక్కున దాన్ని అందుకుని విప్పేడు ఇన్‌స్పెక్టర్.

'మిస్టర్ శివరామ్!

ఈశ్వరుని ఆజ్ఞ లేనిదే చీమైనా చావదంటారు. నీ పిల్లాడికి ఈశ్వరుని ఆజ్ఞ అయింది వెళ్ళిపోయేడు. చింతించి ప్రయోజనం లేదు!

దృష్టికి కనిపించని ఒక సూక్ష్మజీవి ఇలా మానవాకృతి దాలుస్తుంది. కొన్నాళ్ళు జీవించి తరవాత మరణిస్తుంది. అంతే!'

ఎడంచేత్తో తెలుగులో గజిబిజిగా రాసిన ఉత్తరం అది.

పళ్ళు పటపట కొరికేడు ఇన్‌స్పెక్టర్.

పసివారిని పాశవికంగా చంపుతున్న ఆ వ్యక్తి మానవుడా? దానవుడా?

# 8

అతను పేపర్ విప్పి ఓచోట వేలితో చూపిస్తూ—"ఇక్కడ చూడు!" అన్నాడు.

షణ్ముగం దృష్టి అక్కడ నిలిచింది.

చిన్న కుర్రాడి ఫోటో అది! దబ్బ పండులా ఆరోగ్యంగా ఉన్నాడు బోసిగా నవ్వుతున్నాడు.

"చూశావా?"

తలూపేసు షణ్ముగం. "వీడి ఫోటో పేపర్లో దేనికి వేసేరు?"

"చెబుతా విను! వారంరోజుల క్రితం వీడు, కూలి కేసుకు బ్రతికే లేబర్ కు పుట్టేడుట. మామూలు పిల్లలకన్నా రెండురెట్లు అధిక బలంతోనూ, ఆరోగ్యంగానూ పుట్టేడు. వీడి పాలఖర్చుకోసం ఆ కూలీకి ఆరోగ్యశాఖవారు గ్రాంటుకూడా మంజూరు చేసేరుట. అందుకే వేశారు ఫోటో."

సాలోచనగా తలూపేడు షణ్ముగం. "ఐతే ఏం చెయ్యాలి?"

"ఇంత ప్రత్యేకంగా దీనిగురించి చెబుతోంటే ఇంకా అర్థంకాలేదా? ఈ రాత్రి వీణ్ణి మాయంజేసి తీసుకురావాలి. వెయ్యి రూపాయలు అందుకోవాలి."

"ఆలోచించి చెబుతాను. ఓ సిగిరెట్ ఇలాపడెయ్!"

అతను నవ్వి సిగిరెట్ తీసిస్తూ - "చెప్పడానికొక్కాదు. ఎలా ఎత్తుకురావాలా అని ఆలోచించడానికి!" అన్నాడు.

సిగరెట్ అంటించి, గట్టిగా నాలుగైదు దమ్ములు లాగి- "సరే, అడ్రస్ చెప్పు!" అన్నాడు షణ్ముగం.

"వీడి తండ్రిపేరు వీరయ్య! వెస్టు మాంబళంలో ఓ పూరి గుడిసెలో నివసిస్తాడు!"

సిగిరెట్ ఇంకా సగం ఉండగానే ఏష్ట్రేలోనొక్కి లేచాడు షణ్ముగం. "రెండు గంటల్లో తిరిగొస్తాను" అంటూ చకచక బైటికి నడిచేడు.

## 9

"గణేశ్ బీడీ ఉందా?"

"ఇంకా స్టాక్ రాలేదు" చెప్పేడు కొట్టతను.

"ఐతే, టీ సోడా కొట్టివ్వు!"

నీళ్ళ తొట్టిలోంచి సోడా సీసా తీసి కొట్టిచ్చేసు కొట్టతను.

దాన్ని గడగడ ఖాళీచేసి—"చార్మినార్ సిగరెట్లున్నాయా?" అడిగేడు షణ్ముగం.

"ఉంది."

"ఓ పాకెట్ ఇవ్వు!"

తీసిచ్చేడతను.

డబ్బు చెల్లించి వెనుదిరిగేడు షణ్ముగం. ఏదో జ్ఞాపకం వచ్చినట్లు ఆగి—"అన్నట్లు ఇక్కడ వీరయ్య అనే లేబర్ ఎక్కడుంటాడు? అర్జంటుగా కలవా లతన్ని!" అన్నాడు.

"వాడా! ఈ కుడివైపు మలుపు తిరగండి. కొద్ది దూరంలో గుడిసె కనిపిస్తుంది. అదే వాడి నివాసం!"

తలూపి వెనుదిరిగేడు షణ్ముగం.

మలుపు తిరిగి కొద్దిదూరం వెళ్ళగానే కనిపించింది పూరి గుడిసె. అక్కడ కూడా ఎలక్ట్రిక్ స్తంభాలు వున్నా, బల్బులు వెలగడం లేదు. తనక్కావలసింది కూడా అదే. పరిస్థితులు అనుకూలంగా వున్నాయి.

గబ గబ గుడిసెని సమీపించేడు. తడక తలుపు మూసి వుంది. ఒక్క తన్నుకు విరిగిపడుతుంది. తలుపుమీద చెయ్యి వేసేడు షణ్ముగం.

సరిగ్గా ఆ క్షణంలో వెనకనించి భుజంమీద బలమైన చెయ్యి పడింది! నెత్తిన పిడుగుపడ్డట్లు అదిరిపడి వెను దిరిగేడు షణ్ముగం!

ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి!

సార్జంట్ డేవిడ్!!

షణ్ముగం గుండెలో గుర్రాలు దౌడుతీసేయి. రక్త ప్రసారం ఆగిపోయినట్టు తోచింది. కళ్ళు తేలిపోతున్నాయి.

సార్జంట్ చేతిలో టార్చి వెలిగింది.

“షణ్ముగం! నువ్వా?”

షణ్ముగం నాలిక పిడచగట్టుకుపోతోంది.

“ఇక్కడేం జేస్తున్నావ్?” అడిగేడు రాజారెడ్డి కఠినంగా.

షణ్ముగం నీళ్ళు నములుతూ “దొంగతనానికొచ్చేను” అన్నాడు.

“ఏం దొంగిలించడానికి? పిల్లాణ్ణా?”

“పిల్లల్ని దొంగిలించి నేనేం జేసుకోను?”

సార్జంట్ పకపక నవ్వేడు. “ఘరానా ఇళ్ళు దోపిడీ జేసే నువ్వు ఈ పూరిగుడిసెలో దొంగతనానికొచ్చావంటే నమ్మేదెవ్వడు? నిజం చెప్పు! పసివాళ్ళని మాయం చేస్తోంది నువ్వేకదూ?”

“అ...అబ్బే! నే... నేను కాదుసార్!”

“నీలాంటి రౌడీలు మర్యాదగా అడిగితే చెప్పరు. ఎలా చెప్పించాలో నాకు తెలుసు!” అంటూ అడుగు ముందుకు వేసేడు ఇన్స్పెక్టర్.

“రాజారెడ్డిగారి సంగతి నీకు తెలుసుగా? ఒంట్లో ఎముక లేకుండా చితక తంతారు. పత్రికల్లో ఆ ప్రకటన వేయించింది మేమే! ఒళ్ళు హూనం కాకముందే బుద్ధిగా చెప్పెయ్!” అన్నాడు సార్జెంట్ డేవిడ్.

షణ్ముగం చేతులెత్తి “కొట్టకండి! చెబుతాను... అంతా చెప్పేస్తాను...అతని పేరేమిటో నాకు తెలీదు.

పిల్లాణ్ణి ఎత్తుకుపోయి ఇస్తే వెయ్యి రూపాయలిచ్చేవాడు. అందుకనీ...'' అన్నాడు నీళ్ళు నముల్తూ.

"అతనెక్కడుంటాడో తెలుసుగా నీకు?"

"తెలుసు!"

వెనకనించి షణ్ముగం కాలర్ ఒడిసి పట్టుకుని "పద, చూపించు" అన్నాడు సార్జంట్, అతన్ని జీపువైపు తోస్తూ.

# 10

"ఇక్కడ ఆపండి!" అన్నాడు షణ్ముగం.

ఆ మేడముందు బ్రేక్ వేసేడు ఇన్స్పెక్టర్.

"ఇక్కడేనా వాడుండేది?"

సార్జంట్ వేసిన ప్రశ్నకి తలూపేడు షణ్ముగం.

జీప్ దిగి ముగ్గురూ కాంపౌండ్లోకి నడిచేరు.

తలుపు మూసి ఉంది. తోసేడు షణ్ముగం. కిర్రుమంటూ తెరుచుకుంది. ఇంట్లో సూది పడితే వినిపించే నిశ్శబ్దం!

డిటెక్టివ్ లిద్దర్నీ తన వెనక రమ్మన్నట్టు సైగచేసి మేడమెట్లవైపు నడిచేడు షణ్ముగం.

ముగ్గురూ సవ్వడికాని అడుగులతో మెట్లెక్కి పైకి జేరుకున్నారు.

గది తలుపు తెరిచే ఉంది. లోపల డిమ్లైటు వెలుగుతోంది.

ఆ గదివైపు సైగచేసేడు షణ్ముగం.

ఇన్స్పెక్టర్ జేబులోంచి పిస్తోలు బైటికి తీసేడు. వాళ్ళనక్కడే ఉండమని సైగజేసి, ట్రిగ్గర్ మీద చూపుడువేలు సిద్ధంగా ఉంచి, గదిలో అడుగుపెట్టేడు.

మసక వెలుతుర్లో గదిమధ్య కనిపించిన దృశ్యం ఇన్‌స్పెక్టర్ని దిగ్భ్రాంతుణ్ణి చేసింది. రెప్ప వెయ్యడం మర్చిపోయేడు కాసేపు!

నేలమీద బోర్లా పడున్నాడతను. చేతులు రెండూ బార్లా చాచి ఉన్నాయి. కుడిచేతిలో రివాల్వర్! పక్కనే వెల్లకిలా పడుంది ఫ్లెట్ హాట్.

"పిచ్చివేషాలు వెయ్యక! లేచి నిల్చో!" అన్నాడు రాజారెడ్డి కటువుగా.

అతనిలో చలనం లేదు.

తమని బోల్తా కొట్టించడానికి ఇదో ఎత్తు కాదు కదా?

"ఏమాత్రం కదిలినా, కుక్కని కాల్చినట్టు కాల్చి పారేస్తాను!" అంటూ అతన్ని సమీపించేడు ఇన్‌స్పెక్టర్.

బూటుకాలితో బోర్లాపడున్న అతన్ని వెల్లకిలా తిప్పేడు.

అంతే! ఇన్‌స్పెక్టర్ గుండె ఝల్లుమంది!! అతని ముఖం వికృతంగా వుంది.

అతని కుడి కణతలో ఎర్రని రంధ్రం! ఆ రంధ్రం గుండా కారి, కింద మడుగుకట్టిన రక్తం!! కళ్ళు మూతలు పడుతున్నాయి. నోరు సగం తెరిచి ఉంది.

చటుక్కున వంగి అతని చెయ్యి అందుకున్నాడు ఇన్‌స్పెక్టర్. ఒళ్ళు చల్లబడుతోంది. ప్రాణంపోయి కొద్దిసేపే అయుంటుంది. ఆత్మహత్య చేసుకున్నాడా?

చుట్టూ కలయజూసేడు. టీపాయ్‌మీద ఏదో కాగితం రెపరెపలాడుతోంది. గబగబ అటు నడిచేడు.

అది ఉత్తరం! గాలికి ఎగిరిపోకుండా దానిమీద సిగరెట్ లైటర్ ఉంది. చటుక్కున ఉత్తరం అందుకున్నాడు ఇన్‌స్పెక్టర్.

గజిబిజిగా రాసిన అక్షరాలు. త్వరగా రాసినట్టు వుంది. "ఏదో ఒకరోజు నా పాపం పండక తప్పదని నాకు తెలుసు. పోలీసుల చేతిలో పడ్డాక ఎలాగూ ఉరికంబం ఎక్కక తప్పదు. ఆ అవస్థలు పడేకంటే, నాకు నేనుగా చావడం మేలనిపించింది.

చచ్చేముందు నేనీ ఘాతుకాలకి ఎలా అలవాటు పడ్డానో చెప్పి చావడం న్యాయం!

రెండేళ్ళక్రితం, భారతదేశంనించి సిలోన్ వెళుతున్న బోయింగ్ విమానం ఘోర ప్రమాదానికిగురై సముద్రంలో కూలిపోయిన సంగతి బహుశా, మీకు తెలిసే వుంటుంది. ఆ విమాన ప్రయాణీకుల్లో నేనూ ఒకణ్ణి.

ఇంజన్ బ్రద్దలైంది. ఏ భాగానికిఆభాగం విడిపోతూ సముద్రంలో కూలిపోయింది విమానం. నాకు స్పృహవచ్చి చూస్తే స్పంజి సీటుమీద బోర్లాపడుకుని తేలుతున్నాను. ఆ ప్రమాదంలో నా ముఖం విపరీతంగా కాలిపోయింది!

సముద్రపు అలలు నేను పడుకున్న సీటును తోసుకుంటూ ఓ దీవికి చేర్చాయి. మనిషిమాత్రుడు లేని అతి చిన్న దీవి అది. ఆ దీవిలో నేను ఎన్ని అవస్థలుపడ్డానో వివరించే ఓపికా, సమయమూ ఇప్పుడు లేవు.

చుట్టూ మహాసాగరం ఉన్నా, తాగేనీరు లేకా, ఆకులూ అలములూ తింటూ ఎన్నో రోజులు ఏకాకిగా గడపవలసి వచ్చింది. అక్కడే ఒకరోజు ఓ విచిత్రమైన సంఘటన జరిగింది.

దీవిలో తిండి వెతుక్కుంటూ ఓ రాతి ప్రదేశం ఎక్కి జారిపడ్డాను. మొనదేలిన ఓ రాయి తగిలి బొటనవేలు తెగింది. రక్తం వరదలా కారసాగింది. అనుకోకుండా వేలు నోట్లో పెట్టుకున్నాను.

పుల్లపుల్లని రక్తం నోరంతా ఊరసాగింది. ఆకలి దప్పికలతో అలమటిస్తున్న నాకు ఆ రక్తం అమృతంలా తోచింది. ఎంతోసేపు వేలు చీకుతూ రక్తం తాగేను. ఎంతో రుచిగా తోచింది.

ఆనాటినించీ నాలో రక్త పిపాస ప్రజ్వరిల్లింది. హ్యూమన్ సైకాలజీ దృష్ట్యా ఒంటరిగా జీవించే ప్రతి మనిషీ ఏదో ఒక దురలవాటుకు దాసుడౌతాడు.

మత్తుపదార్థాలకు అలవాటుపడ్డ మనుషులు సమయాని కవి దొరక్కుంటే పిచ్చెక్కినట్టు ప్రవర్తిస్తారు.

సరిగ్గా నా విషయంలోనూ అదే జరిగింది. కనిపించిన జంతువునల్లా చంపి నా రక్తదాహం తీర్చుకోసాగేను.

దాదాపు నలభై రోజులవరకూ అలా గడిపేక, ఒక రోజు మన దేశ వాణిజ్యనౌక ఒకటి ఆ దారమ్మట పోతూ నన్నాదుకుని, మద్రాసు జేర్చింది. అప్పటికే నా ఆరోగ్యం బాగా క్షీణించింది. చాలాకాలం హాస్పిటల్లో గడిపేను.

ఆక్కణ్ణించి విడుదలై రాగానే మళ్ళీ నన్ను ఒంటరితనం చుట్టుముట్టేసింది. సాటిమనుషులు నా వికృతరూపం చూసి దూరంగా పారిపోసాగేరు. స్నేహితులూ, బంధువులూ నన్ను వెలివేసేరు.

ఆ ఒంటరితనమే మళ్ళీ నాలో రక్తపిపాసను ప్రజ్వరిల్లజేసింది. రుచికరమైన మానవరక్తంకోసం తహతహ

లాడసాగింది మనసు. బాగా ఎదిగిన మనిషి రక్తం కంటే అప్పుడే పుట్టిన పసిపాప తాజారక్తం చవిచూడాలన్న కొత్త ఆలోచన బీజం వేసుకుంది నాలో..."

అంతే ఉత్తరం ముగిసింది! ఇంట్లోకి వస్తున్న మమ్మల్ని చూసి ఆత్మహత్య చేసుకొని వుంటాడనుకొన్నాడు రాజా రెడ్డి.

వేడినిశ్వాస విడుస్తూ శవం వైపు చూసేడు, ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి.

-: ఐపోయింది :-

# రంగూన్ మిత్రులు

## కురుమద్దాలి విజయలక్ష్మి

రాజారావు ఓసారి చుట్టుప్రక్కల పరికించి కనకదుర్గా హోటల్లో అడుగుపెట్టాడు.

హోటల్లో పెద్దగా జనం లేరు.

సగం టేబుల్స్ ఖాళీగానే వున్నాయి.

ఓ మూలగా పూర్తి ఖాళీగావున్న టేబుల్ చూసి అటు నడిచి కుర్చీలో కూర్చున్నాడు రాజారావు.

బేరర్ కుర్రాడొచ్చి వేలం పాటలాగా హోటల్లో వున్న సరుకునంతా ఏకరువుపెట్టి "ఏంకావాలి సార్?" అన్నాడు.

కావలసినవి ఆర్డరిచ్చాడు రాజారావు.

బేరర్ కుర్రాడు క్షణాలలో వేడి టిఫెన్ తెచ్చి రాజారావు ముందుంచాడు.

రాజారావు ఇడ్లీ ముక్క తుంచి చపాతీ కూరలో నంజుకుని నోట్లో పెట్టుకున్నాడు.

చపాతీ కూరలో చపాతీలే నంచుకుతింటారు ఎవరైనా, కాని రాజారావుకి చపాతీ కూరలో ఇడ్లీ నంచుకుని తినటం యిష్టం. అది అతని టేస్ట్.

రాజారావు ఒక ఇడ్లీ తినటం పూర్తిచేశాడు. రెండో ఇడ్లీమీద దాడిచేయబోతుండగా ఎదుటి కుర్చీలో ఎవరో వచ్చి కూర్చున్నారు.

రాజారావు తల ఎత్తి వచ్చిన వ్యక్తివైపు ఓసారి చూసి, తిరిగి టిఫిన్ తినడంలో మునిగిపోయాడు.

ఆ వచ్చిన వ్యక్తి మాత్రం రాజారావుని చూడలేదు. నుదుటపట్టిన చమటని కర్ చీఫ్‌తో తుడుచుకుంటూ వుండిపోయాడు.

బేరర్ కుర్రాడు కొత్తాయన రావటం చూసి టేబుల్ దగ్గరకొచ్చాడు.

ఆ వచ్చినతని పేరు అప్పారావు. బేరర్ కుర్రాడితో తనకి కావలసినవి చెప్పిపంపాడు. అప్పుడు తల ఎత్తి ఎదుటిసీట్లో ఇడ్లీ తింటున్న రాజారావుని చూశాడు.

అప్పారావు ఉలిక్కిపడి మరోసారి, మరోసారి చూశాడు. ఆపై కళ్ళు నులుముకున్నాడు. చెయ్యి గిల్లుకున్నాడు.

అప్పారావు కళ్లు ఆశ్చర్యంతో పెద్దవయాయి. "వరేయ్ అనంతపద్మనాభశాస్త్రీ!" అన్నాడు.

రాజారావు తలఎత్తి చూడలేదు.

అప్పారావు మరోసారి ఆశ్చర్యపోయి రాజారావు వైపు, అతను తింటున్న ఇడ్లీ ప్లేటువైపు చూశాడు.

అప్పారావు కళ్ళు మిల మిలలాడాయి. టేబుల్ పైనుంచి తన చెయ్యి చాచి రాజారావు చెయ్యి పట్టుకుని బలంగా నొక్కుతూ, "అరేయ్ అనంతం! నేనురా అప్పారావుని," అన్నాడు.

రాజారావు చివ్వున తలఎత్తి అప్పారావు కళ్ళలోకి గుచ్చి చూస్తున్నట్లే చూశాడు.

"నా పేరు అనంతం కాదు, రాజారావు!" అన్నాడు.

అప్పారావు పగలబడి నవ్వాడు.

"పోరా అనంతం! నన్ను ఫూల్ని చెయ్యకు. అన్నట్లు రంగూన్నుంచి ఎప్పుడొచ్చావు! ఎలా వున్నావ్?"

"సారీ, సర్! మీరు పూర్తిగా పొరబడుతున్నారు. మీరెవరో నాకు తెలియదు. ఇదే ప్రప్రథమసారి మిమ్మల్ని నేచూడటం. నా పేరు రాజారావు. రంగూన్ నుంచి వచ్చిన మాటమాత్రం వాస్తవం."

రాజారావు మాటలకు అప్పారావు తెల్లబోయాడు.

"నన్ను గుర్తుపట్టలేదా అనంతం?"

"మళ్ళీ అదే మాట! తెలిసినవారయితేకదా మిమ్మల్ని గుర్తుపట్టటానికి!"

అప్పారావు ఒక్కనిమిషం ఆలోచిస్తూ వుండిపోయాడు. ఆపై బలంగా రాజారావు చేతిమీద చరిచి, "అరె ఫూల్! నీ జోక్స్, నీ తమాషాలు యింకా మాన లేదన్నమాట!" అన్నాడు.

"వచ్చినప్పటినుంచి చూస్తున్నాను. మీకయినా బ్రెయిన్ లూజ్ వుండాలి, నాకయినా వుండాలి. నా పేరు అనంతం కాదు, రాజారావు అని చెప్పాను," విసుగ్గా అన్నాడు.

బేరర్ కుర్రాడు టిఫెన్ ప్లేటు తెచ్చి టేబుల్ పై పెట్టి వెళ్ళాడు.

"చూడురా అనంతం! నా పేరు అప్పారావే. నే అప్పులడిగే మాట వాస్తవమే. ఇదివరలోనే అయిదు పది కావాలని అడిగేవాడిని. నీవిచ్చేవాడివి. అప్పటి నా పరిస్థితులు సరీగాలేక తీర్చలేదు. అది మనసులో పెట్టు కుని నన్ను గుర్తించనట్లు నటిస్తావురా?" అప్పారావు దీనంగా ముఖం పెట్టి అన్నాడు.

రాజారావు జాలిగా చూశాడు అప్పారావువైపు.

"మీరు చెప్పే అనంతంగారికి నాకూ పోలికలుండి వుంటాయి. అది గ్రహించక మీరు పొరబడి వుంటారు."

"నా ఎదురుగా నీవు కూర్చుని పోలికలంటా వేమిటిరా? అప్పారావు ఆవులిస్తే పేగులు లెక్కపెడతా డని ఎన్నిసార్లనే వాడివి?"

"నా పేరు రాజారావు. ఈ విషయం గురించి యిహ మాట్లాడకండి" కాఫీ సిప్ చేస్తూ వార్నింగ్ యిస్తు న్నట్లే అన్నాడు రాజారావు.

ఈ విషయంలో అప్పారావు వెనక్కు తగ్గ తలచుకో లేదు.

"చూడు, అనంతపద్మనాభశాస్త్రీ! నే చెప్పేది సాంతం విని వాదించు. అయిదేళ్ళ క్రితం మనం ప్రాణ స్నేహితులం. నే అప్పులు చేయటం నీ కిష్టం వుండేది కాదు. మాటలకు ముందు అప్పు చేయటం ఓ పెద్ద తప్పు అంటూండేవాడివి. అయిదేళ్ళ క్రితం నువ్వు రంగూన్ వెళ్ళావ్. అక్కడ చిన్న వ్యాపారం పెట్టి పెద్ద బిజి

నెస్ మాన్ వయావని తెలిసింది. డబ్బు సంపాదించిన మనిషి. నీవు నలగలేదు.

అయిదేళ్ళ క్రితం ఎర్రగా బుర్రగా వంకులు తిరిగిన నల్లని క్రాపుతో ఎలా వున్నావో ఇప్పుడూ అలాగే వున్నావు. డబ్బు సంపాదించావు గాబట్టి, ఖరీదైన దుస్తు లేసుకున్నావు. అంతే తేడా. అదీగాక—కుడి కంటికింద కంది గింజంత పుట్టుమచ్చ. పెదవిపక్కన అరంగుళం గాటు. ఇడ్లీలో పూరీకూర నంచుకుతినే అలవాటు. కాఫీ తాగేటప్పుడు నెమ్మదిగా సిప్ చేస్తూ తాగటం. మాటకు ముందు నొసలు ముడేయటం. ఇంకేం వివరాలు కావాలిరా నువ్వే అనంత పద్మనాభశాస్త్రివని చెప్పటానికి?"

కళ్ళార్పకుండా రాజారావుని చూస్తూ అన్నాడు అప్పారావు.

"అయిందా కథ?" అన్నాడు రాజారావు తాపీగా.

గతుక్కుమన్నాడు అప్పారావు.

"నిన్ను నేను గుర్తించానురా అనంతం! నువ్వే బహుశా నన్ను గుర్తించి వుండవు. ఈ అయిదేళ్ళలో నాలో చాలా మార్పు వచ్చింది. నా శ్రీమతి అయిదుగురి పిల్లలకి తల్లయింది. నా ఉద్యోగం ఎదుగూ బొదుగూ లేనిది. ఆఫ్ట్రాల్ ఓ గుమాస్తాగాడిని. చొక్కా చినిగితే కుట్టి తొడుక్కోటం తప్పదు. కుటుంబ భారంతో సగం నెత్తిమీద జుట్టు వూడింది. ఆ వున్న నాలుగు పాయలూ వెండిరూపం దాల్చాయి. అయినంత మాత్రాన నన్ను గుర్తుపట్టలేవురా!" ఈ తఫా అయినా రాజారావు గుర్తుపడ్తాడేమో అని, ఆశగా చూశాడు అప్పారావు.

"అయిందా కథ?" రాజారావు తాపీగా అన్నాడు.

"ఒరేయి అనంతం! నీతో లాభంలేదురా! ఇదివరకూ అంతే నన్ను గంటలతరబడి ఏడిపించేవాడివి. ఇప్పుడూ అలాగే నాటకం ఆడుతున్నావు. కానియ్, నీవు రేపు నా యింటికి పరుగెత్తుకొచ్చి ఒరేయ్ అప్పారావ్! నిన్న నే నాటకం ఆడారా. నేను రాజారావునికాదు, అనంతపద్మనాభశాస్త్రిని. నేను నీ స్నేహితుణ్ణి అనకపోతావా! సరేలే రేపెలాగూ మా యింటికొస్తావుగా అప్పుడిచ్చేస్తాను. ఓ పెన్‌రుపీస్ వుంటే ఇవ్వరా, ఇదివరకులా ఎగెయ్యనులే, రేపిస్తాగా అయి..."

అప్పారావు మాటలు పూర్తిగా వినకుండానే రాజారావు కుర్చీలోంచి ఛర్రున లేచాడు.

"చూడు మిష్టర్! నీ పేరు అప్పారావని అన్నావుకదూ! సార్థక నామధేయుడివి. పది రూపాయల అప్పుకోసం ఈ కట్టుకథ అల్లావా? ఇంతకన్నా నాకు జరుగుబాటు లేదు, ఓ పది రూపాయలు కావాలని అడిగితే యిచ్చేవాడిని. ఈ రాజారావుతో జోక్ చేయటానికి ప్రయత్నించకు. ఫలితం అనుభవించాల్సి వుంటుంది. గుడ్ బై" అంటూ రాజారావు పెద్దపెద్ద అంగలేసుకుంటూ ఇవతలికొచ్చేశాడు.

అప్పారావు "అ...!" అంటూ నోరు తెరిచి అలా వుండిపోయాడు.

అంతవరకూ ఈ యిరువురి సంభాషణ వింటున్న వెనక టేబుల్ వద్ద కూర్చున్న లాంగ్ కోటు, నెత్తిన హేటు, కూలింగ్ గ్లాసెస్ గల ఓ పొడుగాటి వ్యక్తి, రాజారావు కుర్చీలోంచి లేవటంచూసి, తనూ లేచాడు.

# 2

సాయంత్రం అయిదయింది.

పెద్ద బజారు వచ్చేపోయే జనంతో వాహనాలతో కిటకిటలాడుతూ వుంది.

రాజారావు దీర్ఘంగా ఆలోచిస్తూ చిన్నగా పేవ్ మెంటుమీద నడుస్తున్నాడు.

అదే పేవ్ మెంటుమీద రాజారావుకి ఎదురుగా వస్తూన్న సుందరం, రాజారావుని చూశాడు. చూస్తూనే నాలుగంగల్లో రాజారావుని సమీపించి రాజారావు రెండు భుజాలమీదా చేయివేసి బలంగా వూపుతూ. "అరె అనంతం! ఎప్పుడొచ్చావురోయ్ రంగూన్ నుంచి, ఏం మారలేదు సుమా! అయిదేళ్ళప్పుడు ఎలావున్నావో యిప్పుడూ అలాగే వున్నావు. ఏంటి విశేషాలు?" అన్నాడు.

రాజారావు భుజంమీదనున్న సుందరం చేతులను తొలిగిస్తూ, "మీరు..." అన్నాడు.

"మీరేమిటిరా? నేనురా నీ సుందరంని. ఆ రోజుల్లో నన్ను సుకుమారసుందరా అని ఏడిపిస్తుండేవాడివి. మర్చిపోయావా? అవును లేవోయ్ రంగూన్ వాతావరణం, డబ్బూ బిజినెస్. అణాకానీ వెధవని నేగుర్తుంటానా?" సుందరం చిరుకోపంతో అన్నాడు.

"చూడండి. నా పేరు అనంత పద్మనాభశాస్త్రి కాదు. రాజారావు. మీ ఫ్రెండ్ కి నాకూ పోలికలున్నట్లున్నాయి. మీరు పొరపడ్డారు," అన్నాడు రాజారావు నిదానంగా.

ప్రేమగా ఫెడేల్ మని రాజాజావు వీపుమీద చరిచాడు సుందరం.

"ఒరే అనంతం! అబద్ధం ఆడినా అతికినట్లుండాలిరా, నేను నిన్ను అనంతం అని మాత్రమే పిలిచాను. నీవు నీ పూర్తి పేరు చెప్పావు అవునా?" అన్నాడు సుందరం.

రాజారావు గతుక్కుమన్నాడు.

"నా పేరు రాజారావు..."

"ఒరేయ్! ముందు నోరు మూస్తావా రెండిచ్చుకోనా?"

"చెప్పేది పూర్తిగా వినండి."

"అదిగో మళ్ళీ...!"

రాజారావుకి ఏదో ఆలోచనవచ్చి కళ్ళు తళుక్కున మెరిశాయి.

"అరె సుందరం నిన్ను జోక్ చేశానురా! నేను నీ అనంతాన్నే!" అన్నాడు నవ్వుతూ.

"ఊ అలా దారికిరా! ఇంకా ఈ నాటకాలు, జోక్స్ మానలేదన్న మాట...! సరిసరి...రంగూన్ నుంచి ఎప్పుడు దిగావ్?"

"రెండు రోజులయింది."

"రంగూన్ వెళ్ళి మమ్మల్ని పూర్తిగా మర్చిపోయావురా!"

"అదేం లేదురా! బిజినెస్ వ్యవహారాలకే క్షణం తీరుబడి వుండదు. అంతే."

"నే నమ్మను."

"దానికి నేనేం చేయను?"

"ఏం చెయ్యొద్దు. రంగూన్ నుంచి దిగి రెండు రోజులయినా మా యింటికొచ్చావా?"

"రేపొస్తాను."

"ఈ రోజేం చేస్తావోయ్ పోదాంపద," అంటూ బల వంతం చేశాడు సుందరం.

రాజారావు మాత్రం లొంగలేదు. "పనుంది రే పోస్తాను" అని మొండిగా జవాబిచ్చాడు.

"అయితే నాతో కాసేపు కబుర్లుచెప్పి వెళ్ళు" అంటూ పక్కనే వున్న చిన్న పార్కుకి లాక్కెళ్ళాడు రాజారావుని.

పార్కులో కూర్చున్న తర్వాత రాజారావేం అడగ లేదు. సుందరం అడుగుతున్నవాటికి మాత్రం జవాబి స్తున్నాడు.

"ఒరేయ్ అనంతం! నువ్వు చాలా మారిపోయ్యా వురా! నీ మాటలు చేతలు విచిత్రంగా వున్నాయి. అన్నింటికీ ముక్తసరిగా జవాబులిస్తున్నావు. మనిషి నునుపు తేలావుగాని, నీలో వుషారు ఏదీ?"

సుందరం అంటున్నది వింటూ రాజారావు లేచి నిల బడ్డాడు.

"రేపు మీ యింటికొస్తాగా అప్పుడు అన్నింటికీ జవాబు చెపుతాను. అర్జంట్ పనుంది వెళతాను," అని మరోమాట కాస్కారం యివ్వకుండా రాజారావు ముందుకి వేగంగా నడిచాడు.

సరిగ్గా అప్పుడే లాంగ్ కోటు వ్యక్తిని రాజారావు ఓ చెట్టు పక్కగా నుంచుని వుండగా చూడటం జరిగింది.

రాజారావు తలపంకించి వేగంగా అడుగులేస్తూ పార్కులోంచి బైటపడ్డాడు.

'వీడు చాలా మారిపోయ్యాడు. డబ్బు సంపాదిస్తు న్నాడుకదా! గర్వం. అంతే అంతే. నాబోటివాడు ఏం

చూసుకు గర్వపడాలి?' పార్కులో కూర్చున్న సుందరం అనుకున్నాడు.

# 3

హోటర్ ఊర్వశిలో నలభైనాలుగో నెంబరు గదిలో మెత్తని పరుపుగల సింగిల్ కాట్ పై విశ్రాంతిగా పడుకున్నాడు రాజారావు.

ఫోన్ 'ట్రింగ్' అనే శబ్దం వినపడి, రిసీవర్ అందుకున్నాడు.

"హలో, ఎవరు కావాలండీ?" అన్నాడు రాజారావు తనకి ఫోన్ చేసే వాళ్లెవరూ వుండరనే ఉద్దేశ్యంతో.

"మిష్టర్ అనంతపద్మనాభశాస్త్రి!" అవతల కంఠం గంభీరంగా వినపడింది.

రాజారావుకి వళ్ళు మండిపోయింది.

రాజారావు టక్కున "రాంగ్ నెంబర్" అని చెప్పి అంతకన్నా క్విక్ గా రిశీవర్ ని క్రెడిల్ పై వుంచాడు.

'ట్రింగ్' అంటూ మళ్ళీ ఫోన్ మోగింది.

రాజారావు అదేం పట్టించుకోకుండా వెళ్ళి మంచం మీద పడుకున్నాడు.

మోగిన ఫోన్ ఆగిపోయింది.

రాజారావు చిన్నగా నవ్వుకున్నాడు.

సరీగ పది నిమిషాలతర్వాత మళ్ళీ ట్రింగ్ అంటూ ఫోను అరిచింది.

రాజారావు బెడ్ మీదనుంచి లేవలేదు. తన్ని కాదన్నట్లు వుండిపోయాడు.

పది నిమిషాలకోసారి చొప్పున ఫోన్ మోగటం, ఆగటం చేస్తూనే వుంది. అలా పదిసార్లు జరిగింది.

రాజారావులో సహనం నశించింది.

ఈ తఫా ఫోన్ మోగకముందే రాజారావు లేచి వెళ్ళి ఫోన్ వద్ద రెడీగా నుంచున్నాడు. అప్పుడే మళ్ళీ ఫోన్ మోగటం, రాజారావు రిసీవర్ని వేగంగా అందుకుని, "హలో ఎవరు కావాలండీ!" అని మర్యాదగా అడగటం జరిగింది.

"హోటల్ ఊర్వశియే కదండీ!" అవతలినుంచి ఇందాకటి కంఠస్వరమే అడిగింది.

"అవునండి."

"రూమ్ నెం. నలభై నాలుగేనా?"

"అవునండి."

"మాట్లాడేది అనంతపద్మనాభశాస్త్రియేనా?"

"కాదు. రాజారావు. నా పేరు రాజారావు. ఇహ ఫోన్ పెట్టవచ్చండి!"

"చూడు అనంతపద్మనా..."

"నా పేరు రాజారావు. ఆ అనంతం ఎవడో, మీ రెవరో నాకు తెలియదు."

"చూడు అనంతపద్మనాభశాస్త్రీ వ్రూరికే బుకాయించవద్దు."

"బుకాయించే ఖర్మ నాకు పట్టలేదు. కావాలంటే వచ్చి చూసుకోండి."

ఫోన్లో పెద్దగా నవ్వు వినపడి, టక్కున ఆగిపోయింది.

రాజారావు నొసలు ముడిపడ్డాయి.

"నేను చెప్పేది సావకాశంగా వింటావా?"

"వింటాను. వినక తప్పుతుందా! ఈ రాత్రంతా నిద్ర

కూడా పోనివ్వరు ఈ ఫోన్ గోలతో, ఆ చెప్పేదేదో తొందరగా చెపితే హాయిగా నిద్రపోతాను.''

''నీవు నిజంగానే అనంతపద్మనాభశాస్త్రివి కాదు...'' అవతలనుంచి తాపీగా వినవచ్చింది.

''కాదని చెపుతూనే వున్నాగా! నా పేరు రాజారావు అని చెపుతుంటే వేధిస్తుంటివి,'' రాజారావు తీవ్రంగా అన్నాడు.

''నువ్వు అనంతపద్మనాభశాస్త్రివి కాదు. అచ్చం అలాగే వున్నావు. కాని, నీవు అనంతపద్మనాభశాస్త్రి ఫేస్ తగిలించుకుని ఈ వూరు రావటానికి తగిన కారణమే వుండివుంటుంది. ఏమిటా కారణం! ఏమా కథ?''

''మీరు పొరబడుతున్నారని మర్యాదగా మరోసారి చెపుతున్నాను. నా పేరు రాజారావు. మీరు చెప్పే అనంతం పోలికలు నాలో వుండివుండవచ్చు. అంత మాత్రాన నన్నీవిధంగా మీరంతా అవమానం చేయటం ఏం బాగుండలేదు.''

''మీరంతా అంటున్నావు. ఎవరెవరు తగిలారేంటి?''

రాజారావు మాట్లాడలేదు.

''ఆ విషయం చెప్పకపోతే వచ్చే నష్టం ఏంలేదుగాని, ఈ వూరు ఏం ప్లానుమీద వచ్చావో చెప్పమ్మా?'' లాలనగా అడిగాడు అవతలవ్యక్తి.

''నీబోటివాళ్ళని గోల చేద్దామని...''కసిగా అన్నాడు రాజారావు.

''అది నీ తరంకాదు, నీ అబ్బతరం కాదు.''

''పోనీ నీ అబ్బతరం అవుతుందా?''

''స్టుపిడ్.''

"యూ స్టుపిడ్."

ఫోన్‌లో కాసేపు నిశ్శబ్దం, ఊపిరి పీల్చే చప్పుడు తప్ప.

"నా ప్రయత్నంలో నేనుంటాను. నీ ప్రయత్నంలో నీ వుండు" అవతలివ్యక్తి అన్నాడు.

"నీ ఏడు-పేదో నీ వేడువు" అన్నాడు రాజారావు.

"మంచిది. నా గురించి వివరాలు అక్కర లేదా?"

"అక్కరలేదు."

"అయినా చెప్పటం మర్యాద. నా ధర్మం. నా పేరు అనంత పద్మనాభశాస్త్రి. అండర్‌స్టాండ్?"

అవతల టక్‌మని ఫోన్ పెట్టిన శబ్దం అయింది.

రాజారావు కొయ్యబారిపోయాడు.

## 4

రాజారావు షేవింగ్ చేసుకుని, బాత్‌రూమ్‌లో దూరి అరగంట గోరువెచ్చని నీటితో స్నానం చేశాడు. బాత్‌రూమ్‌నుంచి బైటపడి, మరో అరగంట టాయ్‌లెట్ అవుతూ అద్దంముందు గడిపాడు. ఇంకా అద్దం ముందునుంచి కదిలి యివతలకి రాబుద్ధి కావటంలేదు. దువ్వుకున్న క్రాపునే మళ్ళీ మళ్ళీ దువ్వుకుంటున్నాడు.

ఫోన్ ట్రింగ్‌మంది.

రాజారావు విసుగ్గా ఫోనువైపు చూసి మళ్ళీ అద్దం వైపు ముఖం తిప్పాడు. ఫోన్‌దగ్గరకెళ్ళి ఫోనెత్తే ప్రయత్నం చేయలేదు.

విసుగుచెందని విక్రమార్కుడిలా ఫోన్ తన పని కానిస్తూనే వుంది.

చెవిగోసిన మేకలా చెవిదగ్గర అరుస్తుంటే సహన

వంతుడికికూడా చచ్చే విసుగుపుడుతుంది. రాజారావుకి చచ్చే కోపం వచ్చింది. రెండంగలలో ఫోనువద్దకొచ్చి రిసీవర్ ని చేతిలోకి విసురుగా తీసుకున్నాడు.

"హలో!" అవతలినుండి వినపడింది.

"ఏమిటి హలో! నీ పిండాకూడు నా శార్ధమూను. ఫోన్ చేయటంతప్ప వేరే ఏం పని లేదా నీకు? అనంత పద్మనాభశాస్త్రిని నేనే అని ఫోన్ లో అఘోరించక పోతే నా ఎదుటకొచ్చి, నీ ముఖం చూపరాదూ! దాగుడు మూతలాడుతున్నావ్ ముఖం పచ్చడిచేసేవాడులేక..."

అవతలివైపునుంచి నవ్వు వినపడటంతో రాజారావు వాక్ప్రవాహం ఆగిపోయింది.

ఫోన్ లో నవ్వు ఆగిపోయింతర్వాత "పిచ్చిపట్టిందా లేక కోతులాడుతున్నాయా నీ చుట్టూ!" అన్నాడు రాజారావు.

"నేనోయ్ రాజారావు!" ఫోన్ చేసిన వ్యక్తి అన్నాడు.

"నేనంటే అనంత పద్మనాభశాస్త్రివా?"అన్నాడు రాజారావు.

"అనంత పద్మనాభశాస్త్రి నీతో మాట్లాడాడా?" అవతలి వ్యక్తి ఆదుర్దాగా అడిగాడు.

"నేనే రాజారావ్, నా కంఠం గుర్తుపట్టలేదా?"

"ఊహూ గుర్తుపట్టలేదు. నీ బొంగురుస్వరం నేనెప్పుడు వినను లేదు సరేనా?"

"ఓహ్...మనం ముఖాముఖి మాట్లాడుకోటంతప్ప తప్ప ఇంతవరకు ఫోన్ అవసరం కలగలేదుకదూ? నేను రాజారావ్! నీ బాస్ ని."

"అనంతపద్మనాభశాస్త్రి నీకు ఫోన్ చేశాడా?"

రాజారావు ముఖంలో రంగులు మారాయి. "నిజంగానా?" అన్నాడు.

"ఎస్. నీ బాస్‌ని."

"సారీ సర్, ఎప్పుడూ ఫోన్‌లో మీ స్వరం విననందున పొరపడ్డాను. ఎందుకు ఫోన్ చేశారు? అర్జంటుగా ఏదయినా చెయ్యాలా?"

"ఉహూ!"

"మరి...?"

"అనంత పద్మనాభశాస్త్రి అవునో కాదోగాని నేనే వాడిని సుమా అంటూ పేరు మొత్తం చెప్పి ఫోన్ పెట్టేశాడు. ఇది రాత్రి జరిగింది. ఈ విషయం మీకు చెప్పాదామనే బైలుదేరుతున్నాను."

"గుడ్, గుడ్‌న్యూస్ వినిపించావు. అవతలివాళ్ళు బహుశా మనకి కావలసినవాళ్ళే ననుకుంటాను. రంగంలోకి దిగారు. బెదిరించటానికి నిన్ను ఎత్తుకపోవచ్చు. అన్నింటికి సిద్ధంగా వుండు. నీ వెనుకే నే వుంటాను."

"రాత్రి ఫోన్ నిబట్టే వూహించాను. కొందరు రంగంలోకి దిగారని..."

"గుడ్, జాగ్రత్తగా వుండు. మౌనంగా లొంగిపో, తర్వాత విషయం నే చూసుకుంటాను."

## 5

చటుక్కున మెలుకువ వచ్చింది రాజారావుకి.

అది చిన్న గది. రాత్రో పగలో తెలియటానికి తలుపులు తెరిచీ లేవు. కిటికీ అంటూ వకటీ లేదు.

గదిలో నలభైక్యాండిల్స్ బల్బు వెలుగుతున్నది.

రాజారావు మంచంమీదనుంచి లేచి గది నలువైపులా పరికించి చూశాడు.

గదిలో చెప్పుకోదగ్గవేమీ లేవు. ఓ మంచము. ఓ స్టూలు, ఆ స్టూలుమీద చిన్నమంచినీళ్ళకూజా, గాజుగ్లాసు వున్నాయి.

తను కూర్చున్న మంచంమీద చూపులు సారించిన రాజారావు వులిక్కిపడ్డాడు. వెంటనే తన్నితాను చూసుకున్నాడు.

రాజారావు వంటిమీద వుండాల్సిన బట్టలు మంచానికి తలాపిదిక్కున వున్నాయి.

రాజారావు శరీరంమీద కట్ డ్రాయరు, బనీనుమాత్రం వున్నాయి.

ఏంజరిగి వుంటుందో రాజారావు గ్రహించుకున్నాడు. హోటలు గదిలో నిద్రపోవటంవరకు తనకి తెల్సు, ఆపై జరిగింది వూహిస్తే బహుశా తన్నెవరో మత్తుమందు వాసనకి గురిచేసి ఎవరికి తెలియకుండా ఈ గదిలోకి చేర్చి వుంటారు. తలంతా దిమ్ముగా వుంది. ఈ లక్షణాలు ఘాటయిన మత్తుమందు పీలిస్తేవస్తాయి. తను ధరించిన దుస్తులు విప్పేసి, పరీక్ష చేసి వుంటారు. పాపం వాళ్ళ పరీక్ష వృధా అయివుంటుంది. ఇప్పుడు తనేంచెయ్యాలి?

రాజారావు లేచి, పాంటు షర్టు కోటు ధరించాడు. క్రాపు సరిగ్గావుందో, లేదో అని క్రాపుని చేత్తోనే సరిచేసుకున్నాడు.

రాజారావు తలుపుదగ్గరకొచ్చి తలుపుమీద కొట్టాడు. అవతలివైపునుంచి ఎవరూ పలకలేదు.

రాజారావు వూరుకోలేదు తలుపుమీద దరువువేస్తూనే వున్నాడు.

కొద్దిసేపు తర్వాత రాజారావు శ్రమ ఫలించింది.

బైటనుంచి తలుపుతీస్తున్న శబ్దం అయింది.

బర్రున వక్కసారిగా తలుపులు తెరవబడ్డాయి.

తలుపుకి ఆవతల నలుగురు మనుషులున్నారు. వాళ్ళ చేతిలో పిస్టల్స్ వున్నాయి. అందులో ఒకతని భుజానికి తుపాకీ వేళాడుతున్నది.

పిస్టల్స్ సూటిగా రాజారావు వేపు గురిపెట్టబడి వున్నాయి.

"నమస్తే" అన్నాడు రాజారావు చేతులుజోడించి.

వాళ్ళు నలుగురు వకరిముఖాలు వకరు చూసుకున్నారు.

"మెలుకువ వచ్చిందా?" బుంగమీసాలవాడు రాజారావుని అడిగాడు.

"ఆ...ఇంతకుముందే మెలుకువ వచ్చిందండి. ఎవరూ రాకపోవటంతో తలుపుతట్టాను" వినయంగా సమాధానం యిస్తూ ఓ అడుగు ముందుకేశాడు రాజారావు.

"అక్కడే" భీకరంగా అరిచాడు వాళ్ళలో వకడు.

"ఎందుకండి! నే బైటికి రాకూడదా?"

"అమాయకంగా మాట్లాడకు, మా చేతిలోవున్న వేమిటో తెల్సుగా, కన్నుమూసి తెరిచేటప్పటికి ప్రాణం హరీ అనిపిస్తాయి."

"తెల్సు. అప్పుడప్పుడు సినిమాలలో చూస్తుంటాను. వీటిని రివాల్వరనో, పిస్టలనో అంటారు."

"తెలివి తక్కువ వెధవగా మాట్లాడి తప్పించుకోవాలని చూస్తున్నావేమో! ఆ పప్పులేం మావద్ద వుడకవు. మా బాస్ దగ్గరకు తీసుకెళుతున్నాము. అక్కడ చూపించు నీ ప్రతాపం."

"అలాగే" అన్నాడు రాజారావు ఏ భావం వ్యక్తం చేయకుండా.

వాళ్ళలో వకతను ముందుకొచ్చి రాజారావు చేతులకి బేడీలేశాడు.

ఇద్దరు ముందు, ఇద్దరు వెనక నడవగా రాజారావు వాళ్ళ మధ్యనుండి చేతికి బేడీలతో నడిచాడు.

నడుస్తూ నలువైపులా చూపులుసారిస్తున్న రాజారావు, 'ఇది బలంగా భూగర్భంలో నిర్మించిన గోడవున్. దీనిపై ఇల్లుగాని, ఫాక్టరీలాంటిదిగాని నిర్మించి వుండవచ్చు,' అనుకున్నాడు.

వాళ్ళు నలుగురు రాజారావుతో లిఫ్ట్ ఎక్కారు.

# 6

"అయ్యా! మీరు అనువందలసార్లు అడిగినా, నే చెప్పేది యిదే. నాపేరు రాజారావు. నేనేం అనంత పద్మనాభశాస్త్రిలా అవతారం దాల్చలేదు. ఆ అవసరం నాకు లేదు. వాడిపోలికలు నాకుండటం నా నేరంకాదు," అన్నాడు రాజారావు.

రాజారావుచుట్టూ ఆయుధాలతో పదిమంది వున్నారు. రాజారావునుంచునే వున్నాడు. చేతికి బేడీలు అలాగే వున్నాయి. రాజారావు ముందు ఒకతను వున్నాడు. అతనే వాళ్ళకి బాస్. ముఖం వికృతంగా వుంది. ఖరీదైన సూట్ మాత్రం వేసుకుని వున్నాడు.

"అరిగిపోయిన రికార్డులా ఒకటేమాట. నీ నోటంట నిజం ఎలా పలికించాలో నాకు బాగా తెల్సు. మావద్ద నున్న హింసా విధానాలన్నిటిని రుచిమాపి నరకం ఎక్కడో లేదని తెలియజేస్తే, అప్పుడు నీవే కాళ్ళబేరా

కొచ్చి నిజం చెపుతావు" అన్నాడు బాస్.

"నేను మీకేం అపకారం చేశాను?" అన్నాడు రాజారావు.

"అపకారం ఏం చేశానని అడుగుతున్నావా? ఈ వేషంలో నాకోసం బైలుదేరివచ్చావు చాలదూ! యింతకు నీవు సి.ఐ.డీ.వా? కేటుగాడివా?"

"నేను సి.ఐ.డీ.నో, కేటుగాడినో నన్ను వేధిస్తూ అడిగేబదులు, ఓ సారి రంగూన్ వెళ్ళొస్తే సరిపోతుంది."

"రంగూన్ దేనికి?" బాస్ అనుమానంగా రాజారావుని చూస్తూ అడిగాడు.

"నా అడ్రస్ వివరంగా యిస్తాను. రంగూన్ వెళ్ళి నా గురించి వివరం సేకరించండి. మీ అనుమానం నివృత్తి అవుతుంది. కలప ఎగుమతిచేసే ఓ చిన్న వ్యాపారస్తుడిని. రెండు నెలలు రెస్ట్‌గా వుంటుందని అలా అలా వూళ్ళు చూసుకుంటూ బైలుదేరి ఈ వూరు వచ్చాను. ఈ వూళ్ళో కాలుపెట్టిన దగ్గరినుండి, నీవు అనంతపద్మనాభశాస్త్రి వంటూ ప్రతివాడూ ప్రాణంతీయటమే. అయినా ఆ వెధవకి నాకు పోలికలుండటం నా నేరమా?"

బాస్ నిర్లక్ష్యంగా తల ఎగరేసి, రెండడుగులు ముందు కేసి, రాజారావువెపు హేళనగా చూశాడు.

"ఊ... అర్థమయింది. నువ్వే అనంతపద్మశాస్త్రివి. మరి యిదేంటి మేకతోలు కప్పుకున్న ముఖం. మారు వేషమా?" అన్నాడు రాజారావు అమాయకంగా.

"నేనుకాను. అనంతపద్మనాభశాస్త్రి నాకు కావాలి వాడి రూపం దాల్చిన నీవు పక్కా మోసగాడివి. రాజారావు పేరుతో ఈ వూళ్ళో తిరుగుతున్నావు. అసలు

అనంతపద్మనాభశాస్త్రి ఏమయ్యాడు? నీకా వేషం ధరించే అవసరం ఏమిటా, అని నిన్ను బంధించాము. ఊఁ యిప్పుడు చెప్పు...నీ అసలు పేరు! అసలు కథ...!"

"ఆగండాగండి. మీరే అనంతపద్మనాభశాస్త్రని పొరపడ్డాను. ఇంతకీ మీకు అనంతపద్మనాభశాస్త్రితో ఏమవుసరమో?"

"అది నీ కనవసరం."

"మంచిది. అది నా కనవసరం అయితే ఇదీ నీ కనవసరం. నా పేరు రాజారావు నా యిష్టం వచ్చినట్లు తిరుగుతాను."

"జాప్యం చేస్తే నీకు యమలోకం చూపించాల్సి వుంటుంది."

"ఎలాగూ టూర్ బైలుదేరాను. యీదోవన అదీ చూసిపోతాను."

బాస్‌కి పిచ్చికోపం వచ్చింది.

"ఊఁ...ఒకేఒక ప్రశ్నకు సమాధానం యివ్వు. లేకపోతే, ఈ నిమిషంనుంచి మావాళ్ళ చేతిలో నల్లిలా నలిగి పోతావ్. నువ్వెవరు? ఈ వేషంలో ఎందుకొచ్చావ్?"

రాజారావు కళ్ళు మూసుకుని ఆలోచించి ఓ నిర్ణయానికొచ్చి కళ్ళు తెరిచాడు.

"నిజం చెపుతాను. కాని మీ వాళ్లెవరు మనదగ్గర వుండటానికి వీలులేదు."

"ఆల్ రైట్" అని తన అనుచరులవైపు తిరిగి "ఇతని కాళ్ళు చేతులు బంధించి, మీరంతా బైటికి వెళ్ళండి" అన్నాడు బాస్.

బాస్ అనుచరులు రాజారావు చేతులకి కాళ్ళకి ఇనప

గొలుసులు తగిలించారు. ఆ తర్వాత గదిలోంచి అంతా బైటికి పోయారు.

"నా జాగ్ర త్తకోసం బంధించాను. అంతే. ఆc... యిహ అసలు విషయానికి రా." అన్నాడు బాస్.

"అలాగే. కాని ఓ పనిముందుగా చెయ్యాలి. అది మన మధ్య వప్పందం అనుకున్నా సరే, మరేమనుకున్నా సరే."

"ఏమిటది?"

"నేనెలాగూ నీ చేతిలో చిక్కాను. ఏ దైవమో ప్రత్యక్షమయి సహాయం చేస్తే తప్ప యిక్కడినుంచి పారిపోలేను. నాగురించి నే నిజం చెప్పేముందు, నేను అనంతపద్మనాభశాస్త్రిలా వుంటే ఏమిటి? అతనికి నీకు శత్రుత్వం ఏమిటి! మీ మధ్య ఏదో కథ వుండే వుంటుంది. ఆ నిజం చెపితే, నేను నిజం చెపుతాను. లేదంటే మాత్రం నా నోట్లోంచి ఒక్కమాట రాదు. యమచర పెట్టినా సరే, యమలోకానికి పంపినా సరే," రాజారావు గట్టిగా చెప్పేశాడు.

బాస్ ఒక్క నిముషం ఆలోచించి, "ఆల్ రైట్" అని రాజారావుకి దగ్గరగా జరిగాడు.

"జరిగింది టూకీగా చెప్పేస్తాను. అనంతపద్మనాభ శాస్త్రి, సుందరమూర్తి ముఖ పరిచయస్థులు. ఓసారి వారికో గుప్తనిధి రహస్యం తెలిసింది. ఈ వూళ్ళో వుండగానే వారికా నిధి రహస్యం తెలును. జరుగుబాటు కావటంలేదు, ఉద్యోగం దొరకటంలేదు, అని అందరితో చెప్పి, వున్నకొద్దిపాటి ఆస్తి అమ్ముకుని, మిత్రులు రంగూన్ వెళ్ళారు. పైకి వ్యాపారం చేసుకోటానికని చెప్పారు.

రంగూన్‌లో వ్యాపారం చేస్తూనే, నిధి చేజిక్కించుకున్నారు. కాని, అంతవరకూ బాగున్న వారి బుద్ధి నిధిని చూడంగానే వక్రించింది. సుందరమూర్తి అంత నిధిని చేజిక్కించుకుని అనంతాన్ని మోసంచేసి పారిపొయ్యాడు. అనంతం చావలేదు. కాబట్టి సుందరమూర్తికి అనంతంవల్ల ఎప్పటికైనా ప్రమాదం. క్లుప్తంగా యిదీ కథ. ఇహ నీ సంగతి చెప్పు!" బాస్ కథ ముగిస్తూ అన్నాడు.

"మిత్రులిద్దరిలో నీవు సుందరమూర్తివా? అనంతపద్మనాభశాస్త్రివా?" రాజారావు అడిగాడు.

"ఆమాత్రం గ్రహించలేవా?"

"గ్రహించాను. నీవేం చెపుతావో అని...!"

"సుందరమూర్తిని."

"అంటే అనంతాన్ని మోసంచేసింది నీవేనన్నమాట."

"ఆ విషయం నీ కనవసరం. నీ కథ కానియ్యి."

"మిస్టర్ అనంతపద్మనాభశాస్త్రీ! కథ సగం నిజం చెప్పినా మిగతాది బాగా అల్లావ్! సుందరమూర్తి అని పేరు పెట్టుకున్నావ్ గాని నీవే అనంతానివి. సుందరమూర్తిని మోసం చేసింది నీవే. నీ మారువేషం నా కళ్లు గప్పలేదు" గంభీరంగా అన్నాడు రాజారావు.

"ఎలా తెల్సుకున్నావ్?" కంగారుగా అడిగాడు బాస్.

"నీవు నీవే కాబట్టి" రాజారావు తాపీగా అన్నాడు.

బాస్ అని పిలవబడే అనంతపద్మనాభశాస్త్రి తన గుట్టు బయటపడటంతో కళ్ళు ఎర్రబడ్డాయి. కోపంతో పళ్ళు కొరికాడు. చేతిలో రివాల్వర్ సూటిగా రాజారావు వైపు గురిపెట్టాడు.

"వప్పుకుంటున్నాను. నేనే అనంతపద్మనాభ శాస్త్రిని. అవసరాన్నికి నేను మారువేషంలో వున్నాను. ఇంతకీ నీవెవరు? నా సంగతి నీకెలా తెలుసు? నాలాగా తయారయి ఈ వూళ్ళో ఎందుకు తిరుగుతున్నావు? ఊ... తొందరగా చెప్పు. మాటమార్చ జూశావో టైమ్ వృధా చేయను. ఒకే గుండు చాలు!" అన్నాడు అనంతపద్మ నాభశాస్త్రి రివాల్వర్ ని సూటిగా రాజారావుకి గురి పెట్టి.

అనంతపద్మనాభశాస్త్రి రాజారావుతో మాట్లాడు తున్నపుడు వెనుక తలుపులు మెల్లిగా తెరుచుకున్నాయి. ఒకతను లోపలికి వచ్చాడు. అతని రెండు చేతుల్లో రెండు పిస్టల్స్ వున్నాయి.

"అనంతం! వక్కసారి యిటు తిరుగు."

తన వెనుకనుంచి మాటలు వినపడటం చూసి, గిరు క్కున వెనుతిరిగాడు అనంతపద్మనాభశాస్త్రి...

## 7

ఎదురుగా రెండు చేతుల్లో రెండు పిస్టల్స్ ధరించిన ఆగంతకుడిని చూసి బిత్తరపోయాడు అనంతపద్మనాభ శాస్త్రి. "ఎవరు నువ్వు?" కంగారుగా అడిగాడు.

"నా కంఠస్వరం గుర్తుపట్టలేదా అనంతం?"

"నువ్వు...సుందరమూర్తీ!"

"గుడ్. కనుక్కున్నావ్. నే మారు వేషంలో వున్నాను. అయినా స్వరం పోల్చుకున్నావ్. నీ తెలివిని మెచ్చుకుంటున్నాను."

వచ్చింది తన పక్కలో బల్లెంలాంటి సుందరమూర్తని తెలియంగానే ఏమాత్రం ఆలశ్యం చేసినా తన ప్రాణా

నికే ముప్పని గ్రహించి రివాల్వర్ పేల్చాడు అనంతపద్మ నాభశాస్త్రి.

సుందరమూర్తికి గుండు తగలకపోవటం అటుంచి, రివాల్వర్ అసలు పేలనేలేదు!

సుందరమూర్తి ఫక్కున నవ్వాడు.

అనంతపద్మనాభశాస్త్రి తెల్లబోయాడు.

"సమయం మించిపోయింది అనంతం! కాలం ఎవరి చేతుల్లో వుండదు. తెలివి నీ ఒక్కడి సొత్తు అనుకోకు. నీ రివాల్వర్‌లో గుండ్లు కాదుకదా ఆఖరికి గులకరాళ్ళు కూడా లేవు..."

"నీవెలా వచ్చావ్ యిక్కడికి?" అడిగాడు అ... ప...శాస్త్రి.

"తెలివితేటలు వుపయోగించి."

"అది తెలుస్తూనే వుంది. ఇది నా ఇల్లు. ఇక్కడ నా చేతుల్లో వున్నారు ప్రాణాలకు తెగించిన నరరూపరాక్షసులులాంటి మనుషులు."

"ఇది నీ యిల్లుకాదు. నీ స్థావరం. రెండోకంటివాడికి తెలియకుండా మేడక్రింద చీకటిగదులు కట్టించావు. రూపం మార్చావు. చేతికింద రౌడీలను పెట్టుకున్నావు. పాపం! ఇన్నిజాగ్రత్తలుపడ్డా నా కంటపడక తప్పలేదు. అది నీ ఖర్మ!

"దొరికిన గుప్తధనాన్ని న్యాయంగా మనిద్దరం అనుభ వించాలి. న్యాయంగా రావాల్సింది నాకు సగం వాటా. పోనీ పావు వాటా అన్నా యిచ్చావా? ఉహూ, ఏమి చ్చావ్?"

"మంచిగా మెలిగి మొత్తం ఓ చోటుకి చేర్చి

యిరువురం పంచుకుందామన్నావ్, అలాగే చేశాం. ఆపై నీవేం చేశావ్? నన్ను మోసంచేసి వుడాయించావ్! నన్ను చంపమని రౌడీలను నియమించావ్. వాళ్ళను తప్పించుకున్నాను నేను. ఈ సంగతి నీకు తెలిసింది. రంగూన్‌నుంచి మకాం మార్చావు.

“కొందరు రౌడీలకు బాగా డబ్బు ముట్టజెప్పి నా శవంగాని, నన్నుగాని తెమ్మని పురమాయించావు. మారు వేషంలో నేనూ ఓ రౌడీగా తిరుగుతున్నందున ఈ విషయ మైతే తెల్సిందిగాని, నీవెక్కడ వున్నావో తెల్సింది కాదు. ఓ పక్క నీవు నియమించిన మనుషులవల్ల ప్రాణ భయం. మరోపక్క నీవు చేసిన మోసం నన్ను నిలువునా దహించివేస్తున్నది. అది సహజమే కదా అనంతం? ఏమంటావ్?” అన్నాడు సుందరమూర్తి వెటకారంగా.

అనంత పద్మనాభశాస్త్రి మౌనం వహించాడు.

“సరే, అసలు కథలోకొస్తాను. మారువేషంలో తిరుగు తున్న నేను కొంత డబ్బు సంపాదించాను. అవసర మయితే ఢీకొనటానికి అంగబలం ఏర్పరుచుకున్నాను. రోజులు బాగానే గడచిపోతున్నాయి. కాని నీవు నన్ను మోసగించావు. ఆ విషయం మాత్రం పుండుమీద పుల్ల బెట్టి కెలికినట్లు ప్రతి నిమిషం కన్ను మూసినా తెరిచినా నా అంతరంగంలో ముల్లులా గుచ్చుకుంటూనే వుంది.

“నీమీద పగ తీర్చుకుంటేగాని నా బాధ చల్లారదు. నా కసి తీరదు. ఎలా? నీ వెక్కడున్నావో తెలియదు. ఎంతదూర పారిపొయ్యావో తెలియదు. మారువేషంతో తగిన జాగ్రత్తవహించి ఏ మారుమూలో తలదాచుకుని వుంటావని వూహించానుగాబట్టి, నిన్ను బైటికి రప్పించ

టానికి రకరకాల ప్లాన్లు వేశాను.

"చివరిగా ఈ ప్లాన్ ఫలించింది. ఇప్పుడు నీ స్థావరం నాదయింది. నీ అనుచరులు నా అనుచరులయారు. ఎదురు తిరిగినవాళ్ళు పరలోకం ప్రయాణం కట్టారు. అక్కడి కెళుదువుగాని నీవూ సిద్ధంగా వుండు."

"నేనెన్నో జాగ్రత్తలు తీసుకున్నాను. ఇదెలా తారుమారు అయింది" అన్నాడు శాస్త్రి ఆశ్చర్యంగా.

"కారణం నువ్వే! నీ పోలికలున్న రాజారావుని నాకు తెలిసిన అన్ని ప్రదేశాల్లోనూ తిప్పాను. నీ ఆచూకీ తెలియలేదు. ఉంటే నీవు ఈ ఊళ్ళో వుండాలి లేకపోతే ఏ విదేశాలలోనయినా వుంటావని తలచి రాజారావుతో ఈ వూరు చేరాను.

"అచ్చం నీలాగ వున్న రాజారావుని చూడంగానే నీలో దాగున్న భయం నిన్ను బైటకి లాక్కొచ్చింది. రాజారావుని నేనే నియమించి వుండవచ్చునని రాజారావు వెనుక పహరా కాశావు. నీకోసం చూస్తున్న నేను ఏమాత్రం ఆలశ్యం చేయకుండా నీ స్థావరం ఆక్రమించుకున్నాను. ఇదీ జరిగింది.

"అయిందేదో అయింది. దాన్ని గురించి ఇరువురం మర్చిపోదాము. ప్రస్తుతం చేయాల్సింది శిక్ష అమలు జరపటం. ఎంత చెడ్డా నీవు నా మిత్రుడివి. నీవేవిధంగా కోరుకుంటే అలాగే చేస్తాను. ఈ పిస్టల్‌కి పని కల్పించి తేలికగా ఒక్క గుండుతో ప్రాణం తియ్యమంటావా? లేక అన్నం నీళ్ళు లేకుండా నిన్ను ఓ గదిలో బంధించి ఎన్నాళ్ళు బ్రతికుంటావో చూడమంటావా? నీ యిష్టం! నీవెలా చెపితే అలా మాట తప్పను. కోరుకో, ఎలాంటి

చావు కావాలో?" అన్నాడు సుందరమూర్తి విలాసంగా నవ్వుతూ.

అనంత పద్మనాభశాస్త్రి పై ప్రాణాలు పైనే పోయాయి. భయంతో వణికిపోతూ, "నే చేసింది తప్పేరా సుందరమూర్తీ! ఈ వక్కసారికి క్షమించు" అన్నాడు దీనంగా ముఖంపెట్టి.

"క్షమించాను గాబట్టే తీరుబడిగా కథ చెప్పాను. క్షమ అయిపోయింది. మిగిలింది శిక్ష. ఇది అమలుజరప బడుతుందిగాని ఎట్టి పరిస్థితులలో తొలగింపబడదు. కోరుకో, ఎటువంటి చావు కావాలో! నీ ఇష్టానుసారమే చేస్తాను," వంకాయకూర వడ్డించమంటూరా! టమేటా పచ్చడి వేయమంటూరా? అనివినయంగా అడిగేయిల్లాలిలా అడిగాడు సుందరమూర్తి.

"నా వాళ్ళంతా ఈ గదిబైట వున్నారు. వాళ్ళంతా నాకోసం ప్రాణాలిచ్చే రకం. వాళ్ళు మారారన్న నీ మాట ఎలా నమ్మమంటూవ్?" ఏదోవిధంగా తప్పించుకోవాలని చూస్తున్నాడు అనంత పద్మనాభశాస్త్రి.

సుందరమూర్తి ఫక్కున నవ్వి, పిస్టల్ని నూటిగా అలాగే చేతిలో వుంచుకుని, మరోచేత్తో తలుపుతీసి చిటిక వేశాడు. బిలబిల లాడుతూ పదిమంది లోపలికొచ్చారు.

"మీ బాస్ నేనా? ఈ అనంతంగాడా? చెప్పండి ఫ్రెండ్స్!" గంభీరంగా అన్నాడు సుందరమూర్తి.

"మీరే మా బాస్, మీరే మా మిత్రులు. గురువు సర్వం!" సుందరమూర్తివైపు చేతులు చాచి, ఏకకంఠంతో అన్నారు పదిమందీ.

"గుడ్! ఊ...యిహ చెప్పవోయ్ అనంతం! ఏ శిక్ష నీకు విధించమంటావ్?"

"నన్ను చంపవద్దు. ప్లీజ్! నా ఉప్పు తింటూ నాకే ద్రోహం తలపెట్టిన వీరిని నిలువునా నరికి పోగులు పెట్టనియ్యి," ఆవేశంతో వూగిపోతూ పిచ్చిపట్టినట్లు అరిచాడు అనంత పద్మనాభశాస్త్రి.

"అహ్హాహ్హా...ద్రోహం చేసినందుకు శిక్ష నరికి పోగులు పెట్టటమా? నువ్వూ చేశావు ద్రోహం నమ్మిన మిత్రుడికి. ఆలశ్యం దేనికి అదే శిక్ష నీపై అమలుజరపబోతున్నాను. రెడీగా వుండు. స్టడీ...వన్...టూ..."

# 8

"ఆగండి!" అంతవరకూ బంధింపబడివున్న రాజారావు పెద్దగా అరిచాడు.

సుందరమూర్తి 'త్రీ' అనటం ఆపి, రాజారావువైపు తిరిగాడు.

"ఆగటం దేనికి? ముందు నిన్ను చంపి ఆపై అనంతాన్ని చంపనా?" అన్నాడు.

"కాదు. నన్ను వాడుకుని, నావల్లమీ మిత్రుడిని కనుక్కొని, నన్నిలా యింకా బంధించి వుంచటం న్యాయ్యం కాదు. ముందు నన్ను బంధవిముక్తుడిని చేయండి," అన్నాడు రాజారావు.

"చేస్తాలేవోయ్! నిన్ను వాడుకున్నానంటున్నావ్. ఊరికే పనిచేసి పెట్టావా? ముందుగా పదివేలిచ్చాను. పనయింతరువాత యింకా యిస్తానన్నాను. మన వప్పందం యాభైవేలు. గుర్తుంది. ముందు ఈ అనంతంగాడి చావు చూడు...వన్...టూ..."

"ఆగండి" మళ్ళీ అరిచాడు రాజారావు.

"శకున పక్షిలా ఏమిటా అడ్డం. ముందు నీ ప్రాణం తీయమంటావా?" సుందరమూర్తి పట్టరాని కోపంతో అడిగాడు.

"కిచికిక చే కోచికికాచే కీకీకీ" అన్నాడు రాజారావు ఏదో వింతగా.

అంతే! క్షణంలో పరిస్థితులు తారుమారు అయాయి.

అక్కడున్న రౌడీలు జేబుల్లోకి చేతులు పోనిచ్చారు. చటుక్కున రివాల్వర్లు బైటికి తీశారు.

రెండు రివాల్వర్లు వెంటనే పేలాయి.

సుందరమూర్తి "అబ్బా" అని బాధతో గావుకేక పెట్టి, తన చేతుల్లో పిస్టల్స్ వదిలేశాడు. గచ్చు నేలమీద ఖంగుమంటూ శబ్దం చేశాయి అవి.

చకచక రెండు పిస్టల్స్‌ని వకడందుకున్నాడు. ఇంకొకడు రాజారావు కట్లు విప్పాడు.

ఇద్దరి చేతిలోని రివాల్వర్లు అనంతపద్మనాభశాస్త్రికి, సుందరమూర్తికి గురిపెట్టబడి వున్నాయి.

"ఎవరు నీవు? ఏమిటీ అన్యాయం?" అన్నాడు సుందరమూర్తి.

జరుగుతున్న దేమిటో తెలియక బిత్తరపోయి చూస్తూ వుండిపోయాడు అనంతపద్మనాభశాస్త్రి.

రాజారావు బద్ధకంగా ఓసారి వళ్ళు విరుచుకుని, కాళ్లూ చేతులు విదిలించుకుని సరిగనుంచున్నాడు.

"డియర్ ఫ్రెండ్స్. నే కోడ్‌లో చెప్పగానే క్విక్‌గా అందుకుని, అంతకన్నా క్విక్‌గా పనిచేశారు గుడ్!" అక్కడున్నవారితో అని సుందమూర్తివైపు, అనంతపద్మ

నాథశాస్త్రి వైపు తిరిగాడు రాజారావు.

"అనంతపద్మనాథ శాస్త్రి గారూ! సుందరమూర్తి గారూ! జరిగింది చూస్తుంటే మీకంతా అయోమయంగా వుందికదూ? రెండు ముక్కల్లో జరిగింది చెపుతాను. మీకే అర్థమవుతుంది. వినండి...

"ఓ రోజు నేను కాకా హోటల్లో టీ తాగుతున్నాను. అప్పుడు నా రూపం నలిగిపోయిన దుస్తులు వాడినముఖం మధ్యరకం సంసారంలో పుట్టినవాడు చదువుకుని నిరుద్యోగిలా వుంటాడే అలా వున్నాను.

"అదే హోటల్లో టీ తాగటానికి సుందరమూర్తి నీ వొచ్చావ్. నన్ను అదేపనిగా చూడటం మొదలుపెట్టావ్. తర్వాత నన్ను పలకరించావు. బి.ఏ. పాస్ అయి మూడేళ్ళయిందని..నిరుద్యోగంతో బాధపడుతున్నానని..నీతో చెప్పాను. అప్పుడు నీవు నాకు వుద్యోగం యిప్పిస్తానని, పెద్ద హోటల్ కి తీసుకెళ్ళి ఆ వుద్యోగమేమిటో చెప్పావ్.

"నా మిత్రుడు నన్ను మోసంచేసి, మారువేషంతో ఏ మూలో తలదాచుకుంటున్నాడు. నా మిత్రుడు అనంతం పోలికలు నీలో వున్నాయి. అతనిలా నిన్ను తయారు చేస్తాను. నడక మాటల అలవాట్లు అన్ని నేర్పుతాను. నీవు చేయవలసిందల్లా నాతోపాటు నే తిరగమన్న వూరు తిరగాలి. ముందు పదివేలు యిచ్చి, ప్రతి నెలా వెయ్యి రూపాయలిచ్చి, అనంతం కనపడితే నలభైవేలు యిస్తా, నని చెప్పావు. నేను సరేనన్నాను.

"ఎన్ని ఊళ్ళో, ఎన్ని ప్రదేశాలో తిరిగాము. ఫలితం కనపడలేదు. ఉన్న వూరు వచ్చాము. అనంతం యిక్కడే వున్నాడు గాబట్టి బైటపడ్డాము. ప్రతి నిమిషం లాంగ్

కోటు, నెత్తిన హేటు, నల్ల కళ్ళద్దాలు మారువేషంలో వున్న నీవు నన్ను అనుసరిస్తూనే వున్నావు నాకు సూచనలిస్తూనే వున్నావు.

"అనంతం నేనెవరయివుంటానా అని ఆరాతీస్తూ తన దృష్టి నాపై మళ్ళించాడు. సమయం సద్వినియోగం చేసుకుని అనంతం మనుషులని, స్థావరాన్ని నీవు వశంచేసుకున్నావు. అంతేకదా, సుందరమూర్తీ యిప్పటివరకూ జరిగింది?" జరిగిన కథంతా చెప్పి అడిగాడు రాజారావు.

"ఇంతకీ నీవెవరు? నేను నియమించిన నీవు, నాపై తిరుగుబాటు చేయటం ఏమిటి?" సుందరమూర్తి తీవ్రంగా అడిగాడు.

"వస్తున్నా బ్రదర్! అక్కడికే వస్తున్నా. నేను ప్రభుత్వ సి. ఐ. డీ. ని. ఇంటలిజంస్ శాఖలో పని. ఓ కేసు నిమిత్తం నేను తిరుగుతుండగా నాలో నీకు అనంతం పోలికలు కనపడ్డాయి. అవసరానికి నన్ను వాడుకున్నావు.

"నీ విషయం నీ కథ నాకు అనుమానస్పదంగా తోచి, నీ గురించి ఎంక్వయిరీ చేశాను. నీవూ, నీ మిత్రుడు గుప్తధనం అని చెప్పావే- అది గుప్త ధనం కాదని మ్యూజియంకి తరలిస్తున్న కొన్ని విలువైన వజ్రాలను ప్లాన్ పన్ని కాజేశారని తెలుసుకున్నాను.

"నేను నా మిత్రులు రంగంలోకి దిగి అంటే, ఇలాగే నీ ప్లాన్‌తో కేసుని నరుక్కొద్దామని దిగాము. నీవు నన్ను కనిపెట్టి అనంతంకోసం వుంటే, మా వాళ్ళు అటు నిన్ను, ఇటు నన్ను, వేరేకంట అనంతంకోసం మారువేషాల్లో కనిపెట్టుతూ సమయం ఎప్పుడా అని రెడీగ వున్నారు.

"అనంతం మనుషులని నీవు డబ్బుతో వశపర్చుకున్నా

నని మురిసిపోయి, తెలివిగా ఇప్పుడు ఎదురుపడ్డావు. నీ ప్లాన్‌కి పైప్లాన్ నిన్ననే మావాళ్ళు వేశారు. అనంతం స్థావరం ఆక్రమించి రెడీగావున్నారు. ప్లానమీద ప్లాను పన్ని అందరు మారువేషం మనుషులుగా మారాము. ఇహ అసలు వేషాలకు మారి మా కర్తవ్యం మేము నిర్వహిస్తాం.

"ప్రభుత్వాన్ని మోసగించి మ్యూజియంకు తరలిస్తున్న విలువైన వజ్రాలను దొంగిలించినందుకు నిన్ను, అనంతంని అరెష్ట్ చేస్తున్నాము. తంతే ఎగిరి గారెలబుట్టలో పడ్డట్లు అని ఓ సామెత వుంది. ఓ కేసులో తిరుగుతున్న నా దగ్గరకు విధి నిన్ను తన్ని పడేట్లు చేసింది. ఇది గారెల బుట్ట కాదు. అంతే!'' నవ్వుతూ అన్నాడు రాజారావు పేరుతో నటించిన సి.ఐ.డి రాజశేఖరం.

సుందరమూర్తి తల వాలిపోయింది.

అనంతపద్మనాభశాస్త్రి ముఖం దించుకున్నాడు.

రాజశేఖరం అనుచరులు వారిద్దరికీ బేడీలు తొడిగారు.

—: ఐపోయింది :—




[పదకొండవ భాగము]

"ఏమిటి? ఏమైందిక్కడ? వాచ్ మెన్ ఏడీ?" అన్నాడతను అనుమానాస్పదంగా చూస్తూ...

నా ముఖంలో భావాలు చటుక్కున మార్చాను.

"ఫ్రెండ్! నాకు కాళ్ళూ, చేతులు ఆడ్డంలేదు. ప్రక్క కివెట్రిలోంచి కాన్యోరా కేక వినిపించింది 'పాము... పాము'అంటూ... మీ వాచ్ మెన్ లోపలికి వెళ్ళాడు. తర్వాత ఏ శబ్దమూ వినబడ్డేదు. ప్లీజ్ నువ్వు చూడు. పాము యిద్దర్నీ కాటేసిందేమో" అన్నాను బెంబేలు పడిపోతూ.

"నువ్వు కదలక!" రైఫిల్ నా గుండెల్లో గుచ్చుతూ అన్నాడతను కర్కశంగా.

ఎడం చేత్తో మెల్లిగా తలుపు లోపలికి తోసాడు.

వెను వెంటనే అతని ముఖంలో రంగులు మారటం నేను గమనించాను.

"లోపల ఆమె లేదు. వాచ్ మెన్ అడ్డంగా పడి వున్నాడు. వాట్ హేపెండ్? చెప్పు. ఏమైంది" అరిచాడతను బాయినెట్ ఎత్తి ఛాతీమీద చర్మంలోకి గుచ్చుతూ.

"ప్లీజ్. యిది తీసెయ్. నాకు ఏమీ తెలియదు" అన్నాను వేడికోలుగా.

అంతే!

ఠప్పున శబ్దమైంది అతని తల!

అదే సమయంలో జర్క్ తీస్తూ పక్కకి గెంతాను.

రైఫిల్ జారిపోవటం, అతను గింగిరాలు తిరుగుతూ నేలమీదకు విరుచుకు పడ్డం—ఒకేసారి జరిగాయి.

గాల్లోకెత్తిన రైఫిల్ బట్‌ని దించుతూ అతని వెనుక కాన్స్యేరా విజయగర్వంతో నిలబడివుంది.

"వెల్ డన్ కాన్స్యేరా! కోబ్రా వచ్చే టైమయింది. నువ్వు కోబ్రా గదితాళం పగలకొట్టి రేషన్ సామగ్రి తీసుకురావాలి. యిదిగో...యిక్కడ మూడు గుర్రాలు వున్నాయి. రెండు సిద్ధం చేస్తాను. వెనుక భాగం నుంచి పారిపోవాలి మనం. ముందువైపు సర్వెంట్స్ కాటేజి లున్నాయి. పైగా కోబ్రా ఎదురయ్యే ప్రమాదంవుంది. ఐ వాంట్ ఫాస్ట్‌యాక్షన్."

కాన్స్యేరా ఓ రైఫిల్‌తో అక్కడ్నించి మాయమైంది.

రెండో రైఫిల్ కలెక్టు చేసుకుని పెద్దపెద్ద అంగలు వేస్తూ స్టేబుల్ వైపు నడిచాను.

*　　　*　　　*

గుర్రాలమీద జీను వేసి మచ్చిక చేసుకోడానికి వాటి మెడ నిమురుతూ అసహనంగా ఎదురు చూస్తున్నాను శాన్యోరా కోసం...

అయిదు నిముషాల్లో ప్రత్యక్షమైంది శాన్యోరా సగం నిండుగావున్న ఓ గోనె సంచిని మోసుకొస్తూ.

"ఏం దొరికాయ్?" అడిగాను గుర్రాన్ని బయటికి లాగుతూ. "వాటర్ కాన్, బ్రెడ్స్, టాఫియ, సిగరెట్స్ మాచెస్, బైనాక్యులర్స్, రెండు జతల కోబ్రా బట్టలు, అద్దం, దువ్వెన కూడా" అందామె జీను సవరించి గుర్రం పైకి ఎక్కుతూ.

"భయంకర్! నీకు హార్స్ రైడింగ్ వచ్చునా? లేక పోతే నా గుర్రం ఎక్కు" అందామె గుర్రంమీద సామగ్రి సవరిస్తూ.

నవ్వుతూ శాన్యోరా వేపు చూసాను "మైడియర్ మాజీ లేడీ స్పై! నేను కావల్రీలో కూడా కొన్నాళ్ళు పని చేసాను. మోకాలు హుక్ లో పెట్టి గుర్రాన్ని అధిరోహించాను.

యిద్దరం పగ్గాలు కదిపాం.

పెద్దగా సకిలిస్తూ గుర్రాలు ఓసారి రెండు కాళ్ళమీద పైకిలేచాయి. మళ్ళీ ప్రయత్నించాను గుర్రం వీపు తడుతూ.

ఈ సారి బాణంలా ముందుకు దూకాయవి.

అంతే! వెనకాలవైపు చెక్కల ఫెన్సింగ్ టపటపా విరిగింది.

సరిగ్గా అదే సమయంలో దూరంగా జీపు శబ్దం వినిపించింది!!

"శాన్యోరా! ప్రమాదం తరుముకొస్తోంది. మేకిట్ గాలప్." అర్చాను బూటు కాలితో గుర్రం పక్కలో పొడుస్తూ.

మరుక్షణం రెండు గుర్రాలూ, అడివిలోకి అఘ మేఘాలమీద పరిగెట్టాయి.

* * *

అప్పటికి రెండు మైళ్ళు దాటి అడివిలో ప్రయాణించాం...ముందు నా గుర్రం పరిగెడుతోంది...

వెనకాల శాన్యోరా గుర్రపు డెక్కల చప్పుడు వినబడ్తోంది.

తీవ్రంగా ఆలోచిస్తున్నాను.

మేము బయలుదేరినప్పుడే దగ్గరవుతున్న జీపు చప్పుడు వినబడింది. అంటే కోబ్రా ఈపాటికి విషయం తెల్సి మమ్మల్ని జీప్‌లో వెంటాడుతూవుంటాడు.

ఉన్నట్టుండి తటాలున ముందుకి తూలబోయి నిలదొక్కుకున్నాను.

అప్పటికే ఆలస్యమైపోయింది. నా గుండెలో రైళ్లు పరిగెత్తసాగాయి.

గుర్రం ముందు రెండు కాళ్ళు నేలలో కూరుకుపోతున్నాయి......ఏమయింది?

వాలిపోయిన గుర్రంమీంచి చటుక్కున దిగానుకిందికి.

నా గుండెలు దడ దడలాడాయి.

నేను అడుగులు వేసిందికూడా ఊబి నేలమీద నే?

"శాన్యోరా! స్టాప్ యువర్ హార్స్" అన్నాను ఊబిలో

గింజుకుంటూ.

ఊహించని పరిణామం అది!

వెనకాల వస్తున్న శాన్యోరా బలంగా ఆపింది గుర్రాన్ని!

నా మోకాళ్ళు ఊబి నేలలోకి మెత్తగా దూసుకు పోతున్నాయి!!

ఊబిలో సకిలిస్తూ గింజుకుంటున్న గుర్రాన్ని ఆధారంగా బలంగా పట్టుకున్నాను. యిప్పుడు గుర్రం, నేనూ కూడా కదిలేకొద్దీ జారిపోతున్నాం...

"భయంకర్! భయంకర్!"

భయాందోళనలతో ముందుకి వస్తున్న శాన్యోరాని చూసి హడలిపోయాను.

"శాన్యోరా! ఆగు! ఒక్క అడుగుకూడా ముందుకి వేయక! నాముందు ఉన్నదంతా భయంకరమైన ఊబి నేల. అడుగు ముందుకి వేసావో నాతోపాటు పాతాళం లోకి దిగిపోతావు. జాగ్రత్తగా ఆలోచించి తెలివిగా ప్రవర్తించు!!" అన్నాను గట్టిగా.

మరమనిషిలా నిలబడిపోయింది శాన్యోరా...

క్షణ క్షణానికీ ఊబిలో దిగబడిపోతున్నాను.

భయంకరమైన ఊబి.

కాలికింద ఆధారం లేదు!

మరో అరనిముషంలో నా ముఖం కప్పబడిపోతుంది.

ఊబిలో గింజుకుంటున్న గుర్రాన్ని, అప్రయత్నంగా అలా పట్టుకునే వున్నాను. అయితే దాన్నికూడా నా పరిస్థితే!

అది అలా కొట్టుకుంటుంటే బురద చిమ్మి నా ముఖం

మీదకి ఎగురోంది!

దగ్గర్లో ఏ చెట్టుకొమ్మా లేదు, గుర్రం శరీరాన్ని పట్టుకొని పైకి ఎగురుతామంటే!!

మరో అయిదు నిముషాల్లో కోబ్రా వచ్చేసి వంటరిగా మిగిలిపోయిన శాన్యోరాని తీసుకపోతాడు.

శరీరంలో అణువణువునా నీరసం అవహిస్తోంది...

బలంగా గుర్రం మెడని పట్టుకున్నాను...

అయితే ఆ ఆధారం ఎంతోసేపు లేదు...గింజుకోటంలో గుర్రం శరీరం మరింత చోటు చేసుకొని నెమ్మదిగా దూసుకపోయింది. రెండు మూడు బుడగలు పైకి తేలాయ్!

సజీవ సమాధి అయిపోయిందా విశ్వాస ప్రాణి!

యిప్పుడు నాకు అస్సలు ఆధారం లేదు...నాగుండెలు అలిసిపోయాయి.

పిచ్చిగా కాళ్లు అటూఇటూ ఆడించాను, ఆధారం కోసం...

అదే నేను చేసిన పొరపాటు పని!

శూన్యంలో కాళ్ళు కదిపినట్లయింది...నా బరువైన శరీరం, మెడదాకా మూసుకుపోయింది. యింకా ఎంత లోతుందో?

ఒకటి...రెండు క్షణాలు...అంతే!

ముక్కుదాకా మూసుకుపోతాను.

ఊపిరి......?

అవే నా ఆఖరి క్షణాలు!!

ఉన్నట్లుండి గాల్లోకి ఎత్తిన నా కుడిచేతికి ఏదో ఉచ్చులా పడింది. మరుక్షణం ఎవరో తాకినట్లు బిగుసుకుంది......

నా కళ్ళు బురదతో తడిసిపోయాయి.

మస్తిష్కంలో ఏదో ఆశా రేఖ తళుక్కుమంది...

ఎడంచేతిని స్వాధీనంలోకి తెచ్చుకొని కుడిచేతి ఉచ్చు వేపు తడిమాను.

అడివి తీగ!

కాన్యోరా జ్ఞాపకం వచ్చింది.

కుడిచేతి ఉచ్చు పట్టి బలమైన అడివి తీగను ఎడం చేత్తో కూడా అడ్డుగా పట్టుకున్నాను, కాన్యోరా లాగు తోంది కాబోలు! రెండు క్షణాల్లో నా ముఖం బురద నుంచి పూర్తిగా బయటికి వచ్చింది బలంగా లాగడం వల్ల.

జర్రున పైకి జారుతున్నాను.

కొంత సేపటికి దేకుతూ కాన్యోరా ఉన్న చోటుకి వచ్చాను. బురదపట్టిన దేహంతో కాన్యోరాకి కొంచెం దూరంలో నిల్చున్నాను.

"థాంక్స్ కాన్యోరా! సరైన సమయంలో బైటికి లాగావ్!" అన్నాను నోరుచుట్టూ, చెవులచుట్టూ అంటు కున్న బురదని తుడిచేసుకుంటూ.

"అవన్నీ తర్వాత! కోబ్రా ఏక్షణంలోనైనా యిక్క డికి రావచ్చు. ఈ గుర్రంమీద యిద్దరం పారిపోదాం. తొందరగా ఎక్కు భయంకర్!" అందామె నా చేతిని బలంగా గుర్రం వేపు లాగుతూ.

"ఈ బురద బట్టలతో నీ వెనుక కూర్చోనా?"

"స్టాప్ టాకింగ్ రబ్బిష్!" అందామె హుక్‌లో కాలువేసి గుర్రం ఎక్కుతూ.

మౌనంగా ఎక్కి, ఆమె వెనకాల కూర్చున్నాను.

"కుడివేపు దారి మళ్ళించు శాన్యోరా!" అన్నాను.

ఆదే సమయంలో మా యిద్దరికీ జీపు చప్పుడు విని పించింది వెనుకనుంచి.

* * *

గుర్రం వేగంగా పరిగెడుతోంది చెట్ల మధ్యనుంచి...

అటూ ఇటూ చూస్తున్నాను శాన్యోరా వెనక కూర్చొని.

దూరంగా, ఏటవాలుగా ఉన్న కొండలు, గుట్టలు కనబడ్తున్నాయి.

ఆకాశంలో నిలువునా లేచిన చెట్లూ, గుబురుగా ఏపుగా ఎదిగిన పొదలూ, వాటికి అల్లిబిల్లిగా చుట్టేసుకుని బ్రతుకుతున్న తీగెలూ, వాటినీ చూస్తుంటే—సూర్య కాంతికోసం చెట్లుపడే తపనవల్లనే అడవుల్లో చెట్లు అంత ఎత్తుగా ఎదుగుతాయని, ఎవరో బొటనీ ప్రొఫెసర్ అన్న మాటలు గుర్తుకొచ్చాయి నాకు.

ఉన్నట్టుండి గుర్రం కాలు మడతబడి దబాలున ముందు కాళ్ళమీద పడింది.

యిసుక బస్తాల్లా ప్రక్కకు పడ్డాం మేము.

లేవబోయి మళ్ళీ తూలిపడ్డాను నేను...

మళ్ళీ లేచాను. ఈసారి తూలిపడ లేదు.

శాన్యోరా నేలమీంచి లేచి ఒళ్ళు దులుపుకొంది.

"భయంకర్! ఎందుకు ఒళ్ళు తిరిగినట్లయింది??"

"శాన్యోరా! భూకంపం" చెప్పాను. "రెండుక్షణాల పాటు ఉంది. అందుకే గుర్రంకూడ స్లిప్ అయివుంటుంది."

"ఎర్త్ క్వేక్!" అంది ఆశ్చర్యంగా శాన్యోరా నిలబడి పోయి.

"అవును. కోబ్రా నివాసానికి రెండు మైళ్ళ దూరంగా ఓ కొండ వుంది. దాని చుట్టుప్రక్కల ప్రాంతాల్లో భూకంపాలు తరచుగా వస్తుంటాయని చెప్పాడు కోబ్రా."

"అంటే?"

శాన్యోరా కేసి సూటిగా చూసాను. "అది వేడిని దాచుకున్న అగ్నిపర్వతం కాదు..."

నా మాటలు పూర్తికాకుండానే ఎక్కడో దూరంగా ఫట్...ఫట్...మన్న పెద్ద శబ్దాలు వినిపించసాగాయి.

"భయంకర్! ఏమిటా శబ్దాలు?"

"శాన్యోరా! బైనాక్యులర్! క్విక్!" అరిచేను.

తటాలున ఆమె-గుర్రంవద్దకు కదిలి దానిమీద అమర్చిన గోనె సంచిలో చెయ్యి పెట్టింది.

మరుక్షణం బైనాక్యులర్స్‌తో ఆమె చెయ్యి బైటికి వచ్చింది.

"శాన్యోరా! నేను చెట్టుఎక్కి ఆ గందరగోళమేమిటో చూసి వస్తాను. నువ్వు ఆ శబ్దాలకి గుర్రం హడలిపోయి పారిపోకుండా చూడాలి." అన్నాను ఆమె చేతిలోని బైనాక్యులర్ లాక్కుంటూ.

మౌనంగా నిలబడిపోయి తలఊపిందామె.

ఫట...ఫట...శబ్దాలు వినబడ్తూనే వున్నాయి......

గబగబా ఓ పొడవైన చెట్టును ఎన్నిక చేశాను.

తాటిచెట్టులా ఉందది.

అటూ ఇటూ కొమ్మలు లేవు.

చివర్న మాత్రం వెడల్పాటి ఆకులు, మట్టలు ఉన్నాయి.

బైనాక్యులర్స్ మెడలో వేసుకున్నాను.

ఓ బలమైన అడివి తీగను చెట్టు చుట్టూ నా నడుముకి కలిపి, కదల్డానికి వీలుగా కాస్త లూజ్‌గా వుండేట్టు బిగించాను.

చరచరా పైకి ఎక్కసాగాను...

కాళ్ళు చేతులు గీరుకుపోతున్నాయి...

పట్టుదలతో నాలుగు నిముషాల్లో ఆ పొడవైన చెట్టుని అధిరోహించాను.

నడుం చుట్టూ జారిపోకుండా, అడివితీగ కాపాడు తోంది.

ఒక చేత్తో చెట్టుని పట్టుకొని మరో చేత్తో మెడలో వ్రేలాడుతున్న బైనాక్యులర్స్ కళ్ళముందు పెట్టు కున్నాను.

అంతే! నా గుండెలు దడదడలాడాయి.

రెండు నిముషాలు స్థాణువులా అలాగే చూస్తూ ఉండిపోయాను బైనాక్యులర్స్ కళ్ళకు వెల్డింగ్ చెయ్య బడ్డట్టు.

"శా...నో్య...రా" గొణిగాను అస్పష్టంగా.

"భయంకర్! యు గాట్ ఎనీ థింగ్" కిందనించి కేక పెట్టింది శానో్యరా.

చెట్టునలాగే పట్టుకొని క్రిందకు చూసాను.

శానో్యరా ఆత్రుతగా పైకి చూస్తూ కనబడింది.

చెట్టు చుట్టూ వున్న నా చెయ్యి వణుకుతోంది.

"శానో్యరా! మనకు మూడు ప్రమాదాలు!" అన్నాను క్రిందకు చూస్తూ.

"షూట్ యిట్ క్విక్!" అర్చింది శానో్యరా క్రింద నుంచి.

"క్రిందకు వచ్చి చెప్తాను." అన్నాను యంత్రపు మనిషిలా.

జర్రున జారాను క్రిందికి, చుట్టూ చెట్లు మెత్తగా లేదన తెల్సికూడా.

అర చేతులు తోక్కలు రేగాయి క్రిందికి దిగేసరిక్కి, దూరంగా యింకా చప్పుళ్ళు వినబడుతూనే వున్నాయి.

పరుగెత్తుకువచ్చి నా భుజం పట్టుకుంది శాన్యోరా. "డార్లింగ్" అందామె కంగారుగా.

"శాన్యోరా! వాతావరణంలో ఏదైనా మార్పు గమనించావా?" ఒక్క క్షణం నా కళ్ళల్లోకి చూస్తూ వుండిపోయింది శాన్యోరా.

"అవును వేడిగా మారింది వాతావరణం. చెమటలు పడుతున్నాయి విపరీతంగా. వాట్ ది హెల్ ఆన్ ఎర్త్ హేపెండ్?"

"అ ... గ్ని ... ప...ర్వ ... తం ...బ్ర...ద్ద... ల...య్యి...ంది..." అన్నాను ఒక్కసారిగా.

ప్రక్కలో బాంబు పేలినట్లు అదిరిపడింది శాన్యోరా.

"ఎస్ డియర్. లావా విజృంభిస్తోంది శరవేగంతో, మరగబెట్టిన నూనెలా. దూరంగా రకరకాల జంతువులు పిచ్చిగా పరుగెడుతున్నాయి ప్రాణభయంతో. చెట్లు చేమలూ, మాడి మసైపోతున్నాయి. లావా-ఒకపాయ యిటు వేపు వచ్చేస్తోంది దావానలంలా" గబగబా మాట్లాడాను. "అంతే కాదు శాన్యోరా! కోబ్రా జీపులో మనకు ఫర్లాంగు దూరంలో వున్నాడు. అతనికీ, మనకీ, వన్యమృగాలకీ యిప్పుడు రక్షణ లేదు. ప్రకృతి వికృత చేష్టలు చేస్తోంది. లావా పల్లం వేపు పారే నదిలా పొంగుతూ

యిటువైపు పారుతోంది. దాని వేగాన్ని మనం లెక్క-
కట్టలేం!"

"మనం కొద్దిసేపట్లో కోబ్రాకి దొరికిపోవచ్చు. లేదా పిచ్చిభయంతో గెంతులేస్తున్న ఆ సమస్త జంతు ప్రాణులు, మనల్ని తొక్కేసి చంపొచ్చు...చివరికి మన శవాలు కూడా మిగలవ్. ప్రతి ఎముకా బూడిదా అవుతుంది ఆ లావాలో ఐక్యమై."

శాన్యోరా, వణుకుతున్న శరీరంతో నిలబడిపోయింది.

"శాన్యోరా!" ఆమెను కదిపాను.

నా ఒళ్ళంతా అప్పుడే ఉక్కపోసేస్తోంది.

ఉలిక్కిపడి పిచ్చిదానిలా నా వేపు చూసింది శాన్యోరా.

"శాన్యోరా! ఏదో ఆలోచించు. మానవ ప్రయత్నం చేయాలి కదా కనీసం."

"భయంకర్! శని బారినుండి తప్పించుకొని యముడి పాల పడ్డట్లయింది. నా బుర్ర పని చేయడంలేదు" అంది బేలగా.

"శాన్యోరా నాకో ఐడియా వుంది" అన్నాను నెమ్మదిగా.

"అటు చూడు. ఏదో వాలుగా కొండలపంక్తి గుట్టలుగా పడివుండి గోడకట్టినట్లుందక్కడ. లావా యిటువైపు ప్రవహించి, ఆ కొండల క్రింది భాగందాకా మాత్రం ఆక్రమించుకునే ప్రమాదం వుంది."

"అంటే?" అంది ముఖంమీద చెమట కర్చీఫ్‌తో అద్దుకుంటూ.

"అయిదు నిముషాల్లో లావా ఈ ప్రాంతాన్ని ముంచే

స్తుంది. ఈ లోగా మనం ఎక్కువ ఎత్తు లేకుండా బాగా ఏటవాలుగా వున్న ఒక కొండ నెన్నుకొని అధిరోహించాలి. దెన్ ఓన్లీ వియ్ విల్ బి ఎట్ సేఫ్ సైడ్."

శాన్యోరా యిక ఆలోచించలేదు.

చివ్వున గుర్రంమీద ఎక్కింది.

అర క్షణంలో ఎగిరి ఆమె వెనక సెటిల్ అయ్యాను.

ఇద్దరం గుర్రం కడుపులో బలంగా కుమ్మాం.

అంతే!

గుర్రం లాగిపెట్టి వదిలిన బాణంలా ముందుకి ఉరికింది కొండల పంక్తివేపు.

*  *  *

అల్లంత దూరాన పర్వత పంక్తులు కనబడుతున్నాయి.

"గుర్రం విపరీతంగా రొప్పుతోంది భయంకర్! బాగా అలసిపోయిందనుకుంటాను" అంది శాన్యోరా తల వెనక్కి తిప్పి.

"శాన్యోరా! లావా వెనుక తరుముకొస్తోంది. అప్పుడే వేడిపొగలు యిటువైపు వచ్చేసాయి. కొద్దిక్షణాల్లో మన వొళ్ళుకూడా ఎండిపోతాయి. అయితే గుర్రం మన ప్రయాణానికి ఏకైక సాధనం. అందుకే వాటర్ బాటిల్‌లో నీళ్ళు దానికే జాగ్రత్తగా పడదాం. కాని ముందు మనం ఆ మిట్టశిఖరాన్ని చేరుకోవాలి. మన ప్రాణం కాపాడుకోవాలి. గాలప్ ..."

నా మాటలు పూర్తి కాకుండానే వెనుక వేపు లీలగా జీపు శబ్దం వినబడింది...

"శాన్యోరా! కోబ్రా వచ్చేస్తున్నాడు. గుర్రం గాలిలో పరిగెట్టాలి" అర్చాను.

శాన్యోరా పెద్దగా అరుస్తూ, గుర్రాన్ని పరిగెత్తిస్తోంది.

అగ్నిపర్వతం నుండి భయంకరంగా వెలువడుతున్న ధన్...ధన్...శబ్దాలు యింకా వినిపిస్తున్నాయి లీలగా.

మరో అయిదు నిముషాల్లో—మిట్ట మొదట్లోకి చేరుకుంది గుర్రం.

“శాన్యోరా! గుర్రాన్ని హెచ్చరించు, మిట్ట ఏటవాలుగా, ఎత్తుగా ఉంది. స్పీడ్ తగ్గితే గుర్రం పైకి ఎక్కడంలో విఫలమౌతుంది” అర్చాను కంగారుగా.

అంతే! శాన్యోరా చేతిలోని పగ్గాలు, గుర్రం శరీరం మీద ఛెళ్ళున నాట్యం చేసాయి.

గుర్రం ఒక్క ఊపుతో ఏటవాలుగావున్న మిట్ట మీదకి పరుగు లంకించింది.

ఆ మిట్టమీదికి సగందూరం వెళ్ళగానే, యిక ఎత్తుకు వెళ్ళలేక ముందుకాళ్ళు రెండు ఎత్తి సకిలించబోయింది గుర్రం.

ఇద్దరం చటుక్కున క్రిందకి దిగాం.

గుర్రం జారిపోకుండా కళ్ళాల్ని బలంగా పట్టుకుంది శాన్యోరా.

“లుక్ దేర్ శాన్యోరా!” అరిచాను కొండ క్రింది భాగంవైపు చూపుతూ.

శాన్యోరా ఉలిక్కిపడి క్రిందికి చూసింది.

కోబ్రా జీపు క్రిందభాగాన కనుచూపు మేరలో మెట్టవేపు పరిగెడుతూ వస్తోంది.

వెనకాతల, అడవిలో పొగలు వ్యాపిస్తున్నాయి.

లావా...?

ఉన్నట్టుండి జీపువైపునుంచి ధన్ ... ధన్‌మన్న

శబ్దాలు ప్రతిధ్వనించాయి.

తటాలున శాన్యోరాను క్రిందికి లాగాను, నేను వంగుతూ.

చెవి ప్రక్కగా దూసుకుపోయాయి రెండు తూటాలు.

"శాన్యోరా! అది రైఫిల్ శబ్దం. పిస్తోలు అయితే యింత రేంజిలోకి రావు గుళ్ళు. మనం గుర్రాన్ని కాపాడు కుంటూ కొండపైకి ఎక్కాలి క్విక్" అన్నాను ఆమె చేతిలోని గుర్రపు కళ్ళాలు నేను అందుకుంటూ.

ఇద్దరు ఏటవాలుగా వున్న ఉపరిభాగం వైపు గబగబా నడవసాగాం.

గుర్రాన్ని శిఖరం వైపుకి లాగుతున్నాను. శాన్యోరా జాగ్రత్తగా నడుస్తూ గుర్రం వెనకవైపు నుంచి గుర్రాన్ని అదిలిస్తోంది.

తూటాలు పేలుతున్న శబ్దం వినవస్తోంది. ఎక్కువ ఎత్తు లేకపోవడంవల్ల, అయిదు నిముషాల్లో శిఖరం చేరుకొన్నాం.

అక్కడవున్న ఓ పెద్ద కొండరాయి వెనక, అలసటగా కూలబడి స్వేచ్ఛగా నిట్టూర్పు విడిచాను.

శాన్యోరా గుర్రంమీంచి బరువైన గోనెసంచి దించి అందులోని వాటర్ కాన్ తీసింది.

ఇద్దరం ఒక్కోగుక్క తాగాం.

"మిగిలింది గుర్రానికి పట్టేద్దాం. మనకు మరీ దాహం అనిపిస్తే టాఫీయా వుందిగా?" అన్నాను.

మోచేత్తో మూతి తుడుచుకుంటూ అవునన్నట్లు తల వూపింది శాన్యోరా.

అరచేతులు రెండు, దగ్గరచేర్చి చేతులు గిన్నెలా

పెట్టాను. అందులో వాటర్ కాన్‌లోని నీళ్ళు పోయ సాగింది కాన్స్యోరా. గుర్రం పాత్రలావున్న నా చేతుల మధ్య మూతి పెట్టి నాలికతో శబ్దం చేసుకుంటూ తాగ సాగింది.

బాటిల్ ఖాళీ అయింది.

"పూర్తిగా గుర్రం కడుపు నిండకపోవచ్చు. సమ్ వాట్ బెటర్!" అన్నాను గుర్రం మూపురాన్ని స్నేహ పూర్వకంగా నిమురుతూ.

రాతిప్రక్కగా నడిచి వెళ్ళిన కాన్స్యోరా కేక పెట్టింది. "భయంకర్! లుక్ ఎట్ దట్!"

ఉలిక్కిపడి రాతిప్రక్కగా కదిలాను. అంతే! నా గుండెలు దడదడలాడాయి.

"హో...రి...బుల్..." సన్నగా గొణిగాను.

క్రింద...

కొండ క్రిందభాగంలో...గుడగుడ బుడగలు రేగుతూ నదిలా ఏర్పడిన ఎఱ్ఱటి చిక్కటి 'లావా'లో...సగంపైగా మునిగిన జీపు.

అందులో, మరణించి...ఉడికిపోతున్న శరీరంతో కోబ్రా,...అతని అనుచరులూ...

మళ్ళీ నా నోరు తడారిపోయినట్లయింది...

కాన్స్యోరా చేతులు నా భుజాలమీద పడ్డాయి—

"భయంకర్! యిటువైపు అడివిప్రాంతమంతా లావాలో మునిగిపోయింది. అడవి వెనుక భాగాన్ని ఈ కొండలు కొంతవరకూ కాపాడాయి. భయంకరమైన ఈ లావాలో ఎన్ని జీవరాశులు మరణించి వుంటాయో పాపం! కోబ్రా నివాసం, అతని అనుచరుల కుటుంబాలు సర్వ

నాశనమైపోయివుంటాయి. కొద్ది నిముషాలు ఆలస్యం అయివుంటే మనంకూడా..." శాన్యోరా కంఠం పూడుకు పోయింది.

క్రింద జరిగిన మరణకూపం వేపు నిశ్చలంగా చూస్తూ పలికాను. "శాన్యోరా! కోబ్రా మనకి చక్కని ఆతిథ్యం యిచ్చాడు. అతనికి అపకారం జరక్కుండా మనం తప్పించుకుపోతే బాగుండుననుకొన్నాను. 'అమ్మాయి చనిపోయింది. కాని ఆపరేషన్ జయప్రదంగా జరిగింది' అన్నట్లయింది. రాక్షసపైశాచికమైన కోరికలతో కోబ్రా మరణించాడు. అతని ఆత్మశాంతి కొరకు భగవంతుని ప్రార్థించుదాం"...

మౌనంగా తల వూపింది శాన్యోరా.

రెండు నిముషాలపాటు కళ్ళు మూసుకున్నాను. కోబ్రా ఆకారం మనోనేత్రాలముందు ఒక్కక్షణం ప్రత్యక్షమై మాయమైంది.

"గాడ్! మే హిజ్ సోల్ రెస్ట్ యిన్ పీస్" అంటూ మనసులోనే దేవుని ప్రార్థించాను.

తర్వాత—వాలుగావున్న కొండ వెనుకభాగం వేపు పరిశీలనగా చూశాను.

సూర్యుడు నడినెత్తిమీద కొచ్చాడు.

డ్రెస్ మార్చుకున్నాను.

"భయంకర్! యింకా తరగని అడివివుంది ఎదురుగా. సత్యాన్ని అన్వేషిస్తూ ఋషులు పాకులాడినట్లు, దేని కోసమో బయలుదేరిన మనం చెట్లు, పుట్టలు గాలిస్తున్నాం" అంది శాన్యోరా విచారంగా.

బరువెక్కిన గుండెతో గుర్రాన్ని మైల్డ్‌గా మెట్ల మీంచి క్రిందకు దింపుతూ మెల్లగా అడుగులు ముందుకు వేశాం శాన్యోరా, నేనూ.

* * *

హార్స్‌రైడ్ చేస్తూ చీకటిపడే వేళకు దాదాపు పది మైళ్ళు ప్రయాణించాం, శాన్యోరా, నేనూ.

అంతా అయోమయంగా వుంది మాకు.

ఈ అరణ్యంలో మేముఎటు వేపు ప్రయాణిస్తున్నామో?

పోర్ట్‌సూడాన్ సరిహద్దులకు దగ్గరగా వెళ్తున్నామా? లేక దూరంగానా?...అన్న సమస్యలు ప్రశ్నార్థకంగా మాత్రం మిగిలిపోయాయి. మానసికంగా ఎంతో అల్సి పోయాం యిద్దరం.

ఈ దిక్కులేని చోట ఒకరినొకరు ఓదార్చుకోటం తప్ప యిప్పట్లో మేము చేయగలిగేదేమీ లేదు.

చీకటి పడింది—

ప్రయాణం సాగదు.

గుర్రాన్ని ఓ చెట్టుకి కట్టేశాను, తినడానికి బాగా పచ్చిక వున్నచోట.

ఓ వృక్షంమీద గంటసేపు శ్రమపడి తయారుచేసిన మంచ మీద నేను, శాన్యోరా నడుం వాల్చాం.

వెంట తెచ్చుకొన్న రొట్టెలిని, టాఫియా గొంతుక వరకు పట్టించేశాం.

గుర్రపుస్వారీ కదలికలవల్ల ఏర్పడ్డ శారీరక అలసట వల్ల నైతేనేం, ఆలోచనలవల్ల ఏర్పడిన మానసిక శ్రమవల్ల నైతేనేం, ఈ రెండిటి తర్వాత టాఫియా డ్రింక్ వల్ల

ఏర్పడిన మత్తువల్లనైతేనేం, మొత్తానికి ఆ రాత్రి మత్తుగా నిద్రపోయాం.

* * *

"భయంకర్!" ఎవరో తట్టిలేపినట్లయి విసుగ్గా ప్రక్కకు దొర్లాను.

"కాస్సేపు పడుకోనీయ్ శాన్యోరా!" మత్తుగా గొణికాను ప్రక్కకు దొర్లుతూ—

జారిపడబోయి కళ్ళు తెరిచేసరికి నేను పడుకున్నది 'మంచె' అని గుర్తుకొచ్చింది.

కళ్ళెదురుగా శాన్యోరా ముఖం కనపడింది. "గుడ్ మార్నింగ్ డార్లింగ్!" బద్ధకంగా గొణిగాను, మంచె మీద నడుంవాల్చి కూర్చుంటూ.

శాన్యోరా జవాబివ్వలేదు. ఆమె ముఖం వర్షం కురవబోయేముందు ఏర్పడే ముసురుపట్టిన ఆకాశంలా ఉంది. ఆమె పెదిమలు బిగుసుకొని వున్నాయి.

ఆమె భుజాలు పట్టుకొని ఊపాను. "శాన్యోరా! ఏం జరిగింది? అలావున్నావ్" అన్నాను కంగారుగా ఆమెవైపు చూస్తూ.

"క్రిందికిచూడు" అందామె పళ్ళు బిగించి దుఃఖాన్ని ఆపుకొంటూ.

ఉలిక్కిపడి క్రిందకు చూశాను. అంతే! నా శరీరం చలిజ్వరం వచ్చినట్లు వణికింది...

విచారం కాలిబోటన ప్రేల్లోంచి తల్లోకి తన్నుకొచ్చింది...

నోరు తడారిపోయింది...

క్రింద...

చెట్టుకి కట్టిన అశ్వం...

మమ్మల్ని ఆ నిర్జనారణ్యంలో ఎంతోదూరం మోసి సహాయపడిన అశ్వం...

అక్కడేవుంది...

కాని...

కాని...బ్రతికి లేదు.

సగం తినేయబడిన కళేబరం...

ఎర్రగా వికృతంగా...అక్కడక్కడా పొడుచుకు వచ్చిన ఎముకలతో—మధ్యగా ఎముకల గూడుతో—

ఏదో భయంకర అడవిమృగం దాన్ని ఆరగించింది...

దానిక్కట్టిన తోలుతాడు చెట్టుకు వేలబడుతూ అలాగేవుంది.

అరచేతుల్తో ముఖాన్ని కప్పుకున్నాను.

వాట్ ఎ బాడ్ మోర్నింగ్!...

వాట్ ఏన్ ఇల్లక్ ఇన్సిడెంట్!..

"శాన్యోరా! శనిదేవత మనలను వెంటాడుతోంది. రాత్రి అలిసిపోయిన మీదట కేవలం మనం షెల్టర్ విషయం కంగారు పడ్డాం. కాని గుర్రం రక్షణ విషయం ఆలోచించలేదు. కనీసం మనం చప్పుడుగూడా వినలేదు. బహుశా...ఇంటాక్సికేటెడ్ టాఫియావల్ల..." అన్నాను బొంగురుగా.

శాన్యోరా చేయి నాచేతిమీద కదిలింది. "అయామ్ సారీ భయంకర్! నాకూ ఆ ఆలోచన ఎందుకో దేవుడు పుట్టించలేదు. లేకపోతే వంతులవారిగా కాపలా కాసే వాళ్ళం. రైఫిల్ ఉండికూడా రక్షించుకోలేక పోయాం గుర్రాన్ని. మళ్ళీ మనం కాలినడకన ఎన్నివందల మైళ్ళు

నడవాలో?...ఎన్ని ప్రమాదాలు ఎదుర్కోవాలో?..."
భారంగా పల్కింది మూర్తీభవించిన శోకమూర్తిలావున్న శాన్యోరా.

"శాన్యోరా! మనం యిలాంటి విషయాలకే అఫెండ్ అయితే ఎదుట రాబోయే ప్రమాదాల్ని ఎదుర్కోలేమేమో! ప్లీజ్! మేక్ యువర్ సెల్ఫ్ కంఫర్టబుల్."

పదినిముషాలు బరువుగా గడిచాయి.

మంచెమీద తలగడగా వేసుకున్న గోనెసంచి విప్పి కెటిల్, అగ్గిపెట్టె, కాఫీపౌడర్ పాక్, కండెన్స్‌డ్ మిల్క్ టిన్ బయటికి తీసాను.

ఇద్దరం చెట్టుదిగి ఆకులతో మంటచేసాం.

కెటిల్‌లో, కండెన్స్‌డ్ మిల్క్ పోసి, వేడిచేసి యిన్‌స్టెంట్ కాఫీపౌడర్ కలిపాను.

హాట్ కాఫీ, గొంతుకలోంచి వెచ్చగ దిగిన తరువాత ప్రాణం తేరుకున్నట్లనిపించింది.

"శాన్యోరా!" పిల్చాను.

తలెత్తి నావేపు చూసింది.

"ఈచీర మార్చెయ్యి. మనం వెంటతెచ్చిన రెండో సఫారిసూటు వేసుకో. నడవడానికి, అవసరమైతే పరిగెట్టడానికి వీలుగా వుంటుంది. ఆలోచిస్తూ యిక్కడ కూర్చోటంవల్ల ఉపయోగం నాక్కనపడ్డం లేదు. రెండు నిమిషాల్లో రెడీ అవ్వు. ఈలోగా ఈసామగ్రి నేనుపాక్ చేస్తాను. మనం ఇక కదలాలి" అన్నాను పైకిలేస్తూ.

అయిదు నిమిషాల్లో రెండురైఫిల్స్, లగేజ్ మోసుకుంటూ తుప్పలు దాటుకుంటూ అడవిలోకి కదిలాం.

* * *

కాళ్లు పీకుతున్నాయి.

అప్పటికే ఓ రెండు గంటలు నడిచివుంటాం. ముందు శాన్యోరా నడుస్తోంది, మెడలోని బైనాక్యులర్స్ తీసి అప్పుడప్పుడు చూస్తూ.

ఆమె భుజాన్నించి, నడుం ప్రక్కగా రైఫిల్ వేలాడు తోంది.

నేను తలవంచుకుని లగేజ్ మోస్తూ, రెండో రైఫిల్ ని ఎండం చేత్తో పట్టుకుని అలసటగా ముందుకు కదులుతున్నాను.

"హేయ్! భయంకర్!" అర్చింది శాన్యోరా.

ఉలిక్కిపడి తలెత్తి ముందుకు చూసాను. ఓ ఎత్తయిన దిబ్బమీద నిలబడి బైనాక్స్‌లోంచి చూస్తోంది శాన్యోరా.

లగేజ్ సంచిని అలసటగా వెనక్కి వాల్చేసాను. "యుగాట్ ఎనీథింగ్ శాన్యోరా?" అడిగాను నుదుటి మీద చెమట వేళ్ళతో తుడుచుకుంటూ.

"కారవాన్!" అంది శాన్యోరా, కళ్ళముందునుంచి బైనాకులర్స్ తీసేసి చురుగ్గా నావేపు చూస్తూ. "కను చూపు మేరలో ఓ పవర్ వాగన్, మూడు ట్రక్కులు, రెండుజీపులు, ఎడంవేపుగా అడవిలోకి ప్రయాణిస్తున్నయ్."

"ఈజిట్?" అన్నాను ఆశ్చర్యంగా...

ఇది శుభసూచకమా? ప్రమాద సూచకమా?

"నిజం కావలిస్తే నువ్వు చూడు!" అంది శాన్యోరా మెరిసే కళ్ళతో.

"గబగబా ఓనిర్ణయానికొచ్చాను. అక్కర్లేదు.నువ్వు మాత్రం అటువైపే చూస్తూండు. నేను గాలిలో రైఫిల్

పాట్స్ పేలుస్తాను. ఏమాతుందో చూడు.

అవునన్నట్లు చూస్తూ తల ఊపింది శాన్యోరా.

రైఫిల్ బారెల్ ఆకాశంవైపు ఎత్తాను. సేఫ్టీ కాచ్ లూజ్ చేసి, అయిదారు సార్లు ట్రిగ్గర్ నొక్కాను.

ధన్...ధన్...ధన్...ధన్.

ఆ అడవి అంతా మారుమ్రోగి పోయింది. పక్షులు పెద్దశబ్దం చేసుకుంటూ, ఎగిరి ఆకాశానికి అడ్డంపడ్డాయి.

"భయంకర్! ఇప్పుడు కారవాన్ ఆగిపోయింది. జీపులు, ట్రక్కులు కదలడంలేదు" అంది ముందుకు చూస్తూన్న శాన్యోరా.

"వెల్. నా ఊహ కరెక్టయింది. ఇప్పుడు మనం ఆ ట్రక్కుల దగ్గరకు పరిగెత్తాలి. వుయ్ నీడ్ దేర్ హెల్ప్!" అన్నాను మళ్ళీ లగేజి వీపుకు ఎత్తుకుంటూ.

ఇద్దరం పరుగెట్టసాగాం ఆగివున్న వాహనాలవేపు.

* * *

ముందుగా ఆగివున్న జీపులో డ్రయివరు యిద్దరు వ్యక్తులు ఉన్నారు. వెనక సీటులో అతిసుందరమైన ఓ యువతి, మరో యిద్దరు వ్యక్తులు వున్నారు. అందరూ సూట్లు ధరించారు.

"ఫ్రెండ్ ఆర్ ఫో?" అర్చాడు డ్రయివర్ పక్కగా కూర్చున్న రెండోవ్యక్తి పిస్తోలు మావేపు గురిపెడుతూ.

"శాన్యోరా! రైఫిల్ క్రింద పడెయ్" అన్నాను తగ్గుస్వరంతో, నా రైఫిల్ నేలమీదకు విసిరేసి.

ఆమెకూడా భుజంమీంచి రైఫిల్ తీసి నేలమీద పడేసింది.

"జంటిల్మన్! వియ్ విల్ బి యువర్ ఫ్రెండ్స్! కొన్ని

కారణాల వల్ల ఈ అడవిలో చిక్కుకున్నాం. వుయ్ నీడ్ యువర్ హెల్ప్!" అన్నాను బ్రతిమాలుతున్నట్లుగా.

జీప్ లోంచి అందరూ మా వైపు ఆసక్తిగా చూస్తున్నారు. "ఇందాకా రైఫిల్ షాట్సు పేల్చింది మీరేనా" అనడిగేడు అనుమానంగా ఆ వ్యక్తి.

"అయాం సారీ ఎబౌట్ ఇట్ సర్! మీరు చాలా దూరంలో వున్నారు. మేము పరిగెట్టుకొచ్చే లోపున మీరు మాయమైపోవచ్చు. అందుకే రైఫిల్ షాట్స్ పేల్చాను. నా శ్రమ ఫలించింది. మీరు ఆగేరు" అన్నాను.

పిస్తోలు వ్యక్తిలో అనుమానం మాయమైనట్లు నాకు అనిపించింది.

రెండు నిమిషాలలో వాళ్ళలో వాళ్ళు ఏదో చర్చించుకున్నారు. అతను పిస్తోలు, కోటు జేబులో పెట్టుకొని క్రిందికి దిగేడు.

పెద్ద పెద్ద అంగలతో మా ముందుకొచ్చాడు.

దాదాపు యాభయ్యేళ్ళుంటా యతనికి.

యాష్ కలర్ సూటు ధరించాడు.

తెల్లని శరీరచ్ఛాయ, వయసు మళ్ళినా కొట్టొచ్చినట్టు కనపడే ఆరోగ్యవంతమైన, బలమైన శరీరం.

ముఖంలో గంభీరత, నడకలో ఠీవి, హుందాతనము కనబడుతున్నాయి. తలకి బాంబూ హేట్ వుంది.

"మిస్టర్..."

"భయంకర్" అందించాను.

ఇద్దరం కరచాలనం చేసుకున్నాం.

"అయాం సారీ మిస్టర్ భయంకర్! మిమ్మల్ని అనవ

సరంగా అనుమానించాం. ఈ కీకారణ్యంలో ముందు మీలాంటి నాగరికుల్ని చూడ్డంవల్ల ఆశ్చర్యపోయాం. కాని రైఫిల్ షాట్స్ అనవసరపు అనుమానాన్ని తెప్పించాయి. ఈమె ఎవరు? ఈ అడవిలోకి మీరు యెలా వచ్చారు?" గబగబా మాట్లాడాడు అతను.

"ఎనీవే థాంక్యూ వెరిమచ్ జంటిల్మన్. మీట్ మై లైఫ్ పార్ట్నర్ మిస్. కాన్స్యోరా. మేం భారతీయులం" అంటూ కో(బాకు చెప్పినట్లే క్షమాకథ క్లుప్తంగా అతనికి చెప్పాను.

కాన్స్యోరా చేయి చాచింది.

"మర్చిపోయాను. మై నేమ్ ఈజ్ పాల్‌మావ్. జాక్ పాల్‌మావ్" అన్నాడతను.

"వెరీ హాపీ టు మీట్ యు మిస్టర్ పాల్‌మావ్! అండ్ వెరీ కైండ్ ఆఫ్ యు" అందంగా పలికింది కాన్స్యోరా పాల్‌మావ్‌తో చేయి కలుపుతూ.

పాల్‌మావ్ వెనక్కి తిరిగి, "గెట్ డౌన్ బాయ్స్ అండ్ గరల్స్" అంటూ పెద్దకేక పెట్టాడు ఆజ్ఞాపిస్తున్నట్లుగా. జీపులోని అందమైన యువతిపై నా దృష్టి నిలచిపోయింది. ఆమెను ఎక్కడో చూసినట్లు జ్ఞప్తికొస్తూంది.

ట్రక్కుల్లోంచి, జీపుల్లోంచి బిలబిలమంటూ దిగారు సుమారు నలభైమంది పురుషులు, ఓ అయిదుగురు స్త్రీలు.

"మిస్టర్ భయంకర్! వీళ్ళంతా ఎవరా అని మీరు ఆశ్చర్యపోవచ్చు. ట్వెంటీథర్డ్ సెంచరీ ఫాక్స్ తరఫున హాలివుడ్ నుంచి వస్తున్నాం. నేను కో-ప్రొడ్యూసర్ని. ఆఫ్రికా అరణ్యాల్లో ఓ జంగిల్ పిక్చర్ తీయాలని మా

సంకల్పం. వీరంతా'' అంటూ గైడ్‌నీ, టెక్నిషియన్లనీ, డైరెక్టర్లనీ, కెమెరా నిపుణుల్ని మొ॥న వారందర్నీ పరిచయం చేసేడు పాల్‌మావ్.

పలకరింపులు పరిచయాలు జరిగాయి. నా దృష్టి జీపులోంచి దిగిన అందమైన యువతిపై ఆగిపోయింది.

''మిస్టర్ భయంకర్! ఈమె ప్రఖ్యాత హాలీవుడ్ నటి మిస్. బార్బరా సుసాన్!'' అంటూ ప్రత్యేక పరిచయం చేసాడు పాల్‌మావ్.

''ఓహ్! మిమ్మల్ని ఎక్కడో చూసాను. ఎక్కడా అనుకుంటున్నా. ఇంగ్లీష్ చిత్రాల్లో అన్నమాట''అన్నాను నవ్వుతూ ఆమె చేతిలు కరచాలనం చేస్తూ.

''మిస్టర్ భయంకర్! మీరు ఈ అడవుల్లో చాలా రోజులు గడిపానని చెప్పారు. మీ అడ్వెంచెర్స్ చెప్పండి మంచి కథగా అనిపిస్తే సినిమా తీయించేస్తాను'' అంది ఉత్సాహంగా.

''వై నాట్'' నవ్వుతూ తలూపాను. శాన్యోరా చేతులు బార్బరా చేతులు కలుసుకున్నాయి.

''మిస్ బార్బరా! ప్రఖ్యాత హాలీవుడ్ నటి ఈ భయంకర అరణ్యాల్లో ప్రత్యక్షమాతుందని, మాకు పరోక్షంగా సహాయపడుతుందని నేను కల్లోకూడా ఊహించలేదు'' అంది శాన్యోరా.

వారిద్దరూ మాట్లాడుకుంటుండగా నేను పాల్‌మావ్ వేపు తిరిగాను.

అతను పైపు వెల్గించుకుంటూ నా వేపు చూసాడు.
''మిస్టర్ పాల్‌మావ్! హాలీవుడ్‌లో మీకు అన్ని సదుపాయాల్తో బ్రహ్మాండమైన స్టూడియోలు ఉంటాయి.

అటువంటిది ఈ జంగిల్ లోకి వచ్చారంటే ఆశ్చర్యంగా వుంది" అంటూ ఆగాను.

పాల్ మాన్ నోట్లోంచి పైపుతీసి నవ్వాడు. "మిస్టర్ భయంకర్! నువ్వు చెప్పింది కరక్టే. కాని ఈ చిత్రానికి ఎక్కువ పెట్టుబడే నాతోటి ప్రొడ్యూసర్లు ఆఫ్రికాలోని రియల్ ఆటవికులతో, నిజమైన ప్రకృతి సౌందర్యంగల అడవుల్లో, యింకా నిజమైన తెలియని జంతువులతో, నిజమైన శబ్దాలతో తీయాలని పట్టుపట్టారు. అదే భారీ ఎత్తున బయలుదేరిన ఈ ప్రయాణానికి దోహదపడింది."

"హీరో లేడా మీ కథలో?"

నవ్వాడు పాల్ మాన్. "ఉండడు. ఎయిర్ క్రాష్‌లో అందరూ చనిపోగా, ప్రాణాలతో బయటపడి, అరణ్యాల్లో చిక్కుకున్న ఓ యువతి గాథయిది. విమాన ప్రమాదం సీను స్టూడియోల్లో తీసి కలుపుతాం."

"ఆల్ రైట్ భయంకర్! మీరు మా జీపులో ఎక్కండి. రాత్రికి ఓ చోట ఆగి గుడారాలు వేస్తాం. అప్పుడు మనం తీరిగ్గా మాట్లాడుకోవచ్చు" అంటూ వెనక్కి తిరిగి "పాకప్ యువర్ సెల్వ్స్ యిన్ టు ట్రక్స్ బాయ్స్!" అర్చాడు పాల్ మాన్ హుందాగా కదుల్తూ.

అంతా తిరిగి వాహనాల్లో ఎక్కారు. జీపు ముందు సీటులో నేను కూర్చున్నాను. నా ప్రక్కగా దారిచూపే ఆఫ్రికన్ గైడ్ మిస్టర్ జైరా, పాల్ మాన్... వెనుక సీటులో డైరెక్టర్, శాన్యోరా, మిస్ బార్బరా...

శాన్యోరా, బార్బరా అప్పుడే కబుర్లలో పడ్డారు. కారవాన్ బరువుగా ముందుకి కదిలింది.

* * *

"వ్హాట్! నరమాంస భక్షకుల్ని మీరు చూసారా?" అంది ఆశ్చర్యంగా నటి బార్బరా సుసాన్.

నా కథంతా విన్న తర్వాత ఆమె చేసిన ఆశ్చర్యార్థకం అది.

నవ్వుతూ తల వూపాను. "ఎస్ మిస్. బార్బరా! ఆశ్చర్యపోకండి కాని ఆనందపడకండి. వాళ్ళ దగ్గరికి నా బద్ధ శత్రువుని కూడా పంపలేను. అంత ప్రమాదకరమైన వ్యక్తులు వాళ్ళు."

చుట్టూ గుడారాలు... చెట్లకి మధ్య వ్రేలాడుతూ వెలుగుతున్న ట్యూబ్ లైట్లు... పవర్ వాగన్ లోంచి D.C. కరెంట్ వాటిల్లోకి సప్లయి చేయబడుతోంది.

సప్పర్ ముగించాక ఆరు బైట కుర్చీలు వేసుకొని మాట్లాడుకుంటున్నాం.

ఆ రాత్రి సమావేశంలో నేను, కాన్యోరా, కాకో-ప్రొఫెస్సర్ పాల్ మావ్, హాలీవుడ్ నటి బార్బరా సుసాన్, యింకా ఆఫ్రికా గైడ్ మిస్టర్ జెరీ, డైరెక్టర్ జాక్ ఫెల్లర్ వున్నారు.

"మిస్టర్ భయంకర్! మీరు కోబ్రా వృత్తాంతం సగం చెప్పి ఆపేసారు. అతనికి ఓ అతిహీనమైన కోరిక ఉండేదని చెప్పి మాటదాటించేసారు. వాట్సిట్?" అంది బార్బరా ఉత్సాహంగా ముందువున్న టీపాయ్ మీదకు వంగి.

నెయిల్ పాలిష్‌తో మెరుస్తున్న, ఆమె కుడిచేతి వ్రేళ్ళమధ్య పొడుగాటి సిగరెట్ పైప్ అందంగా కదులుతోంది.

మిస్. బార్బరా ప్రశ్న వినగానే నా పెదిమలు

బిగుసుకున్నాయి. సభ్యతకోసం తేలిగ్గా నవ్వేశాను. "మిస్. బార్బరా! ఆ విషయం కాన్స్యోరా చెప్తుంది" అన్నాను నేనూ, సిగరెట్ కోసం కోటుజేబుల్లో చేతులు పోనిస్తూ.

"చెప్పండి మిస్. కాన్స్యోరా! అనవసరంగా సస్పెన్సులో ముంచేస్తున్నారు" ప్రోత్సహించాడు పాల్ మార్ష్ నోట్లోంచి పొగాకు పైప్ బయటికి తీసి.

కాన్స్యోరా ఒక్క క్షణం కుర్చీలో యిబ్బందిగా కదిలింది. ఆమె పెదిమలు మెల్లగా విచ్చుకున్నాయ్. "మిస్ బార్బరా అండ్ జంటిల్మెన్! కోబ్రాతో మా అనుభవం ఓ పీడకల. అతను భయంకర్ని కోరిన కోరిక తల్చుకున్నప్పుడల్లా నా ఒళ్ళు జలదరిస్తుంది..."

"హూమో సెక్సువల్లా?" మధ్యలో కలగజేసుకుంటూ అడిగాడు డైరెక్టర్ జాక్ షెల్లర్.

"కాదు" అంది క్లుప్తంగా కాన్స్యోరా.

పాల్ మార్ష్, డైరెక్టర్ కేసి కోపంగా చూశాడు మధ్యలో మాట్లాడవద్దన్నట్లు.

డైరెక్టర్ నవ్వి, ఆకాశంలో నక్షత్రాలవేపు చూసాడు.

"చెప్తాను" కంటిన్యూ చేసింది కాన్స్యోరా. "కోబ్రా ఓ భయంకర మానసిక వ్యాధిగ్రస్తుడు. ఓ రోజు అతను పడగ్గదిలోకి వెళ్ళాడు. మెత్తగా, పరుపుగా పరుచుకొన్న జంతుచర్మాలను చేత్తో తడిమాడు..."

అంతా కాన్స్యోరాకేసి ఊపిరి బిగబట్టి చూస్తున్నారు. నేను చేతిలో కాల్తున్న సిగరెట్ కేసి తదేకంగా చూస్తూ ఉండిపోయాను.

"సరిగ్గా అప్పుడే అతన్కి ఓ ఆలోచన వచ్చింది. అది ఎంతో బలంగా అతని మెదడులో నాటుకుపోయింది. అది ఎంతటి బలమైన కోరికయ్యిందంటే తనకు ప్రతి రోజు నిద్రకూడా పట్టడంలేదనీ, రాత్రుళ్ళు పిచ్చిగా మంచంమీద దొర్లుతూ ఉంటాననే చెప్పేవాడు."

"ఇంతకీ ఆ కోరిక ఏమిటంటే..." ఒక్కసారి అందరి ముఖాల్లోకీ చూసి వాక్యం పూర్తి చేసింది శాన్యోరా. "మనుషుల చర్మాలతో కుట్టిన పరుపుమీద అతనికి పడుకోవాలని వుండేదట."

"మై...గాడ్..."అన్నారు శ్రోతలంతా నోళ్లు తెరిచే సంభ్రమంగా.

"యస్. మిస్. బార్బరా, అండ్ జంటిల్మెన్! ఆ పరుపునే మేము కుట్టాలి. ఎవరి చర్మాలతో తెల్సా?... అతని నీగ్రో అనుచరులను మేము చంపి, వారి తోళ్ళు తీసి..."

"ఇటీజ్ జస్ట్ హారిబుల్!" అరిచారంతా ఒక్కసారిగా.

బరువైన గుండెతో తల వూపింది శాన్యోరా.

"ఇటీజ్ ట్రూ మిస్టర్ పాల్‌మాన్!" అన్నాను మధ్యలో కలుగజేసుకుంటూ.

"అటువంటి మానసినవ్యాధి పూర్వం మనుగడలో వుండేది. మీరు హిట్లర్ చరిత్ర చదివేవుంటారు. అతని కాలంలో ఓ జర్మన్ ఆఫీసర్ భార్య..."

"ఎస్ మిస్టర్ భయంకర్! ఐగాట్ యిట్. వాకిప్పుడే జ్ఞాపకం వస్తోంది" అంది బార్బరా. "ఆమె పేరు ఇల్‌స్కోచ్. తన హబ్బీక్రింద పని చేస్తున్న సైనికులను

తన అందంతో ఊరించి, పడగ్గదిలోకి ఆహ్వానించి దారుణంగా చంపించేది. ఆ మనిషి చర్మాలను తలగడగలేబులు గాను, బెడ్ షీట్లుగానూ, టేబిల్ లాంప్ షేడ్స్ గానూ కుట్టించుకునేది. యామ్ ఐ కరెక్ట్?" అంటూ ఆగింది.

"దట్సిట్-సుసాన్! అదే విధమైన మానసిక రుగ్మత మాకు కోబ్రాలో కనిపించింది. అతని కోరిక తీర్చడానికి మమ్మల్ని పావులుగా ఉపయోగించాలని చూశాడు. లక్కీగా మేము-ముందుగానే ఎస్కేప్ అయ్యాం. తర్వాత అతను లావాలో కల్సి చనిపోయాడు."

నా చివరి మాటలకు అందరూ ఉలిక్కిపడ్డారు.

"లా...వా!" అంది ప్రశ్నార్థకంగా బార్బరా.

ఆ సంఘటన చెప్పానందరికీ.

"యూ పూర్ పాల్ మావ్! వుయ్ మిస్డ్ ఎ నైస్ అండ్ నాచురల్ షాట్! భయంకర్ని ఓ పదిమైళ్ళ అవతల చూసిఉంటే అగ్నిపర్వతం ప్రేలిన దృశ్యాన్ని సుందరంగా, సెల్యూలాయిడ్ పైకి ఎక్కించి ఉండే వాళ్ళం..."

"స్టాపిట్ సుసాన్!" అర్చాను అకస్మాత్తుగా.

అందరూ ఉలిక్కిపడి నాకేసి చూశారు.

మెల్లగా తేరుకున్నాను. "అయామ్ సారీ మిస్ సుసాన్ అండ్ జంటిల్మెన్! మనవాళ్ళే అందులో మాడి మసైపోతే అలా అనగలమా? కోబ్రామీద కేవలం నాకు స్నేహం అపారమైన జాలి ఉన్నాయి. అతను లావాలో

దారుణంగా వేడికి కరిగిపోయి మరణించాడు. ఆ దృశ్యం చూసి...దాన్ని మీరు సరదాగా..."

"ఓహ్!" చటుక్కున పైకి లేచి నా భుజంపైన చేయి వేసింది బార్బరా. "అయామ్ సారీ మిస్టర్ భయంకర్! నోరు జారాను. మీ హృదయం గాయపడుతుందని ఊహించలేదు."

ఆమె మానర్స్‌కి సంతోషిస్తూ కృతజ్ఞతాపూర్వకంగా ఆమెవేపు చూసాను. "ఇట్సాల్ రైట్ మిస్ సుసాన్! నేనే తొందరపడ్డాను" అన్నాను బరువుగా నవ్వుతూ.

"మిస్టర్ పాల్ మావ్! నే నడిగిన సంగతి ఏం చేసారు?" అంది నవ్వుతూ శాన్యోరా.

"య్యా..." అంటూ ఏదో జ్ఞాపకం వచ్చినట్లు కోటు జేబులో చెయ్యిపెట్టి మడతపెట్టబడిన డ్రాయింగ్ షీట్ బైటికి తీసాడు పాల్ మావ్.

మడతలు విప్పి షీట్‌ని టీపాయిమీద పరిచాడు. ఆతృతగా చూసానా కాగితంలోకి.

అది ఓ మావ్.

ఆఫ్రికా అరణ్యాలకు సంబంధించినదని అర్థమైంది హెడ్డింగ్ చూసినతర్వాత.

"లుక్ ఓవర్ హియర్ మిస్టర్ భయంకర్ అండ్ మిస్ శాన్యోరా!" అంటూ గొంతు సవరించుకొని, పాల్ మావ్ వైపు తిరగేసి పట్టుకొని అందులోని ప్రాంతాలకేసి చూపించసాగాడు. "ఇక్కడనుంచి

మరో 40 మైళ్ళ దూరంలో 'మాసయ్' అనే ఓ ఆటవిక జాతి గ్రామం ఉంది.

"వాళ్ళకు నాగరికులు లేదా యితర ప్రాంతాల నుంచి వచ్చేవారంటే ఎంతో యిష్టమని, ఎంతో స్నేహ భావంతో ఉంటారనీ మా గైడ్ జైరీ చెప్తున్నాడు. అంతేకాదు. మా ప్రొడ్యూసర్లు తెల్సుకొన్న విషయాలను బట్టి యిది అత్యంత సుందరమైన ప్రదేశం. మా పిక్చర్ షూటింగ్ కి అన్నివిధాలా వీలైన నాచురల్ అండ్ సూపర్బ్ లొకేషన్. మాసయ్ తెగ మనుషుల సహాయంతో మా షూటింగ్ కొనసాగుతుంది.

"మిస్టర్ భయంకర్! ఇదంతా మీకు ఎందుకు చెప్తున్నానంటే మాసయ్ గ్రామంనుంచీ దాదాపు 100 మైళ్ళు మీరు ప్రయాణిస్తే పోర్టుసుడాన్ సరిహద్దుల్లోకి చేరతారు."

ఆ మాట అమృతప్రాయంలా తోచింది నాకు.

మళ్ళీ మనుష్యులమధ్యకు వెళ్తాం...

"ఈ దారిన వెళితే?" అడిగాను కుతూహలంగా చూపుడు వ్రేలితో మరో లైన్ చూపిస్తూ.

"మిస్టర్ భయంకర్! నేను చెప్పింది అడ్డదారి. ఈ రూట్ లో మీరు వెళ్తే దాదాపు 150 మైళ్ళు ప్రయాణించాల్సి ఉంటుంది."

కుడివైపు కూర్చున్న జైరీ దగ్గాడు. "పాల్ మాక్ చెప్పింది నిజం మిస్టర్ భయంకర్! అంతేకాదు. ఆ దారి మీకు ప్రయాణించడానికి వీలుగా వుండదు. దారి కడ్డంగా, దట్టంగా కొన్ని మైళ్ళ పొడవునా అలుముకు పోయిన వృక్షాలూ, యింకా వివిధరకాల నేచురల్ అబ్ స్ట్రక్షన్స్ బాధ ఉంది" అన్నాడు జైరీ.

"థాంక్స్ ఫర్ ది గైడెన్స్ జంటిల్మెన్! మేం మొదటి పద్ధతిలోనే ప్రయాణిస్తాం. కారవాన్ 'మాసయ్' గూడాన్ని సమీపించగానే ఎట్టి అలక్ష్యం లేకుండా, మేం అడ్డదారిన పోర్ట్‌సూడాన్ సరిహద్దుల్లోకి ట్రావెల్ చేస్తాం. కాని మీ సహాయం నాకు కావాలి."

"ఏమిటది?" అన్నాడు పాల్‌మావ్.

" 'అప్పుడు' మాకు మీరు ఓ జీపుని యిచ్చి పుణ్యం కట్టుకోవాలి" చెప్పాను అర్థింపుగా చూస్తూ.

గలగలా నవ్వాడు పాల్‌మావ్. "అదేం పెద్ద సహాయంకాదు మిస్టర్ భయంకర్! అర్నెల్లకో వాహనం మారుస్తుంటాం మేము హాలీవుడ్‌లో. ఇట్సాల్ రైట్. కెపాసిటీ విషయంలో కూడా ఫర్వాలేదు. మిగతా వెహికల్స్‌లోకి సర్దుకోగలం."

"వెరీ కైండ్ ఆఫ్ యూ సర్!" అన్నాను హృదయపూర్వకంగా.

"థాంక్యూ వెరీమచ్ సర్!" అంది కాన్స్యోరా.

"ఓకె. ఓకే. ఈ రాత్రికి యిక సంభాషణలు చాలించి, మనం పడుకోడానికి విడిపోదాం" అన్నాడు పాల్‌మావ్ పైకి లేస్తూ.

"మిస్టర్, భయంకర్! మీ యిద్దరికీ ఆ గుడారం కేటాయించాం" అన్నాడు పాల్‌మావ్, పైపు ఉన్న చేత్తో అర్ధచంద్రాకారంలో కట్టబడిన టెంట్స్‌లో ఓ టెంట్ వేపు చూపిస్తూ. "గుడ్ నైట్."

"గుడ్ నైట్ ఎవెరిబడీ!" అన్నాం కాన్స్యోరా, నేను ఒక్కసారి, చెయ్యెత్తి.

(సశేషం)

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్ట చివరిబొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి ఈ నెల 10వ తేదీ లోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరుకూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యాలతో 30 పై.లు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## మీరే ఎన్నుకోండి?

ఈ నెల ప్రచురింపబడిన నవలలు, కథలు, హాస్య రచనలలో ఏది ఉత్తమమైనవో, మాసపత్రికలో ప్రచురించబడిన బ్యాలెట్ పత్రంలో వ్రాసి పంపండి.

ఉత్తమ నవలకు రు. 200/-లు, ఉత్తమ కథకు రు. 100/-లు, ఉత్తమ జోక్‌కు రు. 20/- బహుమతి ఇవ్వబడుతుంది. ఇలాగే యీ మూడు ఉత్తమ రచనలను సరిగ్గా ఎన్నిక చేసిన పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10-/లు బహుమతి వుంటుంది.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యత్వము తీసుకుంటే, మీకు కాపీలు గ్యారంటీగా చేరుతాయి. పైగా పత్రిక ఖరీదులో కొంత తగ్గింపు లభిస్తుంది. సభ్యత్వము కోసం మీరు రు. 5/-లు పంపండి. మీకు ప్రతినెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 5/-లకే వి.పి. ద్వారా పంపబడతాయి.



# ప్రేమలో తమాషాలు

## "ఐ లవ్ యూ!"

చాలా రోజుల్నుంచి అతణ్ణి చూస్తున్నా. ఇవాళెందుకో అతగాణ్ణి చూస్తుంటే జాలి, కోపం రెండూ పెరుగుతున్నాయామెకు.

తనకంటె చిన్నవాడిలా కనుపిస్తున్నాడు. కాని ఆ చూపులేమిటి? ఆకలి చూపులు. తినేసే చూపులు. కాని అంతలోనే ఏదో నిశ్చయానికి వచ్చిందామె. ఓరగా అతని వంక చూపి నవ్విందామె.

గుండె గుబుల్ గుబుల్ మంటుండగా దూరంగా అదే బస్టాప్‌లో నిలబడి ఆమె వంక చూస్తున్నాడు అప్పారావు. చాలా రోజుల్నుంచి ఆమెతో పరిచయం అతనికి. మాటలతో కాదు. చూపులతోనే. కాని తన 'ప్రేమ'ను వ్యక్తం చేసే ధైర్యం లేకపోయింది.

ఆమె ప్రక్కనే కొద్దిదూరంలో వున్న ఒక హోటల్‌లో చొరబడింది. తిన్నగా ఫామిలీ రూంలోకి నడిచింది.

అప్పారావుకూడా జేబులు తడుముకుని, డబ్బులున్నాయని రూఢి పరుచుకుని, ఆమె వెనకే ఫామిలీ రూంలోకి దారి తీశాడు భయపడుతూనే.

తన వెనకేవచ్చి, తనకెదురుగా కూర్చున్న అప్పారావుని చూపి "మానర్ లెస్ బ్రూట్!" అనుకుని చిరునవ్వు నవ్వింది.

ఏం గొడవ చేయబోతుందో అనుకుంటున్న అప్పారావు ఆమె నవ్వటంతో రిలీఫ్ ఫీలయ్యాడు.

"హలో!" అందావిడ.

"ఐ .... ఐ .,.. లవ్ ....యు!" అనబోయి....నోరు తెరిచాడు అప్పారావు. ఇంతలోనే సర్వర్ మహాశయుడు వేంచేశాడు. అతడిని మనసులోనే తిట్టుకున్నాడు అప్పారావు.

"చెప్పండి ఏం కావాలి?"

కోకిల కంఠంలా వుందనుకున్నాడు అప్పారావు.

"మీరు చెప్పండి!" అన్నాడతను.

"సరే!" అని ఇడ్లీలకు ఆర్డర్ యిచ్చిందావిడ. ఇడ్లీ వచ్చాయి.

"వెధవ బస్. రోజూ లేట్! వస్తున్నాననుకోండి!" ముద్దు ముద్దుగా అందావిడ.

"అవునండి!" ఒప్పేసుకున్నాడు అప్పారావు.

టిఫిన్ పూర్తయింది. కాఫీలు వచ్చాయి. ఇద్దరూ సిప్ చేయసాగారు.

"ఐ....ఐ...." అనబోతున్నాడు అప్పారావు.

"మీ పేరు చెప్పారు కాదూ?"

రెండు క్షణాలు ఆలోచించి "నవీన్" అన్నాడు అప్పారావు.

"అబ్బ! చాలా బాగుందండి!"

"అయితే నేను బాగాలేనా?" అనుకొని, నిరాశగా ముఖం పెట్టాడు అప్పారావు

"అబ్బ! మిమ్మల్ని చూస్తుంటె మా యింట్లో కుక్క పిల్ల గుర్తుకొస్తుందండీ, దానికి బిస్కట్ యివ్వకపోతే

సరిగ్గా మీలానే ఫోజు పెడుతుంది!"

డీలా పడిపోయాడు అప్పారావు. ఏ దేవానందో, ధర్మేంద్రో, అంటుందేమో ననుకుంటె కుక్కపిల్లతో పోల్చుతుందా? పోనీలే! ఆడపిల్ల తెలియదు.

"నా పేరు అడగరే?" అంది.

"చెప్పండి."

"సూరమ్మ. పూర్తి పేరు వెంకటసూరమ్మ."

"ఛూ!" తాగుతున్న కాఫీని క్రిందకి ఊశేసాడు అప్పారావు.

"అయ్యయ్యో! ఏమిటండీ! నా పేరు అంత యిదిగా ఉందా?" బుంగమూతితో అడిగిందావిడ.

"ఛ....ఛ....మీ పేరుకేమండి, కాఫీలో బొద్దింక వుంది."

"ఈ హోటల్సన్ని యింతేనండి. ఏదీ సరిగా మెయిన్ టెయిన్ చేయరు. అందుకే నేనెక్కువగా రాను. పదండి మేనేజరుకి రిపోర్టు చేద్దాం!"

"ఈ మాత్రందానికి గొడవెందుకు లెండి" అన్నాడు అప్పారావు.

"అలా వూరుకోకూడదండీ. తెగించిపోతారు."

ఇద్దరూ బయటికి నడిచారు. అప్పారావే బిల్లు చెల్లించాడు.

సూరమ్మ! అంత అందమయిన ఆడపిల్లకి అంత చెండాలపు పేరు పెట్టిన ఆమె తల్లిదండ్రులను కోప్పడ్డాడు మనసులోనే. అయినా పేరుదేముందిలే, మార్చుకుంటే సరి! అనుకున్నాడు.

బయట ఎండ అదిరిపోతూంది.

"బస్ వెళ్ళిపోయినట్లుంది. ఇక టాక్సీనో, ఆటోనో, గతి!" అంది సూరమ్మ.

అప్పారావు టైం ఆసన్నమయిందని గ్రహించాడు.

"అవునండీ, మీకీ రెండు జడలు చాలా బాగున్నాయి. ఎంతో అందంగా వున్నారు. ఐ....ఐ...."

"నిజంగా...." మధ్యలో అందుకుంది సూరమ్మ. ఆమె కళ్ళు మెరుస్తున్నాయి.

"అందరూ అంటుంటారండి, రెండు జెడలు నాకెంతో బాగుంటాయని. ఇంతవరకెందుకు?—మా వారు కూడా అదేమాట అంటుంటారు. మర్చేపోయాను, మా వార్ని గురించి చెప్పనేలేదు కదూ. వారు డాక్టరు. ఎప్పుడైనా అవసరంవస్తే రండి మందు తీసుకొని వెళుదురు గాని."

ఆగకుండా చెబుతున్న ఆవిడ ప్రక్కకు తిరిగింది. కాని అతను కనుపించలేదు.

ఇంకెక్కడి అప్పారావు! అప్పుడే అటుగా వెళుతున్న ఏదో సిటీబస్‌లో కూర్చుంటానని ఖాళీలేక నిలబడే మూర్ఛ పోయి ఉన్నాడా టైంలో.

నవ్వుకుంది సూరమ్మ ఉరఫ్ మిస్. సూర్యప్రభ.

—పి. సంపత్‌కుమార్, తెనాలి.

## కట్నం-?

రాము:—నీ పెండ్లికి మీ మామగారు కట్నం ఏమిచ్చారు?

శ్యాము:—మా మామగారిని అడిగితే ఏమన్నారో తెలుసా! పండ్లు అన్నీ ఊడగొట్టి వాటి స్థలంలో బంగారు పండ్లు పెట్టేస్తానన్నారు.

—'డ్యగల్'

# దొంగను పట్టిన ఫోన్!

నా తెలివితేటలమీద నాకు చాలా నమ్మకముంది. ఇప్పటికి దాదాపు 5, 6, సార్లు దొంగతనం చేసినా ఎప్పుడూ పట్టుబడలేదు, ఒక్కసారి తప్ప.

ఆ ఒక్కసారి కూడా చిన్న పొరపాటు జరిగింది. మామూలుగానే ఆ ఇంటిలో ఆ ఇల్లాలు ఒక్కత్తే ఉండగా జొరబడ్డాను. ఆమె కాళ్ళు చేతులు కట్టి నోట్లో గుడ్డలు కుక్కి నాపని నేను చూసుకుంటున్నాను. ఇంతలో ఫోన్ మోగింది. రెండు నిముషాలు ఆలోచించి దాన్ని ఎత్తకుండా అలాగే వదిలేసి నాపని చూసుకున్నాను. రెండు నిముషాలు మోగి ఆగిపోయిందది.

మరో పదినిముషాల తర్వాత నేను నాపని ముగించుకుని బయటికి వచ్చేసరికి ఆ ఇంటి యజమాని ఎదురయ్యాడు. ఇంక చేసేదేముంది? 'దొంగ దొంగ' అంటూ ఆయన అరవగానే నిముషాల్లో పోగయ్యారు జనం. నెల రోజులు పడింది నాకు శిక్ష.

ఆ తర్వాత తెలిసింది. ఆ ఇల్లుగలావిడకు ఫిట్సు వ్యాధి వుందిట, ఆయన క్లబ్‌నుంచి ఇంటికి ఫోన్‌చేస్తే రెండు నిముషాలయినా ఎవరూ జవాబివ్వకపోవడంతో ఖంగారుపడి ఇంటికి వచ్చాట్ట, మళ్ళీ ఆవిడకు ఫిట్ వచ్చిందేమోనని. ఈ సంగతి తెలిసిన తర్వాత నన్ను నేను తిట్టుకున్నాను ఆ ఫోన్ ఎత్తనందుకు. మళ్ళీ అలాంటి పొరబాటు జీవితంలో ఎప్పుడూ చేయవద్దనుకున్నాను.

ఆ రోజు శనివారం అనుకున్న ప్లానుప్రకారం నేను, జగ్గు ఆ బంగ్లా దగ్గరకు వెళ్ళాం.

జగ్గు ఏదో పని వున్నట్టు వాచ్‌మెన్ దగ్గరకు వెళ్ళి

అతనితో మాటలు పెట్టుకున్నాడు. వెనక మాటుగా వెళ్ళి దెబ్బ తీశాను నేను. తల పక్కకి వాల్చేశాడతను. ఇద్దరం కలిపి వాణ్ణి లోపలకులాగి మొక్కల చాటున పడేశాము.

తలుపుమూపి లోపలికెళ్ళాం ఇద్దరం.

పైన గదిలో అదమరచి నిద్రపోతోంది ఒక యువతి. దగ్గరగా వెళ్ళిచూశాను. స్పృహ తప్పివుంది.

అప్పటిదాకా గమనించలేదు నేను. ఆ గదిలో ఏదో శబ్దం వినపడుతోంది. రెండునిముషాలు శ్రద్ధగా గమనించాను. అది ఆ బిల్డింగ్ నానుకునివున్న బియ్యం మిల్లు లోంచి వస్తోంది.

జగ్గు బయట నిలబడ్డాడు కాపలాగా. నేను ఇనప్పెట్టె ముందు కూచున్నాను పనిముట్లన్నీ పెట్టుకొని.

15 నిముషాలు గడిచాయి. మెల్లిగా తెరుచుకుంది ఇనప్పెట్టె. ఆనందంతో ఒక్కసారిగా నిట్టూర్చాను నేను.

అంతలో "ట్రింగ్, ట్రింగ్" మంటూ మోగింది ఫోన్.

ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాను నేను. రెండునిముషాలు అలాగే నిల్చుండిపోయాను.

ఇంతకుముందు నేను పట్టుపడిన వుదంతం జ్ఞాపకం వచ్చింది.

ఇనప్పెట్టెకేసి చూశాను. ఇంతకుముందు చేసిన పొరపాటు మళ్ళీ చేయకూడదనుకున్నాను.

ఇంకేం ఆలోచించకుండా వెళ్ళి ఫోన్ ఎత్తాను.

'హలో' అన్నాడొక మగగొంతు అవతల్నించి.

"హలో ఎవరూ?" అన్నాను గొంతుమార్చి.

"ఎవరు మాట్లాడేది" అవతల్నించి మళ్ళీ వినిపించింది.

"నేను రంగారావ్‌ని" అన్నాను.

"ఇది 39617 కదూ" అవతల్నించి వినిపించింది.

"సారీ! రాంగ్ నెంబర్!"

అవతల్నించి ఫోన్ పెట్టేసిన శబ్దం వినిపించి రెండు నిముషాలు అలాగే నిలబడ్డాను. మళ్ళీ ఫోన్ మోగుతుం దేమోనని. మరో పావుగంట తర్వాత డబ్బు మూటగట్టు కొని నేను, జగ్గూ బయటికి వచ్చాము.

అప్పుడే పోలీసు జీప్‌వచ్చి ఆగింది మాపక్కన.

ఉలిక్కిపడ్డాం ఇద్దరం.

మా ఇద్దర్నీ బంధించి పోలీసు స్టేషనుకు తీసుకు పోతారు. నా కర్థంకాలేదు నేనెక్కడ పొరపాటు చేశానో.

విచారణ జరుగుతూ వుండగా తెలిసింది నేను చేసిన పొరపాటు.

ఆ ఆఫీసరు వాళ్ళ ఫ్రెండింట్లో భోజనానికి వెళ్తున్నా నని చెప్పడానికి ఫోన్ చేశాడట. నేను ఫోన్ ఎత్తినపుడే అనుమానం వచ్చిందట. అంతేకాక. పక్కనున్న మిల్లు శబ్దం స్పష్టంగా వినిపించిందట ఫోన్‌లో. దాంతో అను మానంవేసి టాక్సీ వేసుకు ఇంటికి వచ్చాట్ట. ఇంటిముందు వాచ్‌మెన్ లేకపోవడంతో పూర్తిగా తీరిపోయింది అను మానం. వెంటనే పోలీసులకి ఫోన్‌చేసి తెలిపాడు.

ఇదంతా విన్న తర్వాత తల తిరిగిపోయింది నాకు. ఆరోజు ఆ ఫోన్ ఎత్తకుండా వుంటే బాగుండేది. ఐదు నిముషాల తర్వాత ఆయనే ఊరుకునేవాడట ఆవిడ నిద్ర పోతోందని. ఇంక ఇప్పుడు ఏమనుకుని ఏంలాభం. ఈసారి నాకు శిక్ష రెండు సంవత్సరాలు పడింది.

—ఎస్. ఎస్. ప్రసాద్- హైద్రాబాద్-4

